జాతీయ
# స్ఫూర్తి
పక్షపత్రిక
2020 ఫిబ్రవరి 1-29
సంపుటి : 28 సంచిక : 9-10
వెల : రూ. 50
RNI Regn No. 52879/93



1820 - 2020

# ఫ్రెడరిక్ ఎంగెల్స్

## ద్విశత జయంతి ప్రత్యేక సంచిక

C I

కార్మికవర్గం తనకు అవసరమయిన వాటిని పెట్టుబడిదారుల నుంచి మాత్రమే తీసుకోగలదు,
కానీ, ఈ పెట్టుబడిదారుల గుత్తస్వామ్యాన్ని రాజ్యం తన శక్తియుక్తులన్నింటినీ ఒడ్డి మరీ కాపాడుతోంది !

- ఎంగెల్స్

*Our best wishes to*
*Friedrich Engels Bicentenary*



# Bank of Baroda Employee's Union

(AP and Telangana States)

**HYDERABAD**



*Y. Janaki Ram*
**President**

*P. Ajay Kumar*
**General Secretary**

జాతీయ స్ఫూర్తి పక్షపత్రిక

వ్యవస్థాపక సంపాదకులు, ప్రచురణకర్త
నిడదవోలు వెంకటేశ్వరరావు

2020 ఫిబ్రవరి 1-29 సంపుటి : 28 సంచిక : 9-10

డి.వి.వి.యస్. వర్మ, ప్రధాన సంపాదకులు

సంపాదక వర్గం
డా॥ బి. రమేష్‌చంద్రబాబు
కొప్పర్తి వెంకట రమణమూర్తి
డి. సోమసుందర్
మందలపర్తి కిషోర్

వెల : 50/- రూపాయలు

## ఎంగెల్స్ ద్విశత జయంతి ప్రత్యేక సంచిక గురించి...

ఎంగెల్స్ ద్విశత జయంతి సందర్భంగా జాతీయ స్ఫూర్తి ఈ ప్రత్యేక సంచికను రూపొందించింది. ఒక చిన్న పత్రికకు ఇది పెద్ద సాహసం అని మాకు తెలుసు. ఎంగెల్స్‌కు గల ప్రాధాన్యతరీత్యా ఇది అవసరం అని భావించాం.

మార్క్స్ - ఎంగెల్స్‌లు ఒక అపురూపమైన జంట. మార్క్స్‌కి ఎంగెల్స్ నీడ కాదు. సహచరుడు, స్వయంప్రకాశం గలవాడు. ఈ ఇద్దరు హేమాహేమీల కలయిక వల్లనే మార్క్సిజం ఒక పరిపూర్ణ సిద్ధాంతంగా వెలుగుచూసింది.

ఇది ఎంగెల్స్ ద్విశతజయంతి గనుక ఎంగెల్స్ రచనల చుట్టూ ఈ సంచిక తిరగడం సహజం. ఎంగెల్స్‌పై ఈ సంచిక సమగ్రమైందిగా మేం చెప్పడం లేదు. అంతే కాదు మార్క్సిస్టు భావజాలానికి ఒక సమగ్ర సిద్ధాంతరూపం ఇచ్చిన ఎంగెల్స్ రచన "యాంటీ డ్యూరింగ్", కార్మికుల కోసం సరళంగా వివరించిన "సోషలిజం-ఊహాజనితమూ, శాస్త్రీయమూ" అన్న పుస్తకాల పరిచయం లేకపోవడం పెద్ద లోటే. అందుకే వాటి పరిచయాలను, ఇతర పుస్తకాల పరిచయాలను ఇంగ్లీషులో ఇస్తున్నాం.

ఎంగెల్స్ ద్విశతజయంతి సంవత్సరంలో శాస్త్రీయ సోషలిజంపై అధ్యయనం చేసే వారికి, ప్రచారం సాగించే వారందరికీ ఉపయోగపడుతుందని ఆశిస్తున్నాం.

చాలా మంది రచయితలు పూనుకోకపోతే ఈ సంచిక సాధ్యమయ్యేది కాదు. అలాగే వివిధ కార్మిక సంఘాలు తమ ప్రకటనల ద్వారా చేయూతనివ్వకపోతే ఈ సంచిక వెలుగు చూసేది కాదు. అందరికీ పేరు పేరునా సంపాదకవర్గం కృతజ్ఞతలు తెలుపుకుంటున్నది.

## ఈ సంచికలో...

### ఎంగెల్స్ జీవిత విశేషాలు



### ఎంగెల్స్ పలు కోణాలు



### ఎంగెల్స్ రచనల పరిచయం



### ఎంగెల్స్ స్వీయ రచనలు

# ఎంగెల్స్ చేతి చిత్రాలు














F. Liszt
























# శ్రామిక విప్లవయోధ ఎంగెల్స్



**ముత్యాల ప్రసాద్**
ఎడిటర్, విశాలాంధ్ర



జర్మనీలోని బార్మెన్ నగరంలో 1820 నవంబరు 28వ తేదీన ఎంగెల్స్ జన్మించారు. తండ్రి సంపన్నుడైన జౌళి పారిశ్రామికవేత్త. బాల్యం నుంచే ఎంగెల్స్ తన చుట్టూ ఉన్న సమాజంలోని పేదరికపు బాధలను గమనించారు. 1839లో తను రాసిన తొలి రచన 'వుప్పెర్ టాల్ లేఖావళి'లో బార్మన్, ఎల్బర్ ఫెల్డ్‌లకు చెందిన ఫ్యాక్టరీ కార్మికులు, చేతివృత్తిదారులు, వృత్తిపనివారల కఠోర జీవితాన్ని అక్షరీకరించారు. అత్యంత చురుకైన ఎంగెల్స్ విద్యార్థి దశలోనే సాహిత్యం, చిత్రకళ, సంగీతం, విదేశీ భాషలకు ఆకర్షితుడయ్యారు. గుర్రపుస్వారీ, కత్తి సాము, ఈతలో మేటిగా ఉండేవారు. ఎంగెల్స్ తన తండ్రి పోరు పడలేక ఉన్నత పాఠశాల విద్యకు స్వస్తి పలికి బ్రెమెన్ నగరంలోని వాణిజ్య సంస్థలో ఉద్యోగానికి వెళ్లారు. ఇక్కడే ఆయన ఇంగ్లీషు, డచ్చి, ఫ్రెంచి తదితర భాషల్లో పట్టు సంపాదించారు. దాదాపు ఆయనకు 25 భాషలు వచ్చు. ఇక్కడే కవి ఫెర్డినాండ్ ఫ్రైలిగ్రాత్ ప్రభావంతో కవిత్వ రచన ప్రారంభించారు. అనేక గ్రంథాలను అధ్యయనం చేశారు. డేవిడ్ స్ట్రాస్ రాసిన దాస్ లెబెన్ యేసు (ఏసు జీవితం) పుస్తక ప్రభావంతో మతంతో ఆయన తెగతెంపులు చేసుకున్నారు. సంకుచిత మత విశ్వాసాల స్థానంలో నూతన ప్రపంచ దృక్పథాన్ని రూపొందించుకునే ప్రయత్నంలో రాజకీయ సమస్యలపై ఎంగెల్స్ దృష్టి మళ్లించారు. ఎఫ్. ఓస్వాల్డ్ పేరుతో టెలిగ్రాఫ్ ఫర్ డాయిష్ లాండ్‌లో రాసిన వ్యాసాలలో మూర్ఖత్వంతో కరుడుకట్టిన అక్కడి దోపిడీ సమాజాన్ని క్రోధనల జ్వాలలకు గురి చేశారు. దీంతో ఆ సమాజమంతా అట్టుడికినట్టుడికిపోయింది. ఆ వ్యాసాల్లో ఎంగెల్స్ ఉత్సాహపరుడైన విప్లవ ప్రజాస్వామ్యవాదిగా దర్శనమిచ్చారు. విశాలమైన ప్రపంచ దృక్పథం, విప్లవాత్మక స్వభావం, శ్రమజీవుల పట్ల చిత్తశుద్ధితో కూడిన సానుభూతి.. యువకుడైన ఎంగెల్స్‌ను తను జీవిస్తున్న సమాజం కన్నా ఉన్నతంగా నిలిపాయి. 1841లో ఎంగెల్స్ వుప్పెర్ లాల్‌కు తిరిగి వచ్చి మిలటరీ సర్వీసులో చేరారు. సైనిక శాస్త్రాన్ని అభ్యసించారు. బెర్లిన్ విశ్వవిద్యాలయంలో బయటి విద్యార్థిగా తత్వశాస్త్రోపన్యాసాలు వినేవారు. బెర్లిన్‌లోని హెగెలియస్ట్ కేంద్రంలో సభ్యుడిగా కూడా చేరారు. వామపక్ష యువ హెగెలియన్లు జరుపుతున్న తాత్విక పోరాటాల్లో ఆయన చురుకుగా పాల్గొన్నారు. 1842 అక్టోబరు 8న ఆయన నిర్బంధ సైనిక శిక్షణ ముగిసింది. తండ్రి ఆదేశం మేరకు ఆయన ఇంగ్లండులోని మాంచెస్టరులో ఎర్మెన్ అండ్ ఎంగెల్స్ నూలు మిల్లులో వాణిజ్య శిక్షణ తీసుకున్నారు. బ్రిటన్ నివాసం ఆయన జీవితాన్ని మలుపు తిప్పింది. ఇంగ్లండులోని తీవ్రమైన వర్గ వైరుధ్యాలు ఎంగెల్స్ దృష్టిని విశేషంగా ఆకర్షించాయి. సాహిత్యంతోనూ, అధికార పత్రాలతోనూ ఎంగెల్స్ సరిపెట్టుకోక, కార్మికుల జీవితాలనూ, అభిప్రాయాలనూ, వారి పోరాట రూపాలనూ, పద్ధతులనూ అధ్యయనం చేశారు. ఇంగ్లండులో కార్మికవర్గ పరిస్థితి అన్న తన పుస్తకానికి దాన్నే భూమికగా వాడుకున్నారు. గ్యార్గ్‌వీర్త్ అనే జర్మన్ కవి ఎంగెల్స్ ప్రతిభను, కృషిని గుర్తించారు. అప్పుడే ఇంగ్లండులో జరిగిన చార్టిస్టు ఉద్యమంతోనూ ఎంగెల్స్ మమేకమయ్యారు. ఊహాజనిత సామ్యవాద ప్రవక్తల్లో ఒకరైన రాబర్ట్ ఓవెన్ భావాలను ప్రచారం చేసే బ్రిటీష్ సోషలిస్టులతో కూడా ఎంగెల్స్ పరిచయం పెంచుకున్నారు. వారి పత్రిక ది న్యూ మోరల్ వరల్డ్ ఫ్రాన్స్, జర్మనీ, స్విట్జర్లాండ్‌లోని సోషలిస్టు ఉద్యమాన్ని గురించి, ఫ్రెంచి ఊహాజనిత సోషలిస్టు సిద్ధాంతకర్తలైన సెయింట్ సైమన్, ఛార్లెస్ ఫొరియెర్‌ల సిద్ధాంతాలను, ఎటీన్ కేబిట్, పీరీ లెరో, పీరీజోసోఫ్ ప్రౌధన్, విల్ హెల్మ్ వైట్లింగ్ దృక్పథాలను బ్రిటిష్ కార్మికులకు పరిచయం చేసేవారు. జర్మన్ భావవాద తత్వశాస్త్రానికి శిఖరాయమానమైన హెగెల్ బోధనలను వారికి తెలిపేవారు. వారి దృక్పథాలు, భావాల్లోని బలహీనతలు, లోపాలను ఎత్తి చూపించేవారు. ప్రపంచ సంస్కృతికి వారు చేసిన నిర్మాణాత్మకమైన సేవను కూడా ఆయన వివరించేవారు. కారల్ మార్క్స్, ఆర్నాల్డ్ రూగెల సంపాదకత్వంలో 1844 ఫిబ్రవరిలో పారిస్ నుంచి వెలువరించిన డయష్ ఫ్రాన్జోసిషె యార్ బ్యూషర్‌లో ఎంగెల్స్ జాతీయార్థిక వ్యవస్థపై సంక్షిప్త విమర్శతో వ్యాసం రాశారు. ఇది బూర్జువా అర్థశాస్త్రాన్నీ, తత్పర్యవసానంగా పెట్టుబడిదారీ విధానాన్నీ.. శ్రామికవర్గ దృక్పథం నుంచి ఎంగెల్స్ విమర్శించారు. ఈ తరహా మొదటి రచన ఇది. దీనిలో మానవుణ్ణి ద్వేషించే అభివృద్ధి నిరోధకమైన మాల్తూస్ సిద్ధాంతాలపై ఎంగెల్స్ దాడిచేశారు. ఇంగ్లండ్‌లో ఉండగా ఎంగెల్స్ చేసిన రచనలను పరిశీలించినట్లయితే ఆయన క్రమంగా భౌతికవాద ప్రపంచ దృక్పథం వైపు పయనించినట్లు స్పష్టమవుతున్నది. గతం, వర్తమానం అనే గ్రంథంలో కొత్త మతాన్ని ప్రతిపాదించడానికి థామస్ కార్లెల్




చేసిన ప్రయత్నాన్ని భౌతికవాద, నాస్తిక దృక్పథంతో ఎంగెల్స్ ఖండించారు.

పారిస్‌లో మార్క్స్‌తో కొద్ది రోజుల పాటు కలిసి ఉన్న సమయంలో ప్రారంభించిన తమ ఉమ్మడి రచనలోనే, విప్లవాత్మకమైన భౌతికవాద తత్వశాస్త్రానికి వారు పునాది వేశారు. దీనిలో అధిక భాగం మార్క్స్ కృషే. అదే 'ది హోలీ ఫ్యామిలీ'. దీనిలో రాజకీయ రంగం నుంచి నిష్క్రమించి కేవలం పరిశుద్ధ తత్వశాస్త్రం రంగానికే పరిమితమైపోవాలనుకునే జర్మన్ మేధావి వర్గంతోనూ, బ్రూనో బావర్‌లాగ తమను తాము తాత్విక నాయకులుగా పరిగణించుకుని శ్రామికవర్గాన్ని అలగా జనంగా చూసే వారితోనూ బలా బలాలు తేల్చుకోవాలను కున్నారు. అన్ని రకాల దోపిడీకీ, పీడనకూ స్వస్తి చెప్పే బాధ్యత కార్మికవర్గానిదేనని నిర్ణయించుకొని బ్రూనో బావర్‌తో, అతనిలాంటి తత్వవేత్తలతో వీరిద్దరూ పూర్తిగా తెగతెంపులు చేసుకున్నారు. దీన్నే లెనిన్ ఇలా అన్నాడు– 'సోషలిస్టు సమాజ నిర్మాతగా శ్రామిక వర్గానికి గల చరిత్రాత్మక పాత్రను స్పష్టం చెయ్యడమే మార్క్స్–ఎంగెల్స్ సిద్ధాంతంలోని ప్రధానాంశం.' ఈ ప్రతిపాదనే సోషలిజాన్ని ఊహజనిత స్వర్గ స్థాయి నుంచి శాస్త్రీయస్థాయికి మార్చింది. దానికి వాస్తవికమైన పునాదిని చేకూర్చింది. విప్లవాత్మకమైన వర్గంతో దాని భవితవ్యాన్ని ముడి పెట్టింది.

ఇంగ్లండ్ నుంచి జర్మనీలోని సొంతూరు వచ్చిన ఎంగెల్స్ ఇక్కడ ఉండలేక 1845లో తిరిగి మార్క్స్ ఉన్న బ్రసెల్స్‌కు వెళ్లారు. ఇక్కడే మార్క్స్, ఎంగెల్స్‌లు తమ నూతన భావాలను 'ది జర్మన్ ఐడియాలజీ' అనే పెద్ద గ్రంథంలో పొందుపర్చారు. చారిత్రక భౌతికవాదానికి సంబంధించిన ప్రాతిపదిక సూత్రాలు దీనిలో సంక్షిప్తంగా ప్రతిపాదించారు. భావి కమ్యూనిస్టు సమాజ రూపురేఖలు దీనిలోనే రేఖా మాత్రంగా దర్శనమిస్తాయి. విప్లవ సిద్ధాంతానికీ, కార్యాచరణకీ మధ్య ఉండాల్సిన అవిభాజ్య ఐక్యత గురించి ఉన్నతస్థాయి సిద్ధాంతపు క్రియాశీల, పరివర్తనాత్మక పాత్రను గురించి వారు నొక్కి వక్కాణించారు. శాస్త్రీయ కమ్యూనిజం, గతితార్కిక, చారిత్రక భౌతికవాదానికి సంబంధించిన సైద్ధాంతిక, తాత్విక సూత్రాలను రూపొందించడంలో ది జర్మన్ ఐడియాలజీ ఒక ముఖ్యమైన ఘట్టం.

వివిధ దేశాల్లోని సోషలిస్టు, కార్మికోద్యమ ప్రతినిధులను ఐక్యం చేసేందుకు, వారితో ఉత్తర ప్రత్యుత్తరాలు నెరిపేందుకు మార్క్స్–ఎంగెలు 'ది బ్రసెల్స్ కమ్యూనిస్టు కరెస్పాండెన్సు కమిటీని నెలకొల్పారు. జర్మనీ, పారిస్, ఇంగ్లండ్ తదితర ప్రాంతాల్లోని కమ్యూనిస్టు గ్రూపులతో సంబంధాలు పెట్టుకున్నారు. మార్క్స్–ఎంగెల్స్‌ల కొత్త సిద్ధాంతం కార్మికుల్లోకి చొచ్చుకుపోతున్నది. ఈ దశలో పారిస్ వెళ్లిన ఎంగెల్స్.. అక్కడ జరిగిన సమావేశంలో కమ్యూనిస్టుల లక్ష్యాన్ని వివరించారు. బూర్జువా వర్గ ప్రయోజనాలకు వ్యతిరేకంగా శ్రమజీవుల ప్రయోజనాలను బలపరచడం, ప్రైవేటు యాజమాన్యాన్ని రద్దుచేసి దాని స్థానంలో ఉమ్మడి యాజమాన్యాన్ని ప్రవేశపెట్టడం ద్వారా దాన్ని సాధించడం. హింసాయుత ప్రజాతంత్ర విప్లవం ద్వారానే ఈ లక్ష్యాలు సాధించగలం. ఎంగెల్స్ చేసిన ఈ ప్రతిపాదనపై ఓటింగ్ జరిగి చివరకు లీగ్ ఆఫ్ ది జస్ట్ శాఖలోని వారు తమను తాము కమ్యూనిస్టులుగా ప్రకటించుకున్నారు. మార్క్స్– ఎంగెల్స్ వ్యక్తం చేసిన అభిప్రాయాలు సరైనవనీ, వాటికి ఒక ప్రణాళిక రూపం ఇవ్వాలని జోసెఫ్‌మోల్ తదితరులు కోరారు. 1847 జూన్ తొలి దినాల్లో లండన్‌లో లీగ్ మహా సభ జరిగింది. ఈ మహాసభలోనే 'లీగ్ ఆఫ్ ది జస్ట్' పేరు 'కమ్యూనిస్టు లీగ్'గా మారింది. మానవులందరూ సోదరులు అన్న లీగ్ పాత నినాదం స్థానే మార్క్స్–ఎంగెల్స్ ప్రతిపాదించిన 'ప్రపంచ కార్మికులారా! ఏకం కండు' అనే కొత్త నినాదం వచ్చింది.

మహాసభానంతరం మార్క్స్ అధ్యక్షుడిగా బ్రసెల్స్‌లో కమ్యూనిస్టు లీగ్ శాఖను స్థాపించారు. దీనికితోడు వారిద్దరు కలిసి బ్రసెల్స్‌లోనే 'జర్మన్ వర్కర్స్ సొసైటీ'ని స్థాపించారు. అది కూడా లీగ్ శాఖ ఆధ్వర్యంలోనే పని చేసింది. డాయిష్ బ్రుస్సెలర్ త్సైటుంగ్– ఎ పొలిటికల్ అండ్ ఎకనామిక్ రివ్యూ అనే పత్రిక ద్వారా వారు అనేక వ్యాసాలు రాశారు. సోషలిస్టు విప్లవం కోసం కార్మికవర్గం పోరాటం ప్రారంభించాల్సి ఉంటుందని తమ వ్యాసాల్లో వక్కాణించారు. కమ్యూనిస్టు లీగ్ ద్వితీయ మహాసభ సన్నాహక కృషికిగానూ 1847 అక్టోబరు మధ్యలో ఎంగెల్స్ మరోమారు పారిస్ వెళ్లారు. నవంబరు 20న ఈ కార్యక్రమం ముసాయిదా చిత్తుప్రతిని తయారుచేశానని ఎంగెల్స్ మార్క్స్‌కు తెలియజేస్తూ దాన్ని కమ్యూనిస్టు ప్రణాళిక అని పిలవాలని సూచించారు. 'కమ్యూనిస్టు ప్రణాళిక అని పిలిస్తే బాగుంటుందను కుంటాను. అందులో ఎంతో కొంత చరిత్ర కూడా వివరించాలి. కనుక ఇంత వరకూ అది ఉన్న రూపం బొత్తిగా అనువైనది కాదని నా ఉద్దేశం. ఇక్కడ నేను తయారుచేసినంత వరకూ నాతో తీసుకు వస్తాను. అది సాదా కథ రూపంలో సాగింది. అయితే, తొందర తొందరగా గీకేసిన మూలాన భాష అధ్వాన్నంగా ఉంది. కమ్యూనిజం అంటే ఏమిటి? అని ప్రారంభించాను. అక్కడ నుంచి

ఒక్కమారు శ్రామికవర్గం దగ్గరకు గంతేశాను. దాని పుట్టుక, పూర్వపు శ్రమజీవులకూ దానికీ గల భేదం, శ్రామికవర్గానికీ, బూర్జువా వర్గానికి మధ్య వైరుధ్యం పెరుగుదల, సంక్షోభాలు, తుది నిర్ధారణలు వీటన్నిటి మధ్య సవాలక్ష ఉన్నాయి. వీలున్నంత వరకూ, విషయాలు బహిరంగ ప్రకటనకు ముగింపుగా కమ్యూనిస్టు పార్టీ విధానం ఉన్నది'. ఇలా కమ్యూనిస్టు సూత్రాలు పేరున కమ్యూనిస్టు ప్రణాళిక తొలి ముసాయిదాను ఎంగెల్స్ రాశారు. కమ్యూనిస్టు లీగ్ రెండవ మహాసభలో తీవ్రమైన, సుదీర్ఘమైన వాదోపవాదాలు జరిగి మార్క్స్ ఎంగెల్స్ కొత్త సిద్ధాంతాన్ని మహాసభ ఏకగ్రీవంగా ఆమోదించింది. చివరకు కమ్యూనిస్టు పార్టీ ప్రణాళిక లండన్‌లో 1848 ఫిబ్రవరిలో ప్రచురితమైంది. శ్రామికవర్గ విప్లవ సిద్ధాంతమైన శాస్త్రీయ కమ్యూనిజానికి క్లుప్తమూ, స్పష్టమూ అయిన మొదటి సిద్ధాంత సంక్షిప్తీకరణ ఇది. ఈ శాస్త్రీయ కమ్యూనిస్టు ప్రథమ సిద్ధాంతపత్రం దరిమిలా ఎంగెల్స్ చెప్పినట్లు, సోషలిస్టు సాహిత్యంలో అత్యంత వ్యాప్తి చెందిన అంతర్జాతీయ గ్రంథమూ, సైబీరియా నుంచి కాలిఫోర్నియా వరకు గల ప్రపంచ దేశాలన్నింటికీ చెందిన కోట్లాది మంది కార్మికుల ఉమ్మడి కార్యక్రమంగా వర్ధిల్లుతోంది.

1848-49 విప్లవాల తర్వాత మార్క్స్ ఆర్థిక శాస్త్రాధ్యయనం లో పూర్తిగా నిమగ్నమయ్యారు. లండన్‌లో ఉంటూ 'కాపిటల్' రచనకు సన్నాహాలు సాగించారు. మార్క్స్ రాసిన 'ఏ కంట్రిబ్యూషన్ టు ది క్రిటిక్ ఆఫ్ ది పొలిటికల్ ఎకానమీ', కాపిటల్-1వ భాగంపై బూర్జువా విమర్శకులు దురుద్దేశ పూర్వకంగా మౌనం వహించినప్పుడు, బూర్జువా పత్రికల్లోనూ, ప్రజాస్వామ్య పత్రికల్లోనూ ఎంగెల్స్ రాసిన వ్యాసాలు వాటిని పది మంది దృష్టికి తెచ్చాయి. ఈ దశలోనే ఎంగెల్స్ 'ప్రకృతి తత్వశాస్త్రం'లోను, విజ్ఞాన శాస్త్రాల్లోను అధ్యయనం సాగించారు. ఈ అధ్యయనం ద్వారా ఎంగెల్స్ సేకరించిన విషయాలు, వివరాలు తర్వాత కొద్ది కాలంలో 'యాంటీ-డ్యూరింగ్ (బెర్లిన్ విశ్వ విద్యాలయ ఆచార్యుడు యూగిన్ డ్యూరింగ్ రచనల ఖండన) రాయడానికి ఆయనకు తోడ్పడ్డాయి. మార్క్సిజానికి ఈ గ్రంథం దాదాపు విజ్ఞాన సర్వస్వమని చెప్పవచ్చు. ప్రధానంగా తాత్విక గ్రంథమైన దీనిలో చాలా ముఖ్యమైన రాజకీయార్థిక భావాలు కూడా ఉన్నాయి. ఉత్పత్తినీ, సాంఘికార్థిక సూత్రాలన్నింటినీ అధ్యయనం చేసే ఒక విజ్ఞాన శాస్త్రంగా అర్థశాస్త్రానికి ఆయన ఇచ్చిన నిర్వచనం గమనార్హమైనది. ఈ నిర్వచనం చాలా ముఖ్యమైనదని లెనిన్ పేర్కొన్నారు. విజ్ఞాన శాస్త్రాలన్నింటిలో విప్లవం తెచ్చిన డ్యూరింగ్ పెటీ బూర్జువా ఊహాజనిత భావాలను విమర్శించడమే కాకుండా, మార్క్సిస్టు అర్థ శాస్త్ర విధానానికి కూడా యాంటీ-డ్యూరింగ్ రూపుదిద్దింది. బిస్మార్క్ స్టేట్ సోషలిజంను కూడా ఈ పుస్తకం తీవ్రంగా విమర్శించింది. ఈ గ్రంథంలోని భావాలు ఈనాటికీ తమ సందర్భశుద్ధిని కోల్పోలేదు. 'కాపిటల్' రెండు మూడు భాగాలను వెలువరించడంలో ఎంగెల్స్ చేసిన అపార కృషి ఉందనే ఉంది. మార్క్స్ ఈ పుస్తకాలను ఎంగెల్స్‌కు అప్పగించే నాటికి ఆ రాతప్రతులు అచ్చుకిచ్చే దశకు చాలా దూరంలో ఉన్నాయి. ఆ రెండు పుస్తకాలను సంస్కరించి, వాటికి ప్రచురణ యోగ్యమైన రూపు తీసుకురావడానికి ఎంగెల్స్‌కు అనేక సంవత్సరాలు పట్టింది. ఆ రెండు పుస్తకాల్లోని అనేక భాగాలనూ, కొన్ని ప్రకరణాలను ఎంగెల్స్ రచించారు. అవన్నీ ఒక ఎత్తు అయితే, కాపిటల్ రెండు మూడు భాగాలకు ఎంగెల్స్ రాసిన భూమికలు మరొక ఎత్తు. ఈ భూమికలలో మార్క్స్ తన రాత ప్రతులను ఏ పరిస్థితుల్లో వదిలి పెట్టినదీ, మార్క్సిస్టు అర్థశాస్త్ర సిద్ధాంత ప్రాతిపదికలేమిటో, ఆ సిద్ధాంత ఆవిర్భావ ప్రధాన దశలేమిటో, వాటి ప్రత్యేకతలేమిటో ఎంగెల్స్ వివరించారు. అర్థశాస్త్రరంగంలో తన మహాపునాది అదనపు విలువ సిద్ధాంతమని లెనిన్ చెప్పిన అపూర్వ విప్లవపు విశేష ప్రాధాన్యమేమిటో కూడా ఎంగెల్స్ వాటిలో స్పష్టపరిచారు. 1880వ శతాబ్దంలో పురాతన జర్మన్ల చరిత్రపై ఆయన చేసిన రచనల్లో ద ఆరిజిన్ ఆఫ్ ది ఫ్యామిలీ, ప్రైవేట్ ప్రోపర్టీ అండ్ ది స్టేట్ (కుటుంబం, స్వంత ఆస్తి, రాజ్యాల పుట్టుక) అన్న రచన ముఖ్యమైనది. ఈ పుస్తకం రాయడం ఒక విధంగా మార్క్స్ ఆదేశాలను పాటించడంగా ఆయన పరిగణించారు. ఆయన ప్రకృతి- గతితర్కం అసంపూర్ణ రచనే అయినప్పటికీ, గాఢమైన, సంపద్వంతమైన భావాలకూ, సైద్ధాంతిక ప్రాముఖ్యతకూ కాణాచి. తన ప్రకృతి గతి తర్కంలో ఆయన సమకాలీన ప్రకృతి విజ్ఞానశాస్త్ర నిర్ణయాలన్నింటినీ తత్వశాస్త్రరీత్యా విశ్లేషించి, ప్రకృతిలో ప్రతి పరిణామమూ గతితార్కిక పద్ధతిలో జరుగుతుందనీ, ప్రకృతిని సరిగా అర్థం చేసుకోవాలంటే భౌతికవాద గతితర్కమొక్కటే సరైన పద్ధతి అని నిరూపించారు. కళలు, సాహిత్యాన్ని మార్క్సిస్టు దృక్పథంతో ముందుకు తీసుకుపోయినప్పుడే అవి సమాజానికీ, మనిషికీ ఉపయోగపడతాయని అనేక సందర్భాల్లో సోదాహరణలతో ఎంగెల్స్ వివరించారు.

ఎంగెల్స్ జీవిత విశేషాలు

☞ మిగతా 9వ పేజీలో



# ఫ్రెడరిక్ ఎంగెల్స్ జీవితం - కృషి

ఎంగెల్స్ జీవిత విశేషాలు

డా॥ బి. రమేష్ చంద్రబాబు



జర్మనీలోని రైన్ రాష్ట్రంలో గల బార్మెన్ నగరం పారిశ్రామికంగా అభివృద్ధి చెందుతున్న ప్రాంతం. అక్కడ తరాలుగా ధనికమిల్లు యాజమానుల కుటుంబంలో 28 నవంబరు 1820లో ఫ్రెడరిక్ ఎంగెల్స్ జన్మించారు. ఎనిమిది మంది సంతానంలో ఈయన ప్రథమ సంతానం.

తెలివైన విద్యార్థిగా మాధ్యమిక పాఠశాలలో ప్రకృతి శాస్త్రం, భౌతిక శాస్త్రం చదివారు. తర్వాత ఎల్డర్‌ఫెల్డ్‌లో ఉన్నత పాఠశాలలో చేరినా కుటుంబంలో పెద్దకొడుకు కావడంతో అతని తండ్రి తన వ్యాపారాన్ని వారసత్వంగా స్వీకరించాలనే ఉద్దేశ్యంతో చదువు మాన్పించి ఉద్యోగంలో 1838లో చేర్పించారు.

స్వంతంగా వివిధ భాషలు, సాహిత్యం, యితర శాస్త్రాలు అధ్యయనం చేయసాగాడు. 17 సంవత్సరాల వయసులోనే కవితలు రాశాడు. అవి ప్రచురింపబడ్డాయి కూడా.

తన కుటుంబం, పాఠశాల, చుట్టూ ఉన్న సమాజం కలిగించిన ఆసక్తులు, నమ్మకాలు, మతం పట్ల చిన్న వయసులోనే అసహ్యత ప్రదర్శించాడు. 1835లో డేవిడ్ ఫ్రెడరిక్ స్ట్రాస్ ప్రచురించిన 'జీసస్ జీవితం' అనే రేషనలిస్టు పుస్తకాన్ని సంపూర్ణంగా అధ్యయనం చేశాడు. కార్మికులు పరిశ్రమలలో పడే కష్టాలు చూశాడు. వారి పేదరికం, అనారోగ్యం, చిన్నవయసులో మరణాలు, దుర్భర జీవన పరిస్థితుల పట్ల సానుభూతి పెంచుకున్నాడు. మిల్లు యజమానుల జీవితాల్ని, మతాన్ని సమాజంలోని అన్యాయాల్ని వ్యతిరేకించాడు. లిబరల్ ఆలోచనల్ని అర్థం చేసుకున్నాడు.

18 సంవత్సరాల వయసులో పదునైన శైలిలో హాంబర్గ్ జర్నల్‌లో వుప్పర్‌తల్ ఉత్తరాల పేరుతో 1839లో సంపూర్ణ ప్రచురణ వెలువడింది. ధనిక యజమానుల కుటుంబం నుంచి రావడంతో ఈ ప్రచురణలు ఫ్రెడరిక్ ఓస్వాల్డ్ అనే కలం పేరుతో అచ్చుయ్యాయి.

18 ఏళ్ళ వయస్సులో ఎగుమతి వాణిజ్యంలో అనుభవం గడించడానికి బ్రెమెన్ నగరానికి వెళ్ళి యిష్టం లేకపోయినా గుమాస్తాగా పని చేయడం తప్పలేదు. తర్వాత కాలంలో ఉద్యోగంలో వచ్చే సంపాదన మార్క్స్ కుటుంబాన్ని, కార్మిక ఉద్యమకారులకు సహాయం చేయడానికి, విప్లవోద్యమాల అవసరాలు తీర్చడానికి చాలా ఉపయోగపడింది.

అక్కడే తమ ప్రాంతం నుంచి దూరంగా వెళ్ళే ఈ వయసు వారిలాగే తాగడం, సిగరెట్లు కాల్చడం, నాట్యం చెయ్యడం, కత్తి యుద్ధం, ఓపెరాలు, నాటకాలు చూడడం, అప్పులపాలవడం, చదవడం మొదలైన పనులన్నీ చేశాడు. బ్రెమెన్‌లోనే యువ జర్మన్ ఉద్యమంలోని లిబరల్స్‌తోనూ, రాడికల్స్‌తోనూ స్నేహం చేశాడు. అక్కడే 1840లో హెగెల్ ఫిలాసఫీ మొదటిసారి చదివాడు.

1841లో ఒక సంవత్సరం పాటు బెర్లిన్ రక్షణ శాఖలో సైనికుడిగా చేరాడు. అప్పుడు సైనిక యుద్ధ శాస్త్రాన్ని అధ్యయనం చేశాడు. ఎంత క్షుణ్ణంగా ఆకళింపు చేసుకున్నాడంటే తర్వాత ఇటాలియన్ యుద్ధకాలంలో తన పేరు లేకుండా ప్రచురించిన ఒక కరపత్రం సైనిక వర్గాల్లో మంచి ప్రభావం చూపింది. అది ఎవరో సైనిక నిపుణుడు రాసినదని చర్చించుకున్నట్లు తెలిసింది.

1841-42లో సైనిక బ్రిగేడ్‌లో ఉన్న కాలంలోనే మెట్రిక్ పూర్తి చెయ్యని విద్యార్థిగా బెర్లిన్ విశ్వవిద్యాలయంలో క్లాసులకు హాజరయ్యాడు. ఫ్రెడరిక్ ఓస్వాల్డ్‌గా అక్కడ థియాలజీ, ఫిలాసఫీలపై దృష్టి సారించాడు.

1839-42 కాలంలో ఏంగెల్స్ రాజకీయ, సాహిత్య విమర్శకుడిగా సుమారు 50 వ్యాసాలు, కరపత్రాలు ప్రచురించాడు. యువ హెగెలియన్స్ పక్షాన చేరి వారి భావాల రక్షణకు పూనుకున్నాడు.

బ్రెమెన్‌లో తన కుమారుడు వ్యాపారంలో కాక యితర కార్యక్రమాలలో ఉండడం నచ్చక ఎంగెల్స్ తండ్రి 1842లో మాంచెస్టర్‌కు తనకు భాగస్వామ్యమున్న పరిశ్రమలో ఉద్యోగం చేయడానికి ఈ వాతావరణం నుంచి దూరంగా ఎంగెల్స్‌ను పంపించి వేశాడు. ఇంగ్లాండు వెడుతూ మధ్యలో కొలోన్ వెళ్ళాడు. మొదటి కమ్యూనిస్టులలో ఒకరైన మోజెస్‌హెస్‌తో పరిచయం చేసుకుని వారితో విస్తృతంగా చర్చించాడు. కొలోన్ రాడికల్ పత్రికకు వ్యాసాలు రాయడానికి ఉపక్రమించాడు. అప్పుడే తన వ్యాసంలో తనను కమ్యూనిస్టుగా ప్రకటించుకున్నాడు ఎంగెల్స్. హెస్‌తో పరిచయం కొలోన్ పరిస్థితిపై 9-10 డిసెంబర్ 1842 ఎంగెల్స్ వ్యాసాలకు యిది అత్యంత ప్రముఖమైంది. ఇంగ్లాండుకు వెళ్ళే ముందు కొలోన్ పత్రిక సంపాదక వర్గంలో రెండు సార్లు

కలిసి సామాజిక విప్లవ సిద్ధాంతాలు, రాజకీయ ఆర్థిక పరిస్థితి, మనిషి విమోచనల గురించి చర్చించాడు. ఆధునిక పరిశ్రమలు, శ్రామికవర్గ పేదరికం, సామాజిక రాజకీయ విప్లవాలలో నాస్తికత్వం ఎంగెల్స్‌లో ఆసక్తి రేకెత్తించాయి. ఈ అంశాలను అభివృద్ధి చేయాలని నిర్ణయించుకున్నాడు. నవంబరు 1842లో రాడికల్ కొలోన్ పత్రికలో ఎంగెల్స్ వ్యాసాలు ప్రచురించబడ్డాయి.

ఆ కాలంలో బాగా అభివృద్ధి చెందిన పారిశ్రామిక పట్టణం ఇంగ్లాండులోని మాంచెస్టర్ నగరం. అక్కడ చార్టిస్టు ఉద్యమం ఒక రాజకీయ శక్తిగా, కార్మికుల ఉద్యమంగా మొదలయింది. 1842-43లో అక్కడ ఎంగెల్స్ 20 నెలలు అర్థశాస్త్ర అధ్యయనానికి, ఆర్థిక విషయాల పరిశీలనకు వినియోగించాడు. కార్మికవర్గ దుర్భర పరిస్థితులకు చలించిపోయిన ఎంగెల్స్ చార్టిస్టు ఉద్యమంలో చురుకుగా పాల్గొన్నాడు. అక్టోబరు-నవంబర్ 1843లో 'రాజకీయ అర్థశాస్త్ర విమర్శ - ఒక రేఖా చిత్రం' అనే వ్యాసాన్ని ప్రచురించాడు. ఫిబ్రవరి 1844లో మార్క్స్ - రూజ్ సహ సంపాదకులుగా ఉన్న పత్రికలో యిది అచ్చయింది. స్వంత ఆస్థి వ్యవస్థపై ఆచరణలో గల ప్రభావాలను పరిశీలిస్తున్న మార్క్స్‌పై ఇది చాలా ప్రభావం చూపింది.

1842లో మొదటిసారి మార్క్స్‌తో ఎంగెల్స్ పరిచయం అతి సాధారణంగా జరిగింది. కాని ఆగస్టు 1844లో పారిస్‌లో మార్క్స్‌ను కలవడానికి ఎంగెల్స్ వెళ్ళినప్పుడు ఆప్యాయంగా ఆహ్వానించబడి అత్యంత సన్నిహితులయ్యారు. కలిసి పని చెయ్యాలని నిర్ణయించుకున్నారు. అప్పటి నుంచి చనిపోయే వరకూ వారిరువురూ ఒక్కరిగా జీవించారు.

ఇంగ్లాండులో తన పరిశ్రమను అభివృద్ధి చేయడానికి బదులుగా మేరీబర్న్స్ సాయంతో మాంచెస్టర్‌లోని కార్మిక వాడలలో తిరిగి 21 నెలలు శ్రమించి ఎంగెల్స్ వెలువరించిన తొలి ప్రధాన రచన ఇంగ్లాండులో శ్రామికవర్గ స్థితిగతులు అనే పుస్తకం. ఇది 1844లో అచ్చయింది. అప్పుడు ఎంగెల్స్ వయస్సు 25 సంవత్సరాలు తన స్వంత పరిశీలన నుంచి, ఆధారాలతో నిండిన వనరుల నుంచీ తీసుకున్న సమాచారంతో ఈ గ్రంథం వెలువడింది. దీనిలో లోతైన విశ్లేషణతో ధనికులపై పేదల యుద్ధం ప్రత్యక్షమై సార్వత్రికంగా మారుతుందని వివరించారు.

యువ హెగెలియన్లు కమ్యూనిజాన్ని, ప్రజాతంత్ర భావాలనూ వ్యతిరేకించడంతో మార్క్స్ - ఎంగెల్స్ వారి నుంచి విడిపోయారు. పవిత్ర కుటుంబం, విమర్శనాత్మక విమర్శపై విమర్శ అనే గ్రంథం వారిద్దరి పేరు మీద వెలువడింది. దీనిలో మార్క్స్ రాజకీయ అర్థశాస్త్రం, న్యాయశాస్త్రం, చరిత్ర, నీతి మొదలైన భాగాలను, ఎంగెల్స్ ఇంగ్లాండులో కార్మికవర్గ స్థితి, ఇంగ్లాండు సామాజిక చరిత్ర మొదలైన భాగాలనూ వివరించారు.




1845 వేసవి కాలంలో మాంచెస్టరు నుంచి బ్రస్సెల్స్‌కు తిరిగి వచ్చేసరికి వారి పవిత్ర కుటుంబం గ్రంథానికి యువ హెగెలియన్స్ నుంచి సమాధానం వచ్చింది. దానితో పవిత్ర కుటుంబంలో పూర్తిగా వివరించని అంశాల గురించి తెలియ జేయాల్సిన అవసరాన్ని గుర్తించారు. నిజమైన సహకారంతో వారిరువురూ రాసిన జర్మన్ ఐడియాలజీ అనే పుస్తకాన్ని విడుదల చేశారు. ఇప్పుడు యువ హెగెలియన్స్‌తో వారి విభేదాలు పరిష్కారమయ్యాయి. పూర్తిగా తెగతెంపులు చేసుకున్నారు.

శ్రామికవర్గం కమ్యూనిస్టు వ్యవస్థను సాధిస్తుందని, శాస్త్రీయ కమ్యూనిస్టు సిద్ధాంతానికి తాత్విక ప్రాతిపదికగా చరిత్ర పట్ల భౌతికవాద దృక్పధాన్ని స్పష్టం చేశారు. గతంలో జరిగిన విప్లవాలు వర్గాలనూ, వర్గపాలనను తొలగించలేదు. కమ్యూనిస్టు విప్లవం వర్గపాలనను, వర్గాలనూ అంతం చేస్తుందని విశదీకరిస్తూ అదే సమాజ పురోగమనానికి మార్గమని, సామాజిక చలన నియమాలు ఈ సత్యాన్ని రుజువు చేస్తున్నాయని ఈ గ్రంథంలో వివరించారు.

ఎంగెల్స్ బ్రస్సెల్స్ కరస్పాండెన్స్ కమిటీ పేరుతో కమ్యూనిజం కోసం జర్నలిస్టులనూ, ప్రచురణకర్తలనూ సంఘటితపరిచే కార్యక్రమం తీసుకున్నాడు. దాని ప్రధాన లక్ష్యం జర్మన్ సోషలిస్టులను ఇంగ్లాండు, ఫ్రెంచి సోషలిస్టులతో సహకరించేటట్లు చేయడం కమ్యూనిస్టు గ్రూపులు మార్క్సిస్టు సూత్రాలను ఆమోదింపజెయ్యడం ఎంగెల్స్ కర్తవ్యం. మొదటి మహాసభ 1847 వేసవి కాలంలో లండన్‌లో జరిగింది. 'కమ్యూనిస్టు కన్ఫెషన్ ఆఫ్ ఫెయిత్' అనే పత్రాన్ని ఎంగెల్స్ సిద్ధం చేశాడు. మార్క్సు కోసం అప్పుడే "కమ్యూనిస్టు సూత్రాలు" అనే పేరుతో మరో పత్రాన్ని తయారుచేశాడు.

అదే సంవత్సరం మార్క్స్ ఎంగెల్స్‌లు నవంబరు, డిసెంబరు నెలల్లో లండన్‌లో జరిగిన రెండవ మహాసభలో పాల్గొన్నారు. కమ్యూనిస్టులందరూ ఐక్యం కావడానికి ఈ డ్రాఫ్ట్‌ను ఉపయోగించుకుంటూ డాక్యుమెంటును సిద్ధం చేయవలసిందిగా మహాసభ వారిరువురినీ ఆదేశించింది. అది 1848లో "కమ్యూనిస్టు ప్రణాళిక"గా అచ్చయింది.

అప్పటి ఉద్యమాలపై ఇది ఎక్కువ ప్రభావం చూపక పోయినప్పటికీ మార్క్స్ కొలోన్ పత్రిక సంపాదకుడిగా ఉన్న ఆ కాలంలో ఎంగెల్స్ ఎనభై వరకూ వ్యాసాలను ప్రచురించాడు.




కొలోన్ పత్రిక సంవత్సర కాలంలో సర్కులేషన్ 5-6 వేలకు పెరిగింది. మార్క్స్ ఫిబ్రవరి 1848లో పారిస్ విప్లవం ప్రారంభమయ్యే సరికి జర్మనీ మరియు యితర ప్రాంతాల ప్రజాస్వామ్య ఉద్యమాలకు మద్దతునివ్వడానికి ఉద్దేశించిన పాలసీలను పత్రికలో రాశారు.

తన ప్రాంతమైన ఎల్డర్‌ఫెల్డ్‌లో 1849లో ఎంగెల్స్ సాయుధ ప్రజా తిరుగుబాటులో పాల్గొన్నాడు. కార్మికవర్గం, మిలీషియా తగిన సంఖ్యలో చేరకపోవడంతో అక్కడ అధికారులపై ప్రభావం చూపించలేకపోయారు. జూన్ నెలలో నైరుతి జర్మనీ విప్లవ శక్తులతో ప్రష్యాకు వ్యతిరేకంగా చేసిన ఉద్యమంలో పాల్గొన్నాడు. కాని విజయం సాధించలేకపోయాడు. 1849 చివరిలో స్విట్జర్లాండ్ ద్వారా జెనీవాకు వెళ్ళి, అక్కడ నుంచి లండన్ చేరిన మార్క్స్‌ను కలవడానికి ఎంగెల్స్ వెళ్ళారు.

నవంబరు 1849 తర్వాత సంవత్సరం పాటు జర్మనీ, ఇంగ్లాండు విప్లవకారులకు 1848-49 తిరుగుబాట్లపై తన అభిప్రాయాలను తెలియజేస్తూ ఉన్నారు. ఇంగ్లాండులో పది గంటల పనిదినం బిల్లుపై చర్చల్లో పాల్గొన్నారు.

జర్మనీలో రైతుయుద్ధంపై అనేక వ్యాసాలు రాశాడు. ఎంగెల్స్ ప్రచురించిన 'జర్మనీలో రైతు యుద్ధం' చరిత్రపై మొదటి మార్క్సిస్టు గ్రంథంగా చెప్పవచ్చు. 1848-49లో విప్లవానికి 1525లో జరిగిన యుద్ధానికి పోలికలను వివరించాడు. దీనిలో చరిత్ర రచనకు సంబంధించిన మార్క్సిస్టు పద్ధతిని వివరించాడు.

ఆర్థిక కారణాలతో 1850లో లండన్ నుంచి గుమాస్తా ఉద్యోగంలో చేరడానికి తిరిగి మాంచెస్టర్ వెళ్ళాడు. 1851లో కమ్యూనిస్టు లీగ్‌లతో సహచర్యం చెదిరిపోయింది.

1864లో సోషలిజం సాధించడానికి అంతర్జాతీయ శ్రామిక సంస్థ (మొదటి ఇంటర్‌నేషనల్) స్థాపించబడింది. ఎంగెల్స్ దాని సీనియర్ ఎడ్వయిజర్ పాత్ర వహించాడు. సంస్థ నిర్మాణం పూర్తిగా మార్క్స్ స్వీకరించాడు.

1869లో కాటన్ స్పిన్నింగ్ మిల్లులో రిటైర్ అయిన తర్వాత మార్క్స్‌కు దగ్గరగా ఉండాలని 1870లో ఎంగెల్స్ మకాం లండన్‌కు మార్చాడు. ఇంటర్నేషనల్ జనరల్ కౌన్సిల్ సభ్యుడయ్యాడు. ప్రపంచంలోని సోషలిస్టు పార్టీలు, గ్రూపులు పెరుగుతుండడంతో వారితో సంప్రదించే బాధ్యత తీసుకున్నాడు. 1869లో ఏర్పడిన జర్మన్ సోషలిస్టు పార్టీ పట్ల ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నాడు. 1874లో ఇంటర్నేషనల్ రద్దయిన తర్వాత పార్టీ నాయకత్వానికి సలహాలనిచ్చేవాడు.

1867లో మార్క్స్ 'పెట్టుబడి' మొదటి సంపుటం ప్రచురించబడింది. దాని సంక్షిప్త పాఠం రాయవలసిందిగా మార్క్స్ కోరడంతో ఎంగెల్స్ సులభ శైలిలో మొదటి సంపుటంలోని నాలుగు అధ్యాయాలకూ సంక్షిప్త పాఠం తయారుచేశాడు.

1875 నాటికి మార్క్సిస్టు భావజాలానికి ఆకర్షితులై ఎన్నికలలో విజయం సాధిస్తున్న జర్మన్ సోషలిస్టు పార్టీ పెరుగుతోంది. 1870లో యూగెన్ ద్యూరింగ్ రాజకీయ అర్థశాస్త్రం, సోషలిజం, శాస్త్రీయ ప్రపంచ దృక్పథాలపై పుస్తకాలు ప్రచురించాడు. సోషలిస్టు పార్టీలో ఆయన ప్రభావం పెరగసాగింది. ఎంగెల్స్ తమ భావాలకూ ఆ పెద్దమనిషి భావాలకూ మధ్య గల బేధాలను వివరించడం ప్రారంభించాడు. ద్యూరింగ్ ప్రచురించిన ఫిలాసఫీ కోర్సును లక్ష్యంగా ఎంపిక చేసుకున్నాడు. "సైన్స్‌లో యూగెన్ ద్యూరింగ్ విప్లవం" లేదా ఏంటీ ద్యూరింగ్‌గా ప్రసిద్ధి చెందిన గ్రంథం జర్మన్ సోషలిస్టు పత్రికలో 1877-78లో సీరియల్‌గా అచ్చయింది.

ఎంగెల్స్ అభిప్రాయంలో ఏంటీ ద్యూరింగ్ రాయడానికి మూడు కారణాలున్నాయి. మొదటిది, పెరుగుతున్న పార్టీలో గందరగోళం పోగొట్టి, మరోసారి చీలిపోయే అవకాశం లేకుండా చేయడం. రెండు, వైరుధ్యాలున్న అంశాలపై తన భావాలకు సానుకూల రూపం యివ్వడం, మూడు, చాలా విషయాలను అధ్యయనం చెయ్యకుండా రాస్తున్న అనేక విషయాల పట్ల ప్రజలు అప్రమత్తంగా ఉండేటట్లు చెయ్యడం.

సోషలిజం - ఊహాజనితం, శాస్త్రీయం అనే పుస్తకాన్ని ఫ్రెంచి అనువాదంలో 1880లోనూ, జర్మన్‌లో 1883లోనూ ప్రచురించాడు. మార్క్సిజం ప్రాచుర్యానికి ఇది చాలా ఉపయోగపడింది.

1876లో వానరుడు నరుడుగా పరిణామం చెందే క్రమంలో శ్రమ పాత్ర, తర్వాత 1884లో కుటుంబం, ప్రైవేటు ఆస్తి, రాజ్యం పుట్టుక అనే పుస్తకాలు ప్రచురించాడు. ఆంత్రపాలజీలో కూడా బయాలజీ, కెమిస్ట్రీ, భౌతిక శాస్త్రం ఫిలాసఫీ వలెనే గతితర్కంలో పాదుకున్న చారిత్రక భౌతిక వాద దృక్పథాన్ని రుజువు పరుస్తున్నట్లు ఎంగెల్స్ తెలియజేశారు.

1872లో ఎంగెల్స్ రాసిన 'అథారిటీ గురించి'న వ్యాసంలో భావి పరిపాలన స్వభావం గురించిన ఆలోచనలను తెలియజేశారు.

1883లో మార్క్స్ చనిపోయిన తర్వాత మార్క్స్ తయారు చేసుకున్న "పెట్టుబడి" రెండవ మరియు మూడవ సంపుటాల్లో చిత్తుప్రతుల్ని పరిష్కరించి ప్రచురించే కార్యక్రమాన్ని చేపట్టాడు. ఈ కార్యక్రమం ఎంగెల్స్ తప్ప వేరెవ్వరూ చేయలేనిది. రెండవ సంపుటిని 1885లోనూ, మూడవ సంపుటిని 1894లోనూ ప్రచురించాడు. ఈ రెండు సంపుటాలు ప్రచురించడానికి చాలా శ్రమించవలసి వచ్చింది.

ఏంటీ డ్యూరింగ్ రెండవ ప్రచురణ కాలంలో ఎంగెల్స్ ప్రకృతి శాస్త్రాల గతి తార్కిక వివరణ అవసరమని భావించాడు. 1875-76లో ప్రకృతి గతి తర్కం అనే గ్రంథాన్ని రాశాడు. కాని యిది అసంపూర్ణ రచనగానే మిగిలిపోయింది. వానరుడు నరుడుగా మారే క్రమంలో శ్రమ పాత్రను విశ్లేషిస్తూ మానవ స్వభావం, అభివృద్ధి గురించిన మార్క్సిస్టు దృక్పథాన్ని ఉత్తమంగా వివరించాడు. శ్రమే మానవుడిని సృష్టించింది. ప్రకృతి సూత్రాలను తెలుసుకుని సరిగా వినియోగించడం వలననే ప్రకృతిపై ఆధిపత్యం ఏర్పడుతుందని ఎంగెల్స్ అన్నాడు.

1888లో లుడ్విగ్ ఫొయెర్‌బాఖ్ సాంప్రదాయ జర్మన్ తత్వశాస్త్ర ముగింపు వెలువడింది. హెగెలియన్ భావవాదం నుంచి భౌతికవాదం, యాంత్రిక భౌతికవాదం నుంచి గతితార్కిక భౌతికవాదం పరిణామాన్ని, పురోగతిని ఎంగెల్స్ దీనిలో వివరించాడు.

1889 జూలై 14న పారిస్‌లో బాస్టిల్ పతనపు శతజయంతి సభ జరిపిన సందర్భంలో రెండవ ఇంటర్నేషనల్ ఏర్పాటు చేసి ఎంగెల్స్ దానికి నాయకత్వం వహించాడు.




ఎంగెల్స్ జీవిత సహచరి మేరీబర్న్స్ 1863లో చనిపోయింది. ఆమె సోదరి లిజ్జీ 1877లో చనిపోయే వరకూ ఎంగెల్స్ జీవితంలో ఉంది. ఆమె కోరిక ప్రకారం చనిపోవడానికి ముందు ఎంగెల్స్ లిజ్జీని వివాహం చేసుకున్నాడు. ఎంగెల్స్ కుటుంబాన్ని తర్వాత కాలంలో ఆమె మేనకోడలు చూసేది. 1883లో మార్క్స్ కుటుంబాన్ని చూసిన హెలెన్ డెముత్ కుటుంబ రక్షణను చూసుకుంది. హెలెన్ చనిపోయాక 1890లో లూయీ కౌట్స్కీ (కార్ల్ కౌట్స్కీ నుంచి విడిపోయిన భార్య) ఎంగెల్స్ సెక్రటరీగానూ, కుటుంబ పరిరక్షణనూ చూసేవారు.

1893లో జర్మనీ, స్విట్జర్లాండ్, ఆస్ట్రియా దేశాలను పర్యటించి అక్కడి ఉద్యమాలకు అవసరమైన సలహాలను అందించారు.

75 సంవత్సరాల వయసులో వృద్ధాప్య సమస్యలు, గొంతు కేన్సర్‌తో బాధ పడుతున్నప్పటికీ తుదిశ్వాస వరకూ తన సహాయాన్ని సలహాలనూ కార్మికవర్గానికి అందిస్తూనే ఉన్నాడు. లండన్‌లో 1895 ఆగస్టు 5వ తేదీన ఎంగెల్స్ తుది శ్వాస విడిచారు.

ఎంగెల్స్ రచనలు ఈనాటికీ ప్రాధాన్యతను కోల్పోలేదు. చారిత్రక భౌతికవాద దృక్పథంతో ఆయన విశ్లేషణలు అర్థం చేసుకుంటూ నేటి సమస్యలను పరిష్కరించుకోవడంలో ఎంగెల్స్ మనకెల్లప్పుడూ మార్గదర్శకుడుగా ఉంటాడు. ❑

---

## శ్రామిక విప్లవయోధ ఎంగెల్స్

**(5వ పేజీ తరువాయి)**

ఎంగెల్స్ రచనలన్నింటిలోనూ గాఢమైన శాస్త్రీయ దృక్పథం కనిపిస్తుంది. కమ్యూనిస్టు సిద్ధాంతానికి అవి పూర్తిగా కట్టుబడి ఉన్నట్లు బోధపడుతుంది. శాస్త్రీయ సోషలిజం సిద్ధాంతానికి రూపకల్పన చెయ్యడానికీ, ఆ విజ్ఞాన శాస్త్రాన్ని కార్మికోద్యమంతో మేళవించడానికి ఆయన యావజ్జీవితం అంకితం చేశారు. విప్లవ పోరాటలకు ఆయన ఊపిరి. 'ధర్మం కోసం మనం పోరాడేటప్పుడు ప్రేమ, లాభం, సంపద- వీటిలో దేన్ని త్యజించాల్సి వచ్చినా మనం వెనుకంజ వెయ్యరాదు. పోరాట క్రమంలో మనం పొందే ఆనందం సహస్రాధికంగా ఉంటుంది. మన శరీరాల్లో తుది రక్తపు బొట్టున్నంత వరకూ పోరాటం కొనసాగిద్దాం" అని ఆయన 1848లో పేర్కొన్నారు. ఆయన దృష్టిలో జీవితమంటే పని, పని అంటే పోరాటం. తనలో ఇంకా మిగిలి ఉన్న బలాన్నంతటనీ శ్రామికవర్గ లక్ష్య సాధనకు జరిగే పోరాటానికే వెచ్చించాలని తపిస్తూ 1895 ఆగస్టు 5వ తేదీన ఫ్రెడరిక్ ఎంగెల్స్ కన్నుమూశారు. తన జీవితకాలంలో శ్రామికవర్గ విజయాన్ని, వర్గ వైరుధ్యాలు అంతం కావడాన్ని చూస్తాననీ, జాతుల మధ్య యుద్ధాలను అంతం చేసి, నాగరిక ప్రపంచంలో సుఖశాంతులను తీసుకురాగలననీ, తీసుకు రావాలన్న ఆశాభావంతోనే తుది శ్వాస విడిచిన ఆ శ్రామిక విప్లవవాదికి ఈ ద్విశతజయంతి వేళ మనం అర్పించే నివాళి ఆయన కలలను నిజం చేసేలా సమసమాజ సాధనకు పోరాడటమే. బడుగు బలహీన వర్గాల పక్షాన ఉద్యమించడమే. ❑



# "మేజర్ ఫ్రెడ్రిక్ ఎంగెల్స్"

**ఎంగెల్స్ జీవిత విశేషాలు**

**మందలపర్తి కిషోర్**



కార్ల్ మార్క్స్ -ఆయన కుటుంబ సభ్యులూ- ఫ్రెడ్రిక్ ఎంగెల్స్‌ను "మేజర్" అని ఆత్మీయంగా పిలుచుకునేవారట. 1841-42 సంవత్సరాల్లో ప్రష్యన్ సైన్యంలోని "హౌస్‌హోల్డ్ ఆర్టిలరీ" విభాగంలో ఎంగెల్స్ పనిచెయ్యడం ఒక్కటే దీనికి కారణం కాదు. 1848-49 సంవత్సరాల నాటి విప్లవ పోరాటాల్లో ఆయుధం చేపట్టి పోరాడిన అనుభవమూ ఆయనకు ఈ బిరుదును సంపాదించి పెట్టలేదు. ఆయన సమకాలీనులయిన కమ్యూనిస్టు లలో సైనిక వ్యూహాల గురించి 'సాధికారికంగా మాట్లాడగలిగినంత ప్రావీణ్యం, నైపుణ్యం ఎంగెల్స్‌కు మాత్రమే వుండేదని అంటారు. "తన జీవితకాలంలో విప్లవమే గనక వచ్చి వుంటే ఎంగెల్స్ మా పక్షాన కేర్నో (ఫ్రెంచ్ సైనిక శాస్త్రవేత్త) అవతారం ఎత్తి వుండేవా" డని విల్ హెల్మ్ లీబ్నెక్ట్ - 1897లో అన్న మాటలు జ్ఞాపకం చేసుకోవాలి. 'నోయె రైనిషె సైటుంగ్' పత్రికలో - 1849లో ఎంగెల్స్ రాసిన వ్యాసాలను, హంగేరియన్ సైన్యంలో ఉన్నతాధికారిగా ఉన్న అజ్ఞాత వ్యక్తికి ఆపాదించడం జరిగిందని లీబ్నెక్ట్ పేర్కొన్నారు. 1859లోనూ, 1860లోనూ కూడా సైనిక వ్యవహారాలపై ఎంగెల్స్ రాసిన పత్రాల కర్తృత్వాన్ని కూడా ఎవరో ప్రష్యన్ సైన్యాధిపతికి కట్టబెట్టినట్లు కూడా లీబ్నెక్ట్ వెల్లడించారు.

**నిజమయిన నిపుణుడు!**

గిల్బర్ట్ అష్కర్ అన్నట్లుగా, "సైనిక వ్యవహారాలపట్ల ఎంగెల్స్ ఆసక్తి కేవలం హాబీ మాత్రమే కాదు." 1870 - 71 సంవత్సరాల నాటి ఫ్రాంకో ప్రష్యన్ యుద్ధం గురించి లండన్ నుంచి వెలువడే "పల్ మల్ గెజెట్'లో ఎంగెల్స్ రాసిన వ్యాసాలు అటు సామాన్య పాఠకుల్లోనూ - ఇటు సైనిక వ్యవహారాల నిపుణుల్లోనూ కూడా ఆసక్తిని రేకెత్తించాయని అష్కర్ వ్యాఖ్యానించడం విశేషం. 1895లో కన్ను మూయడానికి పాతికేళ్ల ముందు నుంచీ, ఎంగెల్స్‌ను సన్నిహిత మిత్రబృందం ' మేజర్' గానే ప్రస్తావించు కుంటూ ఉండేదట!! సైనిక వ్యూహాలను లోతుగా అధ్యయనం చేసిన రాజకీయ విశ్లేషకులు షా లనర్, హెండర్‌సన్, కిచెన్, గాలీ, సెమ్మెల్, బర్జర్, బాడెన్ తదితరులు ఎంగెల్స్ ఈ విషయంపై చేసిన రచనలకు ప్రాముఖ్యమిచ్చిన మాట నిజమే. అయితే, సైనిక వ్యవహారాల గురించిన ఎంగెల్స్ రచనలను ఇరవయ్యో శతాబ్దం వరకూ పరిశోధకులు పెద్ద సీరియస్‌గా పట్టించుకోలేదనే విమర్శ వుండనే వుంది! సిగ్మండ్ న్యూమన్, గెరార్డ్ షాలియాండ్, యెప సదా వలాష్, డామియెన్ విన్‌జ్యాస్కీ లాంటి వాళ్లు ఎంగెల్స్‌ను సైనిక వ్యవహారాల నిపుణుడిగా పరిగణించి, లోతయిన అధ్యయనం చేసినవారిలో మరికొద్దిమంది.

**'రెడ్ క్లాసెవెట్జ్'**

ఎంగెల్స్‌కు 'రెడ్ క్లాస్ వెట్జ్' అనే బిరుదు అయాచితంగానే లభించడానికి సైనిక వ్యూహాల్లో ఆయనకున్న ఈ నైపుణ్యమే కారణం. (ప్రముఖ ప్రష్యన్ సైనిక వ్యూహవేత్త క్లాస్‌వెట్జ్ యుద్ధానికి వుండి తీరవలసిన నైతిక స్వభావం గురించి నొక్కి చెప్పినవాడిగా చరిత్రలో ప్రసిద్ధుడు! ఆయన అసంపూర్ణ రచన 'ఫామ్ క్రీగ' (యుద్ధం గురించి....) కూడా క్లాస్‌వెట్జ్‌కు పేరు తెచ్చిపెట్టింది.) ప్రత్యేకించి, సాంకేతిక పరిజ్ఞానం, నైపుణ్యం పెరిగే కొద్దీ అది యుద్ధవ్యూహాన్ని ఎలా ప్రభావితం చేస్తుందనే అంశం గురించి ఎంగెల్స్ రాసింది చదివితే అతనిపై క్లాస్‌వెట్జ్ ప్రభావం ప్రగాఢం గానే పడిందని అర్థమవుతుంది. 1848 జూన్‌లో జరిగిన ప్యారిస్ కార్మికుల తిరుగుబాటును యూజిన్ కేవైనాక్ ఉక్కుపాదం కింద అణిచేసిన నేపథ్యంలో ఎంగెల్స్ ఓ కొత్త పాఠం నేర్చుకున్నారు- తన మిత్రులకు నేర్పారు కూడా. "పెద్దపెద్ద నగరాల్లో భారీ సంఖ్యలో ప్రజలు చేసే తిరుగుబాట్లు అజేయమనే భావన కేవలం భ్రమాజనితమని రుజువయింది.... రాజ్యాంగ యంత్రంలో సైన్యమే నిర్ణయాత్మక శక్తిగా మరోసారి కూడా నిలిచింది" అని 1852లో ఎంగెల్స్ అన్న మాటలకు అంతకు నాలుగేళ్ల క్రితం జరిగిన నాలుగు రోజుల తిరుగుబాటులో ప్రత్యక్షంగా పాల్గొన్న అనుభవమే ప్రాతిపదిక.

సాంకేతిక నైపుణ్యం పెరిగే కొద్దీ సైనిక సంఘర్షణలు పెరుగుతూ పోతాయనే ప్రతిపాదన చెయ్యగలగడానికి ఎంగెల్స్‌కు ఎంత పరిజ్ఞానం, జ్ఞానం ఉండాలో ఊహించుకోవచ్చు. (ఈ సిద్ధాంతం పూర్తిగా ఎంగెల్స్ సొంతం కాదని వాదించేవాళ్లు సైతం, ఈ వాదాన్ని శక్తిమంతంగా వినిపించిన వాళ్లలో ఎంగెల్స్ ప్రముఖుడనే వాస్తవాన్ని కాదనడం లేదు!)

ఏడాది పొడుగునా సరిహద్దులను కావలి కాసే పూర్తికాలపు సైన్యానికి బదులుగా, మిలీషియా తరహా సైనిక దళాలను

రూపొందించుకోవాలని ఎంగెల్స్ ఆధునిక - శ్రేయోరాజ్యాలకు చేసిన సూచన కీలకమయింది.

**కల నిజమయ్యేనా?**

"ప్రస్తుతం యూరప్ సైన్యోన్మాదం పెత్తనం చేస్తోంది; అది మొత్తం యూరప్‌ను దిగమింగేస్తోంది. అయితే, ఈ సైన్యోన్మాదం కడుపులోనే దాని వినాశనానికి బీజాలున్నాయి. ఒకవైపు, విడివిడి రాజ్యాల మధ్య పోటీ సైన్యం మీద మరింత ఎక్కువ ఖర్చుపెట్టక తప్పని పరిస్థితి తెచ్చిపెడుతోంది. అది ఆయా దేశాల ఆర్థిక వ్యవస్థలు మరింత తొందరగా కుప్పకూలిపోవడానికి దారితీస్తుంది. మరోవైపు, నిర్బంధ-సార్వత్రిక సైనిక శిక్షణ పుణ్యమాని ప్రజలకు ఆయుధ వినియోగంతో సాన్నిహిత్యం పెరుగుతుంది. చోటామోటా సైనిక నియంతలకు వ్యతిరేకంగా ప్రజలు తమ ఇచ్ఛను నెగ్గించుకోడానికి ఈ వాస్తవం దారితీస్తుంది! " అని ఎంగెల్స్ 1877లో చెప్పిన మాటలు సుప్రసిద్ధం. ప్రజల్లో స్పష్టమయిన ఆకాంక్ష, చైతన్యంతో కూడిన పట్టుదలా రూపొందిన వెంటనే తాను చెప్పినట్లు జరుగుతుందని ఎంగెల్స్ చెప్పారు. అలా జరిగినప్పుడు రాజుల సేనలు ప్రజాసైన్యంగా మార్పు చెందుతాయన్నది ఎంగెల్స్ అంచనా. "పర్యవసానంగా, సైనిక యంత్రాంగం మూలనపడుతుంది; అంతర్గత గతితార్కిక పరిణామం పుణ్యమాని సైన్యోన్మాదం కుప్పకూలుతుంది" అన్నారు ఎంగెల్స్. ఈ పరిణామం సైన్యోన్మాద యంత్రాంగం ఉల్లోపలి నుంచే బద్దలవడానికి దారి తీస్తుందనీ, తద్వారా శాశ్వత సైన్యాలనేవే అంతరిస్తాయనే ఎంగెల్స్ ఆశాభావం నిజం కావడానికి ఎంత కాలం పడుతుందో మరి!

సైనిక వ్యవహారాల గురించి ఎంగెల్స్ చేసిన అధ్యయనాల్లో రెండు ప్రపంచ యుద్ధాల గురించిన హెచ్చరిక కూడా ఉందన్నది కొందరు పరిశోధకుల భావన. చారిత్రిక పరిణామాల గురించిన అంచనాలు అంకగణిత సూత్రాల మాదిరిగా -అంత సరళంగా ఉండవనేమాట నిజమే కానీ, సామాజిక గతితర్కం అర్థమయిన వాళ్లు చేసే ఊహ ఇలాగే ఉంటుంది.

**ఔచిత్య విచార చర్చ!**

"శాస్త్రీయ సోషలిజం, శ్రామికవర్గ విప్లవ సిద్ధాంతాలను రూపొందించిన ఇద్దరు ప్రముఖుల్లో ఎంగెల్స్ ఒకడు కదా- అణచివేతే స్వభావంగా కలిగివుండే సైన్యం గురించీ, సైనిక వ్యూహాల గురించీ ఆయనకు అంత ఆసక్తి ఎందుకు ? అది, ఎంగెల్స్ ఆలోచన క్రమంలోని వైరుధ్యం కాదా?" అనే ప్రశ్నలపై




గతంలో కొంత చర్చ జరిగింది. సైన్యానికి ఎల్లవేళలా అణచివేతే స్వభావంగా ఉంటుందనేది అంత నిశ్చల నిశ్చితమయిన సిద్ధాంతమా? శ్రామిక వర్గ విప్లవ ఫలాలను సంరక్షించుకునే నిమిత్తం సైన్యం - కనీసం సైనిక చర్యలు- అవసరం కావా? 'ఇల్లు అంటుకున్నప్పుడే నుయ్యి తవ్విన చందం గా' అప్పటికప్పుడు సైనిక సంసిద్ధత సాధ్యమవుతుందా? అన్నిటికీ మించి, యువకుడిగా ఉన్న రోజుల్లో మార్క్స్ కూడా కొంత కాలం సైనిక రంగంలో "కార్యవాది"గా ఉండాలని కలలు కన్న విషయం ఈ సందర్భంగా గుర్తుంచుకోవాలి. అయినా, ఆధునిక సామాజికార్థిక -కొండొకచో, సాంస్కృతిక- జీవన విధానంలో కీలక పాత్ర వహించే సైన్యం గురించి ఎంగెల్స్ లాంటి ఆర్థికవేత్త - తత్వవేత్త ఆలోచించవలసిన అవసరం లేదా? అందులో అంత అనౌచిత్యం ఏముంది? ఆయుధాలపై అలవిమీరిన మోజు, సాయుధ పోరాటమే సకల సమస్యలకూ శాశ్వత పరిష్కారం సాధించే సర్వరోగ నివారిణి అనుకునే తప్పుడు అవగాహనా, కర్రవున్న వాడిదే బర్రె అనే "విప్లవ సిద్ధాంతం" మేలు కన్నా కీడే ఎక్కువ చెయ్యొచ్చు. అలాంటి ధోరణుల గురించిన విమర్శనాత్మక వైఖరి కచ్చితంగా సత్ఫలితాలనిస్తుంది. కానీ, సైన్యం-ఆయుధం అంటరానివన్నట్లు మాట్లాడడం, సాయుధ పోరాటమే సకల సమస్యలకూ శాశ్వత పరిష్కారం సాధించగల సర్వరోగ నివారిణి అనుకునే తప్పుడు అవగాహనకు కవల సహోదరి మాత్రమే!

"యుద్ధం అనేది, అన్నిటినీ మించి, యూరప్ అంతటా సాగుతున్న మన ఉద్యమాన్ని వెనకడుగు వేయిస్తుంది. అనేక దేశాల్లో మన ఉద్యమాన్ని ధ్వంసం చేస్తుంది. జాతీయ దురహంకారాన్నీ, ఉన్మాదాన్నీ రెచ్చగొడుతుంది. యుద్ధం పర్యవసానంగా మనం ఉద్యమాన్ని మళ్లీ ఓనమాల నుంచీ మొదలు పెట్టుకోవలసి వస్తుందనేది నిశ్చయం!!" అని ఎంగెల్స్ తన మరణానికి పదేళ్లు ముందే చెప్పిన విషయం అందరికీ తెలిసిందే. కడదాకా ఆయన అభిప్రాయంలో మార్పు రాలేదు! అటువంటి శాంతిప్రియుడి సైనిక వ్యూహ అధ్యయనాన్ని యుద్ధకాంక్షగా పొరబడ్డం క్షంతవ్యం కాదు. ❑

---

**ప్రతి వ్యక్తి అభీష్టాన్ని ఇతరులందరూ ప్రతిఘటిస్తారు.**
**ఫలితంగా, ఏ ఒక్కరి అభీష్టమూ కాని**
**పరిణామం చోటు చేసుకుంటుంది !**

**- ఎంగెల్స్**

ఎంగెల్స్
జీవిత విశేషాలు

# ఎంగెల్స్ జీవితం
# వైరుధ్య భరితమా? వైవిధ్య చరితమా??

వార్తాపత్రికలు చదివేపాటి విద్యావంతులందరికీ కార్ల్‌మార్క్స్ పేరు తెలుసు. మార్క్స్ పేరు విన్నవాళ్లకి ఫ్రెడ్రిక్ ఎంగెల్స్‌ను ప్రత్యేకంగా పరిచయం చెయ్యవలసిన పని లేదు.

ఒకే ఆత్మగా బతికిన ఇద్దరు వ్యక్తులు వాళ్లు! ఈ ఏడాది ఎంగెల్స్ ద్విశత జయంతి సంవత్సరం.

కమ్యూనిజం, తత్వశాస్త్రం, అర్థశాస్త్రం, విజ్ఞాన శాస్త్రం, చరిత్ర, మానవ శాస్త్రం-సామాజిక శాస్త్రం, పత్రికా రచన తదితర రంగాల్లో ఎంగెల్స్ సాధించిన ఘనవిజయాల గురించి మీరు ఇదే సంచికలో చదువుతారు.

ఆయన మంచి కవి; చక్కని చిత్రకారుడు; పారిశ్రామిక సంస్థల నిర్వహణలో సమర్థుడు కూడా!

ఎంగెల్స్ వ్యక్తిగత జీవనంలోని విశిష్టతను కొందరు వైవిధ్యంగా భావించారు.

మరికొందరికి అదే ఆయనలోని వైరుధ్యంగా కనిపించింది.

ఈ వైరుధ్య- వైవిధ్యాలను విశ్లేషించేందుకు మాత్రమే నేనిక్కడ పరిమితమవుతున్నా.

ఏడున్నర దశాబ్దాల సుదీర్ఘ జీవితం ఫ్రెడ్రిక్ ఎంగెల్స్‌ది!

అందులో, దాదాపు ఆరు దశాబ్దాల పాటు ఆయన ఇంగ్లండ్‌లోని కష్టజీవుల మధ్యనే తిరిగారు. అందులో సగభాగం - దాదాపు మూడు దశాబ్దాలు- మాంచెస్టర్ నగరంలోనే గడిపారు ఎంగెల్స్.

స్థితిమంతుల కుటుంబంగా ఎంగెల్స్ వంశం నాటి ప్రష్యాలో ప్రసిద్ధం. ఆ వంశంలో పుట్టిన ఎంగెల్స్ పద్దెనిమిదేళ్ల ప్రాయంలోనే - ప్రపంచ కార్మికవర్గాన్ని విప్లవ పథంలో నడపాలనుకున్నారు. ఈ పోకడను మెచ్చని అతని తండ్రి ఎంగెల్స్‌ను చదువు మాన్పించాడు. 'తన చేతి కింద పెట్టుకుని తర్ఫీదు' ఇవ్వడం మొదలెట్టాడు. మైనరు బాబు ఎంగెల్స్ తండ్రి మీద తిరుగుబాటు బావుటా ఎగరెయ్యలేదు; పై పెచ్చు, 49 సంవత్సరాల వయసు వచ్చే వరకూ ఎంగెల్స్ తనకు తండ్రి అప్పగించిన బాధ్యతలను నిర్వహిస్తూనే వచ్చారు. అయితే, ఎంగెల్స్ తన అభిప్రాయాలను ఎప్పటికప్పుడు పత్రికల్లో ప్రచురిస్తూ వచ్చారు. మొదట్లో ఎంగెల్స్ మారుపేరుతో రాసేవారు. క్రమంగా సొంత పేరుతోనే అనేక భాషల్లో రాస్తూండేవారు. ఇక, కవితలు కూడా విస్తృతంగా రాశారు - ఓ దశలో, సాహిత్యవేత్తగా రాణించాలనుకున్నారు. మంచి మద్యాన్నీ, మధురమయిన కవిత్వాన్ని మనసారా ఆస్వాదించడం తన స్వభావమని చెప్పుకున్నారు.

అతివాద భావాలు కలిగివుండిన ఈ పెట్టుబడిదారుడి కుమారుడికి, నక్కల్ని వేటాడ్డం అభిమాన క్రీడ.


మేరీ బర్న్స్ లిజీ బర్న్స్

'ఫ్రెంచ్ సుందరీమణులులేని ప్రపంచం అనూహ్యం!' అని తేల్చిన ఈ సౌందర్యారాధకుడికి, కళ్లెం లేకుండా గుర్రం మీద దూసుకుపోవడమంటే మహాయిష్టం.

మాంచెస్టర్, లివర్‌పూల్, శాల్ఫర్డ్ మురికివాడల్లో తిరిగి తన తొలిక్లాసిక్ - 'ఇంగ్లండ్‌లో కార్మికవర్గ స్థితిగతులు'- రాసిన ఎంగెల్స్ తన జీవితంలో సగభాగం మాంచెస్టర్‌లోని ఓ పెద్ద బట్టల మిల్లును నిర్వహించారు. ఆ మిల్లులో సగభాగానికి అతని తండ్రే యజమాని!

ఎంగెల్స్ వ్యక్తిగత జీవితాన్ని విశ్లేషించినవాళ్ల కళ్లకి ఈ వాస్తవాలు 'వైరుధ్యాలు'గా కనిపించి వుండాలి!

అందుకే కొందరాయన్ను 'ఫ్రాక్ కోటెడ్ కమ్యూనిస్ట్' అనగా, మరికొందరు 'షాంపేన్ సోషలిస్ట్' అన్నారు!

నిజంగానే ఆయన జీవితం అంత వైరుధ్య భరితమా? లేక, ఆయన సఫల జీవనం ఓ వైవిధ్య చరితమా?

**అతిపెద్ద వైరుధ్యం ?**

ముఖ్యంగా- బర్న్స్ సోదరీమణులతో ఎంగెల్స్ అనుబంధాన్ని ఆయన జీవితంలో 'అతిపెద్ద వైరుధ్యం'గా పేర్కొన్నారు కొందరు విమర్శకులు. మరీ ముఖ్యంగా వారిలో ఒకరితో సుదీర్ఘకాలం సాహచర్యం నెరపి, ఆమె మరణానంతరం మరొకరితో కలిసి బతికడం ప్రారంభించి- అంతకుమించి, మరణశయ్యమీద ఉన్న ఆమెని "శాస్త్రోక్తంగా" పెళ్లాడ్డంలోని ఔచిత్యాన్ని ఈ విమర్శకులు

ప్రశ్నించారు. పెళ్లి అనేది 'అనువుగా చేసుకునే ఏర్పాటు మాత్రమే' అని ఎంగెల్స్ నిక్కచ్చిగా తేల్చిచెప్పారు. వ్యవస్థీకృత వివాహ బంధం' మీద తనకు నమ్మకం లేదని అనేక సందర్భాల్లో చెప్పారాయన. దాదాపు రెండు దశాబ్దాలు మేరీ బర్న్స్‌తో సహజీవనం సాగించారే తప్ప ఆమెని పెళ్లాడలేదు. బాగానే వుంది- మరి, మరణశయ్య మీద వున్న లిడియా (లిజీ) బర్న్స్‌ను మాత్రం ఆయన ఎందుకు పెళ్లి చేసుకున్నట్లు?

ఎందరో స్త్రీలతో స్నేహం చేసిన ఎంగెల్స్ మేరీనే తన జీవన సహచరిగా ఎందుకు ఎన్నుకున్నారు? మేరీ - లిజీ బర్న్స్ సోదరీమణుల కథ వివరంగా తెలుసుకోకపోతే, ఈ ప్రశ్నలలోని సామంజస్యం కూడా పూర్తిగా బోధపడదు మనకి.

**ఎవరీ మేరీ? ఏమామె కథ??**

ఎంగెల్స్ జీవిత చరిత్రను ఎందరో రచయితలు రాశారు. వాళ్లలో అత్యధికులు - ముఖ్యంగా ముగ్గురు - బర్న్స్ సోదరీమణుల గురించి ప్రముఖంగా ప్రస్తావించారు. బర్న్స్ సోదరీమణులలో పెద్దామె మేరీ బర్న్స్, 1821లో పుట్టి తన నలభై రెండో యేట గుండె జబ్బుతో మరణించిన మేరీ అతి సామాన్యమయిన ఐరిష్ కార్మికురాలు. ఆమెకి పెద్ద చదువులేదనీ, అయితే చక్కగా ఉండి, చమత్కారంగా మాట్లాడుతూ సమ్మోహ పరిచేదని తర్వాతెప్పుడో మార్క్స్ కూతురు ఇలియనార్ -కార్ల్ కౌట్స్కీకి రాసిన లేఖలో- మేరీని తల్చుకోవడం విశేషం! 1935లో మ్యాక్స్ బియర్ రాసిన ఎంగెల్స్ జీవిత చరిత్రలో మేరీ బర్న్స్ గురించి ప్రస్తావిస్తూ, ఆమెని ప్రజల మనిషిగా పేర్కొనడం గమనార్హం. ఆమె తన ఇరవైరెండో యేట మేరీ ఎంగెల్స్‌ను కలవడం వాళ్ల సహజీవనానికి దారితీసిందన్నాడు బియర్. వాళ్లిద్దరి సంబంధాన్ని 'స్వేచ్ఛా ప్రణయబంధం"గా అభివర్ణించాడు బియర్.

**స్వతంత్ర వ్యక్తిత్వం!**

బియర్ రాసిన జీవిత చరిత్ర వెలువడిన ఆరేళ్లకు, ఎడ్మండ్ విల్సన్ ఎంగెల్స్ జీవితచరిత్ర మరొకటి వెలువరించాడు. అందులో మేరీని ఎంగెల్స్ ప్రియురాలుగా విల్సన్ పేర్కొన్నాడు. మేరీకి కాయకష్టం నుంచి విముక్తి కల్పించాలని ఎంగెల్స్ ఒక దశలో అనుకున్నారట- కానీ, అందుకు మేరీ అంగీకరించలేదట! "దీన్ని బట్టి చూస్తే మేరీ స్వతంత్ర వ్యక్తిత్వం కలిగిన మనిషి అని అర్థమవుతుం"దన్నాడు విల్సన్. అందులో సందేహమేముంది?? మేరీ గురించి విల్సన్ రాసిన కొన్ని విషయాలు ఆమె వ్యక్తిత్వాన్ని మరింత బాగా అర్థం చేసుకోవడానికే కాకుండా, ఎంగెల్స్‌తో ఆమె బాంధవ్యాన్ని అర్థం చేసుకోవడానికి సైతం ఉపయోగపడతాయి.




"శాల్ ఫర్డ్ శివార్లలో తనూ - తన చెల్లెలు లిజీ వుండడానికి చిన్నయిల్లు తీసుకునేందుకు ఎంగెల్స్ చేసిన ప్రయత్నాన్ని మాత్రం మేరీ అనుమతించింది. మాంచెస్టర్ పరిశ్రమల కోసం బొగ్గును తరలించే బల్లకట్లకూ, ఆ పరిశ్రమల తాలూకు పొగగొట్టాల రొదకూ దూరంగా, పచ్చని పరిసరాల మధ్య వుండేది ఈ కొత్త ఇల్లు. మేరీ ప్రగాఢమయిన ఐరిష్ దేశభక్తురాలు! ఆమె ఎంగెల్స్‌లో విప్లవాత్మక ఉత్సాహాన్ని నింపింది. మాంచెస్టర్‌లోని అగ్నిగుండా ల్లాంటి కార్మిక వాడల్లోకి ఆమె ఎంగెల్స్‌ను క్షేమంగా తీసుకువెళ్లి భద్రంగా తీసుకొచ్చిం"దని ఎడ్మండ్ విల్సన్ తను రాసిన ఎంగెల్స్ జీవిత చరిత్రలో వివరించాడు.

**చారిత్రక వ్యక్తి!**

ఇక రాయ్ విట్ ఫీల్డ్ 1988లో 'మాంచెస్టర్‌లో ఎంగెల్స్ జీవితం' అనే పుస్తకం వెలువరిస్తూ బర్న్స్ సోదరీమణులకు సంబంధించిన కొన్ని వివరాలు వెల్లడించాడు. మేరీ - లిజీల గురించిన కథలకు చాలామటుకు ఊహాపోహలే ప్రాతిపదికలని విట్ ఫీల్డ్ వాదన. అయితే, 1861 జనాభా లెక్కల పత్రాల్లో తాను 1823లో పుట్టినట్టుగా మేరీ బర్న్స్ పేర్కొన్న విషయాన్ని విట్ ఫీల్డ్ ఉటంకించాడు. ఆమె తన జీవితంలో అత్యధిక భాగం శాలలోనే గడిపి వుంటుందని - సహేతుకమయిన ఊహ ప్రాతిపదికగా - విట్ ఫీల్డ్ తేల్చాడు. మిగతా జీవిత చరిత్రకారుల ఊహలు సైతం అటువంటివే కావచ్చునని అనుకోవడానికి అభ్యంతరమేముంది?

అన్నిటికీ మించి, మేరీ మృతి గురించి తెలుసుకున్న మార్క్స్ ఎంగెల్స్‌కు రాసిన లేఖలో ఆమెని "మంచి స్వభావం కలిగిన" చతుర సంభాషణశీలిగా అభివర్ణించడం అందరికీ తెలిసిన సంగతే!

**దారిచూపిన నేస్తం!**

1840 దశకం తొలినాళ్లలో ఎంగెల్స్ వ్యక్తం చేసిన 'అతివాద' భావాలు ప్రష్యా పోలీసుల దృష్టిని ఆకర్షించాయి. అతను బ్రేట్స్‌లో కొనసాగితే కటకటాల పాలుకాక తప్పదని కుటుంబ సభ్యులు భయపడ్డారు. దాంతో, 1842 డిసెంబర్‌లో ఎంగెల్స్‌ను మాంచెస్టర్‌లోని ఎర్మెన్ అండ్ ఎంగెల్స్ బట్టల మిల్లు మేనేజర్‌గా పనిచేసే నిమిత్తం పంపించారు. 1842-44 మధ్యకాలంలో ఎంగెల్స్ లివర్‌పూల్, మాంచెస్టర్ నగరాల్లోని కార్మికుల వాడల్లో తిరిగి వాళ్ల జీవన స్థితిగతులను అధ్యయనం చేశారు. ఆ అధ్యయనం ఫలితంగా వెలువడిన పుస్తకమే 'ఇంగ్లండ్‌లో కార్మిక వర్గం స్థితిగతులు. " పారిశ్రామిక విప్లవ విష ఫలితాలను వెల్లడించే రీతిలో ఉన్న ఈ పుస్తకం - జెర్మన్‌లో- 1845లో విడుదలయింది.




(మరో నలభయ్యేళ్లకు గానీ ఇది ఇంగ్లిష్‌లోకి అనువాదం కాలేదు. అది వేరే విషయం!) ఎంగెల్స్ రచనల్లోని తొలి "క్లాసిక్"గా ఇప్పటికీ గౌరవాదరాలను పొందుతోంది ఈ రచన. మార్క్స్‌నే గొప్పగా ప్రభావితం చేసిన పరిశోధనాత్మక రచన ఇది. "1844 నాటి కార్ల్ మార్క్స్ తత్వశాస్త్ర అర్థశాస్త్ర రాతప్రతుల" పై ఈ పుస్తకం ప్రభావం సుస్పష్టం! పారిశ్రామిక విప్లవం గురించి చరిత్రకారుల దృక్పథాన్ని ప్రముఖంగా ప్రభావితం చేసిన పుస్తకంగా ఇది ప్రసిద్ధం. అటువంటి పుస్తక రచన కోసం రిసెర్చ్ చేసే సందర్భంలో మేరీ ఎంగెల్స్‌కు చేసిన సహాయం మరవలేనిది. మాంచెస్టర్, శాల్‌ఫర్డ్, లివర్‌పూల్ తదితర ప్రాంతాల్లోని కార్మిక వాడల్లోని సందు గొందుల్లో ఎంగెల్స్‌ను తిప్పి చూపించింది మేరీయే. మేరీయే లేనట్లయితే, మాంచెస్టర్‌లోని 'లిటిల్ ఐర్లండ్' లాంటి పద్మవ్యూహాల్లోకి క్షేమంగా ప్రవేశించి, సజీవంగా బయటపడడం మన "ఫ్రాక్ కోటెడ్ కమ్యూనిస్ట్"కి సాధ్యమయి వుండేది కాదేమో!

## స్వయం నిర్మిత సౌధం!

మేరీ బర్న్ తొమ్మిదేళ్ల పసిప్రాయంలోనే సొంతంగా బతకడం ప్రారంభించింది. చదువు సంధ్యలు పెద్దగా లేకపోయినప్పటికీ, జీవితం నేర్పిన పాఠాలను ఆమె చక్కగా నేర్చుకుంది. అలా నేర్చుకుని వుండకపోతే, ఆమె వ్యక్తిగత జీవితం ఏనాడో కుక్కలు చింపిన విస్తరిగా మారి వుండేది. మేరీ చొరవ, చమత్కారంతో కూడిన ఆమె సంభాషణ చాతుర్యం, అన్నిటినీ మించి ఆమె జీవితానుభవం, కార్మిక వర్గం పట్ల ఆమె అవ్యాజ అనురాగం, ఐరిష్ స్వతంత్ర పోరాటం పట్ల ఆమె నిబద్ధత ఎంగెల్స్‌ను ఆకర్షించడంలో వింతేముంది?

మేరీ - సోదరి లిజీతో కలిసి- మాంచెస్టర్‌లో బోర్డింగ్ హౌస్‌లు నడిపించేది. దాదాపుగా ఇప్పటి 'హోమ్-స్టే', 'పేయింగ్ గెస్ట్ ఎకామడేషన్' లాంటి ఏర్పాట్లే ఆనాటి బోర్డింగ్ హౌస్‌లు. ఎంగెల్స్ వాటిల్లో 'లార్జర్'గా నమోదు చేయించుకుని వుండేవాడు. మేరీ-ఎంగెల్స్ సంబంధం గురించి రచ్చ మొదలయిన తర్వాతనే ఆ జెర్మన్ జెంటిల్మన్ వేరే ఇల్లు ఆలోచన చేశాడు. ఎంగెల్స్‌ను బంగారు పిచికలా చూసివుంటే, మేరీ అతని దగ్గిర నుంచి భారీ సొమ్ము పితుక్కుని వుండేది. కానీ, దేనికీ ఎవరిమీదా ఆధార పడకుండా బతకాలనే నియమం గల మనిషి కావడం వల్లనే మేరీ కడదాకా బోర్డింగ్ హౌస్‌లు నడిపిస్తూనే వచ్చింది.

## లిజీ - అక్క అడుగు జాడల్లో....

మేరీ సోదరి లిజీ- అక్షరాలా అక్కకు తగిన చెల్లెలు! గావిన్ మెక్ క్రియా రచన "శ్రీమతి ఎంగెల్స్"లాంటి కాల్పనిక రచనలు తప్పిస్తే లిజీ గురించి చరిత్రకెక్కిన విషయాలు తక్కువ. అయితే, ఆమె కూడా ఎంగెల్స్ జీవితంలో ప్రధానపాత్రే పోషించారు. లిజీ మరణించడానికి ముందురోజు, ఎంగెల్స్ ఆమెని 'శాస్త్రోక్తంగా' పెళ్లి చేసుకోవడం చూస్తే ఆమె ప్రాధాన్యం అర్థమవుతుంది. 1863- జనవరి ఏడో తేదీన మేరీ గుండె జబ్బుతో చనిపోయింది. ఆ తర్వాత లిజీ ఎంగెల్స్ జీవితంలో ప్రవేశించి, దాదాపు దశాబ్దంన్నర అతనితో సహజీవనం సాగించి, 1878- సెప్టెంబర్ 11న చనిపోయింది. ఆమె చనిపోవడానికి కొన్ని గంటల ముందే ఎంగెల్స్ ఆమెని పెళ్లి చేసుకున్నారు.

లిజీ గురించి మార్క్స్ పెద్దల్లుడు పాల్ లఫార్గ్, చిన్న కూతురు ఇలియనార్ (ఎవెలింగ్) చేసిన ప్రస్తావనలు చూస్తే లిజీ మేరీ అడుగుజాడల్లోనే నడిచిందని స్పష్టమవుతుంది. లిజీకి చదవడం, రాయడం తెలియదని- కానీ నీతినిజాయితీ కలిగిన మనిషనీ ఇలియనార్ (కౌట్ స్కీకి రాసిన ఓ లేఖలో) పేర్కొన్నారు. లిజీని ఉత్తమురాలుగా అభివర్ణించింది ఇలియనార్.

కాగా, కమ్యూనిస్టు ఉద్యమ కేంద్రంగా ఎంగెల్స్ ఇల్లు నిర్వర్తించిన చరిత్రాత్మక పాత్ర అందరికీ తెలిసిందే. అంతకు మించి, ఐరిష్ జాతీయ విముక్తి పోరాటానికి కూడా ఈ ఇల్లు గొప్ప అండగా నిలిచిందని పాల్ లఫార్గ్ పేర్కొనడం గమనార్హం. ఆ రోజుల్లో మాంచెస్టర్‌లో ఉండిన ఐరిష్ జాతీయుల్లో అనేకులతో లిజీకి సన్నిహిత నిత్య సంబంధాలుండేవని పాల్ లఫార్గ్ పేర్కొన్నారు. ఎంగెల్స్ ఇంట్లో ఎప్పుడూ ఐరిష్ సోదరభావసంస్థ సభ్యులు - ఫెనియన్లు- కనీసం ఒక్కరయినా ఉంటూ వుండేవారని లఫార్గ్ చెప్పడం విశేషం. పోతే, 1867 సెప్టెంబర్‌లో ఫెనియన్ నాయకులు కెల్లీ, డీజీలను నాటకీయంగా తప్పించిన సంఘటనతో ఎంగెల్స్ ఇంటికి సంబంధం వుందని చెప్తారు కానీ, దాన్ని బలపరచగల రుజువులేం దొరకలేదు!

చివరి రోజుల్లో లిజీ ఆరోగ్యం దిగజారిపోయింది. మరి కొన్ని గంటలకు మించి తాను బతకబోనని గ్రహించిన లిజీ, మతాచారం ప్రకారం తనను పెళ్లి చేసుకోవలసిందిగా ఎంగెల్స్‌ను అభ్యర్థించిందనీ, మరణ శయ్య మీద వున్న మనిషి మాట తోసి పారేయడం ఇష్టం లేక అందుకు ఎంగెల్స్ సమ్మతించారనీ జీవిత చరిత్రలు చెప్తున్నాయి. అది ఆ మనిషి పట్ల ఎంగెల్స్ అభిమానానికి సైతం ఒక నిదర్శనమని నాలాంటి వాళ్ల నమ్మకం. మొత్తానికి, ఏడున్నర దశాబ్దాల ఎంగెల్స్ జీవితంలో -అతని సోదరి మారీని మినహాయిస్తే- సన్నిహిత సంబంధం కలిగిన ఇద్దరే ఇద్దరు స్త్రీలుగా బర్న్ సోదరీమణులే కనిపిస్తారు! ❑

**మందలపర్తి కిషోర్**




# అర్థవంతమైన, ఆదర్శవంతమైన త్యాగానికి ప్రతీక ఎంగెల్స్

డి.రాధాకృష్ణమూర్తి
లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్



ఆదర్శ వంతులైన స్నేహితులుగా ప్రసిద్ధికెక్కిన మార్క్స్ ఎంగెల్స్‌ల స్నేహానికి వారి భావసారూప్యతతో పాటుగా, ఏంగెల్స్ యొక్క అర్థవంతమైన, ఆదర్శవంతమైన త్యాగమే పునాది.

తన ఆలోచనా విధానం ద్వారా మార్క్స్ కంటే ముందు పైలెట్‌గా నడిచిన వాడు. మార్క్స్‌కు అర్థవంతమైన ఆలోచనా చట్రాన్ని అందించినవాడు (చట్రమంటే అదేదో బిగదీసుకుపోయిన వ్యవహారమని కాదు) ఆ చట్రం లోపలి కృషికి కావలసిన మేధావితనం, ఓపిక, పట్టుదల మార్క్స్‌కు ఉన్నాయని నమ్మి, ఆ దారిలో భౌతికంగా, బౌద్ధికంగా మార్క్స్‌కు ఎదురయ్యే, ఎదురవుతున్న అడ్డంకులను తొలగిస్తూ, తను సహాయక పాత్రలోనే మిగలడానికి సిద్ధపడిన వాడు.

జీవితంలోని అనేక కోణాల్ని ఆస్వాదిస్తూ (బాధ్యతలను నిర్వహిస్తూనే) స్వేచ్ఛా జీవిగా ఉండటానికి ఇష్టపడే ఎంగెల్స్, మార్క్స్ మరణానంతరం, మార్క్స్‌చే మొదలు పెట్టబడి, పూర్తి చేయబడని మార్క్స్ రచనలను, అందుకు అనుబంధంగా ఉపయోగపడే కొన్ని తన రచనలను పూర్తి చేసే పనిలో పూర్తిగా మునిగిపోయాడు. అలా మిత్రునికి, శాస్త్రీయ సోషలిజం కర్తవ్యానికి తనను తాను అంకితం చేసుకున్నవాడు ఏంగెల్స్.

అయితే, వీరిద్దరి కృషిపై ఈమధ్య ముందుకొచ్చిన అకడమిక్ చర్చలు కొన్ని ఉన్నాయి. వాటిలోని ముఖ్యమైన ఒకటి రెండు అంశాలు :

ఒకటి, యువ మార్క్స్, ప్రౌఢ మార్క్స్ రచనల మధ్య తేడాలను, వైరుధ్యాలను చూపి చర్చించటం. రెండు, మార్క్స్, ఏంగెల్స్‌ల రచనల మధ్య తేడాలు, వైరుధ్యాలు చూపి చర్చించటం.

వాస్తవానికి, ఇలా వైరుధ్యాలు అని పిలువబడుతున్న తేడాలను, ఆ రచయితల కాలపరిణతి నుండి, ఆయా సందర్భాలలో ఆ రచయితల ప్రాధామ్యాల (నొక్కు) నుండి, రచయితల రచనల మొత్తం సమగ్ర అవగాహనలో భాగంగా వీటిని పరిశీలించాలి. అదే శాస్త్రీయ పద్ధతి. అలా కాక, ఏ కీలుకి ఆ కీలును విడదీసి చూసే పద్ధతి వల్ల రచయితల ఆలోచనలను మనం సరిగా అర్థం చేసుకోలేకపోతాము. అందువల్లే ఇలాంటి చర్చలు అవసరానికి మించి పైచేయి సాధిస్తూ వుంటాయి.

చాలా మందిచే వికాస యుగపు శిశువులుగా పిలువబడిన మార్క్స్, ఎంగెల్స్‌లు తమ ఆలోచన/పరిశీలన పద్ధతి (method) ద్వారా సార్వకాలిక ప్రాధాన్యతను సంతరించుకున్నారు. అందుకే వారు ప్రాతఃస్మరణీయులు. వారికి జోహార్లు. ❑

---

**పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం నిర్మూలన జరిగిన తర్వాత, ఏర్పడే లైంగిక సంబంధాల వ్యవస్థ గురించి ఊహించుకుంటే, ఆ దశలో కనుమరుగయిపోయే విషయాలే ప్రధానంగా తోస్తాయి. మరి ఆ వ్యవస్థలో కొత్తగా రూపుదిద్దుకునే విషయాలేముంటాయి? ఆ దశలో పుట్టి, పెరగబోయే తరమే ఈ ప్రశ్నకు సమాధానం చెప్పాలి! డబ్బు పారేసో, సామాజికపరమయిన మరో ఒత్తిడి ప్రయోగించో, ఒకానొక స్త్రీని లొంగదీసుకోవడమన్నది కనీవినీ ఎరుగని పురుషులతో ఈ తరం రూపుదిద్దుకుని వుంటుంది. నిజమైన ప్రేమ ప్రాతిపదికగా తప్ప మరే కారణం చేతనూ పురుషుడి పొందును కోరుకోవడం తెలియని - ఆర్థిక పర్యవసానాల పట్ల భయం ప్రాతిపదికగా ప్రియుడి పొందును తిరస్కరించడమంటే ఏమిటో తెలియని - స్త్రీలతో ఈ తరం రూపుదిద్దుకుని వుంటుంది.**

**- ఎంగెల్స్**

**ఆధునిక పెట్టుబడిదారీ విధానానికీ, మధ్యయుగాల నాటి బాహాటమయిన బానిసత్వానికీ ఒకే ఒక్క తేడా వుంది - ఈ కాలపు కార్మికుణ్ణి గుండుగుత్తగా, జీవిత పర్యంతం అమ్మడం జరగడం లేదు; ఏ బానిస యజమానీ అతగాణ్ణి మరొక యజమానికి అమ్మడం లేదు; కనక అతగాడు మన కళ్లకి స్వేచ్ఛాజీవిలా కనిపిస్తాడు. కానీ కార్మికుడు తనను తాను ఏ రోజుకు ఆ రోజు, ఏ వారానికి ఆ వారం, ఏ నెలకి ఆ నెల చిల్లరగా అమ్ముకోక తప్పని పరిస్థితి వుందిక్కడ. ఈ కార్మికుడు ఒకానొక వ్యక్తికి బానిసగా వుండడం లేదు. ఆస్తిపరులయిన వర్గానికంతటికీ బానిసత్వం చేస్తున్నాడు.**

**- ఎంగెల్స్**




మార్క్సిస్టు మహోపాధ్యాయుడు, శ్రామిక తత్త్వవేత్త, సిద్ధాంతకర్త, విప్లవ నాయకుడు

# ఫ్రెడరిక్ ఎంగెల్స్ రెండవ శత జయంతి

డా॥ఆర్కే



| | | |
|---|---|---|
| పుట్టిన తేది | : | 1820 నవంబరు 28 |
| దేశం | : | ప్రష్యా, ఈనాటి జర్మనీ |
| ప్రదేశం | : | రైన్ రాష్ట్రం, వుప్పల్ టాల్ నదీలోయ, బార్మెన్ నగరం |
| కుటుంబ నేపథ్యం | : | సంపన్న, సాంప్రదాయక క్రైస్తవ కుటుంబం. తండ్రి - జౌళి మిల్లుల యజమాని, ఏడుగురు సంతానంలో ఎంగెల్స్ ఇంటికి పెద్ద కొడుకు |
| మరణం | : | 1895 ఆగస్టు 5, లండన్. |

రైన్ రాష్ట్రం ఖనిజ సంపదకి కాణాచి. ముడి ఇనుము, బొగ్గు గనులు వున్నాయి. పారిశ్రామిక విప్లవాల ప్రభావం ఆ ప్రాంతంపై ప్రస్ఫుటంగా వుంది. పరిశ్రమలు ప్రారంభమవటంతో ఫ్యూడల్ ఉత్పత్తి సంబంధాల్ని వెనక్కి నెట్టి పెట్టుబడిదారీ సమాజం వేళ్లూనింది. పెట్టుబడిదారులు, కార్మికులు ప్రధాన వర్గాలుగా ముందుకొచ్చాయి. ఈ కొత్త సమాజం, కొత్త దోపిడీల మధ్య పుట్టి పెరిగాడు ఫ్రెడరిక్ ఎంగెల్స్.

వుప్పల్ టాల్‌లోనే ఎంగెల్స్ పాఠశాల విద్యను పూర్తిచేసి ఉన్నత విద్యలోకి ప్రవేశించాడు. తరగతి పుస్తకాలనే కాదు, చుట్టూ సమాజాన్ని కూడ చదివాడు. కార్మిక కుటుంబాల దుర్భర జీవితాన్ని, యంత్ర కోరల రాక్షసత్వానికి చిదిమివేయబడినవారి పిల్లల బాల్యాన్ని చూచి చలించిపోయాడు. వీటికి కారణమైన ఫ్యాక్టరీ యజమానుల్ని, నాటి సామాజిక స్థితిగతుల్ని సమర్థించిన క్రైస్తవ మతాన్ని ఏవగించుకున్నాడు.

కుటుంబం ఎంగెల్స్ ఆలోచనలకి భిన్నంగా వుంది. తండ్రి మత ఛాందసుడు. ఎంగెల్స్ భావాల్ని సహించలేకపోయాడు. సాధారణ స్నేహితులు కూడా ఎంగెల్స్‌ని అర్థం చేసుకోలేక దూరమయ్యారు. తనకి సంగీతం, సాహిత్యం , క్రీడలంటే ఇష్టం. పుస్తకాలంటే మరీ పిచ్చి. వ్యాపారంలో ఎదగాలనేది తండ్రి బలమైన కోరిక. చివరికి తండ్రి ఒత్తిడితో 1837లో చదువుకి స్వస్తి చెప్పి వ్యాపారంలో మెళకువలు నేర్చుకొనేందుకు బ్రెమెన్ వెళ్ళాడు.

బ్రెమెన్ గొప్ప నౌకా కేంద్రం. విభిన్న భాషలు నేర్చుకున్నాడు. పలు పత్రికలు, పుస్తకాలు చదివాడు. వాటిల్లో కొన్ని ప్రభుత్వం నిషేధించినవి కూడ వున్నాయి. అతనిలోని సామాజిక స్పృహ రెక్క విప్పింది. ఫ్రెడరిక్ ఓస్వాల్డ్ పేరుతో కవితలు రాశాడు. పారిశ్రామీకరణ ఫలితంగా ఏర్పడిన సామాజిక దుస్థితిని వర్ణిస్తూ పత్రికలలో వ్యాసాలు రాశాడు. విద్యార్థిగా తాను చూచిన కార్మికుల దారిద్ర్యాన్ని, నికృష్టపు జీవితాన్ని 'వుప్పల్ టాల్ లేఖావళి' పేరుతో ప్రచురించాడు.

ప్రష్యా యువకులు సైన్యంలో ఒక ఏడాది పనిచేసి తీరాలి. 1841లో ఎంగెల్స్ బెర్లిన్ వెళ్ళి ఆర్మీలో చేరాడు. సైనిక విద్యను అభ్యసించాడు. ఫిరంగి పేల్చటం నేర్చుకున్నాడు. బెర్లిన్ విశ్వ విద్యాలయంలో బయటి విద్యార్థిగా తత్త్వశాస్త్ర బోధనలు విన్నాడు. అక్కడే హెగెల్ గతితార్కిక వాదానికి ఆకర్షితుడయ్యాడు. వామపక్ష యువ హెగెలియన్లతో కలిసి తిరిగాడు. వారి కార్యకలాపాలలో పాలుపంచుకొన్నాడు. హెగెల్ పై వ్యాసాలు రాశాడు. బెర్లిన్‌లోనే రాడికల్ సాహిత్యాన్ని ప్రచురించే మోసెస్ హెస్‌ను కలిసిన తర్వాత ఎంగెల్స్ కమ్యూనిజం వైపు మొగ్గాడు. హెగెల్ గతితర్కానికి, తార్కిక ముగింపు కమ్యూనిజమేనని అతడు వివరించాడు.

సైనిక శిక్షణ పూర్తి అయిన తర్వాత ఎంగెల్స్ తండ్రి అతనిని ఇంగ్లాండ్‌లోని మాంచెస్టర్‌కి పంపాడు. అక్కడ ఆయనకి జౌళి మిల్లు వుంది. దాని నిర్వహణ బాధ్యతలను అప్పగించాడు. 1842లో ఎంగెల్స్ మాంచెస్టర్ వచ్చాడు. అప్పటికి అతని వయస్సు 22 ఏళ్ళు.

మాంచెస్టర్ ఒక పారిశ్రామికనగరం. కార్మికోద్యమాలకు కేంద్రం. ఎంగెల్స్ ఉత్సాహం రెట్టింపు అయింది. ఇంగ్లాండులోని కార్మికుల స్థితిగతులను అధ్యయనం చేశాడు. వారి పోరాట రూపాలను పరిశీలించాడు. పరిశ్రమలు బలమైన కార్మికవర్గాన్ని సృష్టించాయి. శ్రమదోపిడీపైనే ఈ సమాజం నిర్మించబడింది. ఈ దోపిడీని నిర్మూలించాలంటే ఇప్పుడున్న పాలకవర్గాన్ని కూలద్రోయాలి. ఇదే ఆలోచనగా వ్యాసాలు రాశాడు. ప్రత్యక్షంగా సమావేశాలలో పాల్గొని ప్రసంగించాడు. ఆ కాలంలోనే వయోజన ఓటింగ్ హక్కు ఎన్నికల సంస్కరణల కోసం 'చార్టిస్టు ఉద్యమం' ఉధృతంగా సాగుతోంది. ఎంగెల్స్ ఆ ఉద్యమంలో భాగస్వామి అయ్యాడు.

ఎంగెల్స్ రాడికల్ భావాల్ని వదిలించటం కోసం అతని తండ్రి అతనిని మాంచెస్టర్ పంపాడు. కరుడుగట్టిన భౌతికవాదిగా ఎంగెల్స్ మార్పు చెందాడు. 1842లో 'రాజకీయ అర్థశాస్త్రం సంక్షిప్త విమర్శ' వ్యాసాన్ని రాశాడు. అది పెట్టుబడిదారీ ఆర్థిక విధానాన్ని సైద్ధాంతికంగా విమర్శించిన ఎంగెల్స్ తొలి రచన. 1844లో పారిస్ నుండి కారల్ మార్క్స్ ప్రధాన సంపాదకుడిగా వెలువడే పత్రిక (German French Year Book) లో ఈ వ్యాసం ప్రచురించబడింది.

అందులో ఇలా రాశాడు. సొంత ఆస్తి వ్యాపారంగా పరిణమించింది. వ్యాపారంలో ఒకడు అమ్మేవాడు. మరొకడు కొనేవాడు. ఒకరునొకరు నమ్మరు. ఇద్దరి మధ్య ఘర్షణ వుంటుంది. అందువల్లే వ్యాపారంలో ఎప్పుడూ రహస్యం దాగి వుంటుంది. రహస్యం మోసానికి దారి చూపుతుంది. ఒక్కమాటలో చెప్పాలంటే వ్యాపారం ఒక చట్టబద్ధ మోసం!

'అమ్మే వస్తువుకి విలువ' ఎలా ఏర్పడుతుంది? ఉత్పత్తికయ్యే ఖర్చులు బట్టి అంటారు ఇంగ్లీషువాళ్ళు. వుపయోగపు విలువ బట్టి అంటారు ఫ్రెంచివాళ్ళు. 19వ శతాబ్దం తొలిలో ప్రారంభమైన ఈ చర్చ ఇంతవరకు ముగియలేదు.

'శ్రమే ఉత్పత్తి. శ్రమే సంపదలకు మూలం'. '

'జాతీయ సంపద' – సొంత ఆస్తి వున్నంతకాలం ఈ పదానికి అర్థం లేదు. ఇంగ్లాండ్ జాతీయ సంపద అన్ని దేశాల కంటే ఎక్కువ అయినా గూడులేని కటిక పేదోళ్ళు ఎందరో వున్నారు.

ఈ వ్యాసం మార్క్సుని బాగా ఆకట్టుకొంది. "ఆర్థిక విషయాలపై అద్భుతమైన విమర్శనాత్మక రేఖాచిత్రం' అన్నాడు. పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థపై ఎంగెల్స్ భౌతికవాద దృక్పథానికి అది దర్పణం.

ఇంగ్లాండ్‌లోని మాంచెస్టర్, లండన్, లీడ్స్ నగర శివార్లలోని కార్మికవాడలలో తిరిగాడు. బతకటం కోసం తమ జీవితాలను ఫ్యాక్టరీలకు తాకట్టు పెట్టిన కార్మిక కుటుంబాలను వాళ్ళ ఇళ్ళకు వెళ్ళి పరిశీలించాడు. 1845లో 'ఇంగ్లాండ్‌లో కార్మికవర్గ స్థితిగతులు' అనే గొప్ప గ్రంథాన్ని ప్రచురించాడు. పారిశ్రామిక విప్లవం కార్మికులను నాశనం చేసిందన్నాడు. పరిశ్రమలు రాక ముందు, వచ్చిన తర్వాత జీవన ప్రమాణాలను ఎత్తిచూపాడు. పెద్ద నగరాలలో అంటువ్యాధులతో మరణించేవారి సంఖ్య గ్రామీణ ప్రాంతాల కంటే ఎక్కువని గణాంకాలతో నిరూపించాడు. ఐదు ఏళ్ళలోపు పిల్లల మరణరేటును జీవన పరిస్థితులకు గీటురాయిగా తీసుకున్నాడు.




కార్మికుల కష్టాలతో ఎంగెల్స్ సరిపెట్టలేదు. పోరాట రూపాలను సూచించాడు. ట్రేడ్ యూనియన్ల స్థాపన, సమ్మెలు కార్మికులకు రాజకీయాలు నేర్పే పాఠశాలలు అన్నాడు. పోరాట లక్ష్యం అంతిమంగా సోషలిజం అయి వుండాలన్నాడు.

పారిశ్రామిక విప్లవాల్ని గురించి రచించే చరిత్రకారులు, సామాజిక శాస్త్రజ్ఞులు ఈ పుస్తకాన్ని ప్రామాణికంగా తీసుకొన్నారు. ఛార్లెస్ డికెన్స్ నవల రెండు మహా నగరాలు' (A Tale of Two Cities)తో పోల్చి చూశారు.

మార్క్స్ సంపాదకత్వాన పారిస్ నుండి వెలువడే పత్రికలో రచనలు చేయటం ద్వారానే మార్క్స్ తో ఎంగెల్స్‌కి పరిచయం ఏర్పడింది. 1842 నవంబర్ 16న పారిస్‌లో తొలిసారి వారిరువురు కలుసుకున్నారు. 1844 ఆగస్టు 28న మళ్లీ సమావేశమై అనేక విషయాలు చర్చించారు. తమ భావాలలోని సారూప్యతను పంచుకొన్నారు. కలిసి పని చేయాలని నిర్ణయించారు. వారి కలయిక ఒక గొప్ప చారిత్రక సంఘటన. అది అపూర్వ మేధోమైత్రి. చేయి చేయి కలిపి ఈ ప్రపంచాన్ని మరో మలుపు త్రిప్పిన దృఢమైత్రి.

మార్క్స్, ఎంగెల్సులు మొదట్లో యంగ్ హెగెలియన్‌వాదులు. హెగెల్ ప్రభావం వారిపై ఎక్కువగా వుండేది. ప్రతిదానిలో పరస్పర విరుద్ధ శక్తులున్నాయని, వాటి మధ్య ఘర్షణే చలనం లేదా మార్పుకు మూలమని, ఈ చలనం పరిమాణాత్మక మార్పులుగా మొదలై గుణాత్మక మార్పులుగా, పాత నుండి కొత్తకు, క్రింది నుండి పైకి, సరళం నుండి సంక్లిష్టతకు నిరంతరం అభివృద్ధి చెందుతాయనేవి గతితార్కిక సూత్రాలు. కాని హెగెల్ భౌతిక వాదాన్ని నిరాకరించాడు. 'అఖండ భావం' ఒకటి వుందని అదే అన్నిటికి అసలు మూలమని చెప్పి గతితర్కానికి భావవాదాన్ని జోడించాడు.

హెగెల్ భావవాదాన్ని ఫోయర్‌బాఖ్ తీవ్రంగా ఖండించాడు. దేవుడు మనిషిని సృష్టించలేదు. మనిషే దేవుడిని సృష్టించాడు అని చెప్పి భౌతికవాదాన్ని సమున్నతంగా నిలిపాడు. అయితే హెగెల్ గతితర్కాన్ని ఫోయర్‌బాఖ్ తిరస్కరించాడు. భౌతికవాదాన్ని ప్రకృతికి మాత్రమే పరిమితం చేసి మానవ సమాజాన్ని మినహాయించాడు. హెగెల్, ఫోయర్‌బాఖ్‌లలోని ఈ లోపాలను తొలగించి గతితార్కిక చారిత్రక భౌతికవాదాన్ని మార్క్స్, ఎంగెల్స్‌లు సిద్ధాంతీకరించారు. ఇద్దరూ కలసి 'పవిత్ర కుటుంబం', 'జర్మన్ ఐడియాలజీ' తాత్త్విక గ్రంథాలను రచించారు.




బ్రూనో బౌవర్, ఇతర జర్మన్ తత్త్వవేత్తలు తత్త్వశాస్త్రం పరిశుద్ధంగా వుండాలని, రాజకీయాలు జోలికి పోగూడదని చెబుతూ కార్మికవర్గాన్ని అలగాజనంగా అపహాస్యం చేశారు. చరిత్ర కొందరు విశిష్ట వ్యక్తుల చేత నిర్మించబడుతుందన్నారు. ఈ వాదనని ఖండిస్తూ మార్క్స్, ఎంగెల్స్‌లు 'పవిత్ర కుటుంబం' రాశారు. నిజమైన చరిత్ర నిర్మాతలు ప్రజలేనని, ప్రపంచాన్ని పునర్నిర్మించే చారిత్రక బాధ్యత కార్మికవర్గంపై వుందని ప్రతిపాదించారు.

'జర్మన్ ఐడియాలజీ'లో చారిత్రక భౌతికవాదాన్ని ఆవిష్కరించారు. భౌతిక విలువల ఉత్పత్తి విధానంపై సామాజిక, ఆర్థిక వ్యవస్థ ఆధారపడి వుంటుందని నిరూపించారు. భావాలు, సిద్ధాంతాలు, రాజకీయ అభిప్రాయాలు ఆయా సామాజిక జీవన పరిస్థితుల నుండే పుడతాయన్నారు. వర్గసమాజంలో వర్గ వైరుధ్యాలుంటాయి. అవి వర్గపోరాటంగా వ్యక్తమవుతాయి. ఒక వ్యవస్థ నుండి మరొక ఉన్నత వ్యవస్థ ఆవిర్భవించటం అనేది అనివార్యమైన చారిత్రక నియమం. ఫ్యూడలిజం నుండి పెట్టుబడిదారీ సమాజం, దాని నుండి సోషలిజం అమలులోకి వచ్చి తీరుతుందని, ఇందుకోసం శ్రామికవర్గం రాజకీయ అధికారాన్ని సంపాదించాలని సూత్రీకరించారు. శ్రామికవర్గ నియంతృత్వం గురించి గూడా బీజప్రాయంగా ఈ గ్రంథంలో వుంది. దీనిని ప్రచురించటానికి ప్రచురణకర్తలు నిరాకరించారు. మార్క్స్, ఎంగెల్స్‌ల మరణానంతరం అది ముద్రించబడింది.

"తత్త్వవేత్తలు ఇంతకాలం ప్రపంచానికి రకరకాల భాష్యాలు మాత్రమే చెప్పారు. అయితే ఇప్పుడు కావాల్సింది ప్రపంచాన్ని మార్చడమెలాగ అన్నదే". మార్క్స్, ఎంగెల్స్‌ల ఈ సూత్రీకరణ తత్త్వశాస్త్రాన్నే సమూలంగా మార్చివేసింది. గతితార్కిక, చారిత్రక భౌతికవాదం శ్రామికవర్గం ఆయుధమైంది.

1844-48 మధ్య ఊహాజనితవాదంలో తేలియాడే సోషలిస్టుల గ్రూపులు యూరప్‌లో, ముఖ్యంగా ఫ్రాన్స్‌లో వుండేవి. వాటిల్లో 'లీగ్ ఆఫ్ జస్ట్' ఒకటి. దీనికి జర్మనీ, ఇంగ్లండ్, స్విట్జర్లాండ్ తదితర దేశాలలో శాఖలున్నాయి. శ్రామికవర్గ పార్టీ స్థాపించే ప్రయత్నాలలో మార్క్స్, ఎంగెల్సులు బ్రస్సెల్స్‌ను ఎన్నుకొన్నారు. 'ది బ్రస్సెల్స్ కమ్యూనిస్టు కరెస్పాండెన్స్ కమిటీ' పేర వివిధ దేశాలలోని సోషలిస్టు, కార్మికోద్యమ నాయకులతో ఉత్తర, ప్రత్యుత్తరాలు జరిపేవారు. ఇతర గ్రూపులతో సంబంధాలు పెట్టుకొన్నారు. అంతర్జాతీయ కమ్యూనిస్టు మహాసభ జరపాలనే ప్రతిపాదన వచ్చింది.

బ్రస్సెల్స్ కమిటీ ఆదేశంపై ఎంగెల్స్ పారిస్ వెళ్ళి లీగ్ ఆఫ్ జస్ట్ సభ్యులతో చర్చలు జరిపాడు. వారిలో వున్న తీవ్ర గందరగోళాన్ని గమనించాడు. ఒక సమావేశంలో శ్రామికవర్గ ప్రయోజనాలు కాపాడాలని, ప్రైవేటు యాజమాన్యాన్ని రద్దు చేయాలని, ఇందులో సాయుధ ప్రజాతంత్ర విప్లవమే మార్గమని గుర్తించాలని సూచించాడు. వాగ్వివాదం జరిగింది. అప్పటికే మార్క్స్, ఎంగెల్స్ రచనలు కార్మిక వర్గాలలో చొచ్చుకుపోయాయి. ఓటింగ్‌లో అత్యధికులు ఎంగెల్స్‌ను బలపరిచారు. చీలిక వచ్చింది. 1847లో లీగ్ ఆఫ్ జస్ట్ లండన్ శాఖ చొరవ తీసుకొని మహాసభ జరిపింది. 'కమ్యూనిస్టు లీగ్' పేరుతో కొత్త సంస్థను ఏర్పాటు చేశారు. 'ప్రపంచ కార్మికులారా ఏకంకండి' అనే నినాదం ప్రపంచమంతా మార్మోగింది. బ్రస్సెల్స్‌లో పత్రికను స్థాపించారు. శ్రామిక విప్లవం అంతిమ లక్ష్యం సోషలిస్టు విప్లవమేనని ప్రకటించారు. కార్యక్రమం ముసాయిదాని మార్క్స్, ఎంగెల్సులు రాయాలన్నారు.

ప్రిన్సిపల్స్ ఆఫ్ కమ్యూనిజం' పేరున ప్రశ్న-జవాబుల రూపంలో ఒక చిత్తు ప్రతిని ఎంగెల్స్ తయారుచేశాడు. ఇది ప్రామాణిక పత్రం, కొద్దిగా ఆలోచించి మళ్లీ రాయమన్నాడు మార్క్స్. దాని ఫలితమే 'కమ్యూనిస్టు ప్రణాళిక'. 1847 - నవంబరు - డిసెంబరు మాసాల్లో లండన్లో కమ్యూనిస్టు లీగ్ మహాసభలో ప్రతిపాదించబడి ఆమోదించబడింది. 1848 ఫిబ్రవరి 21న ప్రచురించబడింది. ప్రపంచ కార్మిక వర్గానికి ఆనాడు నుండి ఈనాటి దాకా కరదీపికగా వెలుగొందినది.

1848-49 యూరప్ అంతటా ఆర్థికసంక్షోభం మిన్నంటింది. పరిశ్రమలు మూతపడ్డాయి. కార్మికులు వీధిన బడ్డారు. రైతులు అప్పులపాలయ్యారు. ధరలు, కరువు, ఆకలి జనం జవసత్వాలను పీల్చివేశాయి. అంతటా సమ్మెలు, ఊరేగింపులు, చివరికి ఫ్యూడల్ రాజరికానికి వ్యతిరేకంగా తిరుగుబాట్లు వచ్చాయి. వీటికి పెట్టుబడిదారీవర్గం నాయకత్వం వహించింది. మధ్యతరగతి, మేధావి వర్గం, కార్మికులు పాల్గొన్నారు.

రాజరికాన్ని కూల్చివేసి రిపబ్లిక్‌ను స్థాపించాలనే లక్ష్యంతో విప్లవాలు మొదట సిసిలీలో ప్రారంభమై, ఫ్రాన్స్, జర్మనీ, స్విట్జర్లాండ్, ఇటలీ, ఆస్ట్రియా తదితర 50 దేశాలలో ఉవ్వెత్తున లేచాయి. ఈ విప్లవాలను శ్రామికవర్గానికనుకూలంగా మలుచుకోవాలని మార్క్స్, ఎంగెల్సులు నిర్ణయించారు.

ఫ్రాన్స్‌లో కమ్యూనిస్టులీగ్ కొత్త కేంద్రకమిటీని ఏర్పాటు చేశారు. తమ కార్యకలాపాలకు జర్మనీని కేంద్రంగా

ఎంచుకోవాలనుకున్నారు. 1848 నాటికి జర్మనీని కేంద్రంగా ఎంచుకొన్నారు. 1848 నాటికి జర్మనీ 38 చిన్న రాజ్యాలుగా వుండేది. వాటిని సమైక్య ప్రజాతంత్ర జర్మనీగా ఏకీకరణ చేయాలి. ఫ్యూడల్ సంకెళ్ళను తెంచి రైతాంగాన్ని విముక్తి చేయాలి. ప్రైవేటు వనరులను పబ్లిక్ పరం చేయాలి. మతాన్ని ప్రభుత్వం నుండి వేరు చేయాలి. ఇవి జర్మనీ కమ్యూనిస్టు లీగ్ డిమాండ్లు. జర్మనీ కార్మికోద్యమ కేంద్రమైన రైన్ రాష్ట్రంలోనే కోలోన్‌కు మార్క్స్, ఎంగెల్స్‌లు చేరుకొన్నారు.

జర్మనీ కమ్యూనిస్టు లీగ్ నిర్మాణ క్రమంలో అనేక కష్టాలను ఎదుర్కొన్నారు. విప్లవ పోరాటంలో పారిశ్రామిక కార్మికుల సంఖ్య తక్కువ. అసంఘటిత పనివారు ఎక్కువ. మధ్యతరగతి మేధావి వర్గం గందరగోళంలో వుంది. లీగ్ సభ్యులు రెండు, మూడు వందలకు మించి లేరు. వారు ఎవరి దృష్టిని ఆకర్షించే స్థితిలో లేరు. ఈ పరిస్థితులలో ఒంటెత్తు పోకడ పోయేకంటే, ప్రజాస్వామ్య ఉద్యమంలో భాగమై ముందుకు పోవటం మంచిది. ఇందుకోసం 'నవరైన్ వార్తాపత్రిక', ఉపశీర్షిక 'ప్రజాస్వామ్య పత్రిక' అనే పేరుతో తొలి సంచికను 1848 జూన్ 1న విడుదల చేశారు. మార్క్స్ ప్రధాన సంపాదకులు. ప్రధాన బాధ్యత పూర్తిగా ఎంగెల్స్‌కి అప్పగించబడింది. మనసా వాచా ఎంగెల్స్ పత్రికా రచనను ఆస్వాదించాడు.

1848 యూరప్ విప్లవాలపై మధ్యతరగతివర్గం అమితమైన భ్రమలతో వుండేది. పెట్టుబడిదారీవర్గ విద్రోహం గురించి ఏమరుపాటుగా వుండేది. శ్రామికపార్టీలు, సంఘాలు బలహీనంగా వుండేవి. ఈ పరిస్థితులలో 1848 జూన్‌లో పారిస్ కార్మిక, (ప్రజాతంత్ర) ఉద్యమం ఓటమి పొందింది. దీనిని సాకుగా తీసుకొని జర్మన్ కార్మికోద్యమాన్ని రక్తపుటేరుల్లో ముంచాలని ప్రభుత్వ వర్గాలు కుట్ర పన్నాయి. సెప్టెంబర్ 26న కోలోన్‌ను ముట్టడి ప్రాంతంగా ప్రకటించింది. పౌరసేనను నిరాయుధం చేసింది. 'నవరైన్' పత్రికను నిషేధించింది. ఎంగెల్స్‌పై అరెస్టు వారెంటును జారీ చేసింది. అరెస్టును తప్పించుకోవటానికి ఎంగెల్స్ బార్మెన్‌లోని ఇంటికి వెళ్ళాడు. తండ్రి మండిపడ్డంతో బ్రస్సెల్స్, పారిస్ మీదుగా కాలినడకన స్విట్జర్లాండ్ వెళ్ళాడు. చివరికి 1849 జనవరిలో తిరిగి జర్మనీకి వచ్చాడు.

1849 వసంతకాలం, ఆఖరిపోరాటం. అమీతుమీ తేల్చుకోవటానికి విప్లవ వర్గాలు, విద్రోహ శక్తులు సిద్ధమయ్యాయి. మధ్యతరగతి వర్గంలో కొందరు రాజీకి ప్రయత్నాలు చేశారు. 'నవరైన్' పత్రికలో ఎంగెల్స్ వారిని తీవ్రంగా విమర్శించాడు. ఆ వర్గంతో తెగతెంపులు చేసుకొని మార్క్స్, ఎంగెల్సులు కోలోన్ కేంద్రంగా అఖిల జర్మనీ కార్మికసంఘాల సమాఖ్యను ఏర్పాటు చేయటానికి కృషి చేశారు. చెల్లాచెదురైన లీగ్ సభ్యులతో సంబంధాలు పెట్టుకొన్నారు.




మే మాసంలో తిరుగుబాట్లు ప్రారంభమయ్యాయి. ఎంగెల్స్ సాయుధ పోరాటానికి ఒక పథకాన్ని రూపొందించాడు. సాయుధ పోరాటంలో ప్రజల విప్లవశక్తి గరిష్టస్థాయిలో వికసించాలని, దృఢమైన కేంద్రీకృత నాయకత్వం కావాలని, మెరుపు వేగంతో నిర్ణయాత్మకమైన కార్యాచరణ వుండాలని రాశాడు. సాయుధ పోరాటం ఒక కళ అన్నాడు. పథకాన్ని రచించటమేగాదు, మే 10న రైఫిల్ పుచ్చుకొని తన జన్మస్థలమైన వుప్పల్ టాల్‌కి బయలుదేరాడు. రైన్ నదీ తీరంలో రెండుచోట్ల తిరుగుబాటులో పాల్గొన్నాడు. తిరుగుబాటుకు నాయకత్వం వహించిన మధ్యతరగతి మేధావివర్గం సరైన వ్యూహం – ఎత్తుగడలు అనుసరించక పోవటంతో అది విఫలమైంది.

35 ఏళ్ళ తర్వాత 1849 మే 19న 'నవరైన్' పత్రికను శాశ్వతంగా మూసివేయాల్సి వచ్చింది. 1849 జూలై నాటికి జర్మన్ తిరుగుబాటు పూర్తిగా అణచివేయబడింది. బడా పెట్టుబడిదారీవర్గం విద్రోహం, మధ్యతరగతి మేధావివర్గం ఊగిసలాట, శ్రామికవర్గం బలహీనత, నిర్మాణలోపాలు, ఆర్థిక రంగంలో జర్మనీ వెనుకబాటుతనం ఓటమికి కారణమని ఎంగెల్స్ విశ్లేషించాడు.

మార్క్స్, ఎంగెల్స్‌లు చివరికి లండన్ చేరారు. అక్కడ కొంత మేరకు స్వేచ్ఛ వుంటుంది. కమ్యూనిస్టు లీగ్‌ను పునరుద్ధరించి 1849 సెప్టెంబరు నాటికి కేంద్రకమిటీని ఏర్పాటుచేశారు. ఎంగెల్స్‌ను కమిటీలోకి తీసుకొన్నారు. ఒక కొత్త పత్రికను తీసుకురావటానికి సన్నాహాలు చేశారు. నూతన అంతర్జాతీయ పరిస్థితి పై మార్క్స్, ఎంగెల్స్‌లు సమీక్ష రాశారు. పారిశ్రామికోత్పత్తి సాధారణ పునరుజ్జీవం పొందుతున్న తరుణంలో నిజమైన విప్లవం వచ్చే సమస్యలేదని, ఒక కొత్త విప్లవం ఒక కొత్త సంక్షోభం వెంబడి మాత్రమే రాగలదని అందులో పేర్కొన్నారు. లీగ్ కమిటీలో తీవ్ర చర్చ జరిగింది. రెండుగా విడిపోయారు. మార్క్స్ నాయకత్వాన అధిక సంఖ్యాకులు లీగ్ కమిటీ ఆఫీసును కోలోన్‌కు మార్చారు. 1848–49 నాటి విప్లవ పోరాటాల ఫలితాలను క్రోడీకరించారు. ఎంగెల్స్ 'జర్మనీలో విప్లవం – ప్రతీఘాతం' అనే పుస్తకంలో విశ్లేషించాడు. వర్గ పోరాటంలో రైతుల పాత్ర ఆవశ్యకతను వివరించటానికి 1525లో జరిగిన 'జర్మనీ రైతాంగ పోరాటం' పై మరో పుస్తకాన్ని రాశాడు.




చీలిక తర్వాత లీగ్ గడ్డుకాలాన్ని ఎదుర్కొంది. కోలోన్‌లో 11 మంది లీగ్ సభ్యులను కోర్టులో విచారించి శిక్షలు వేశారు. లండన్ లీగ్ శాఖకు, ఇతర యూరోపియన్ శాఖలకు సంబంధాలు తెగిపోయాయి. ఆచరణలో లీగ్ అస్తమించినట్లయింది. 1852 నవంబరులో మార్క్స్ సలహాపై లీగ్‌ను రద్దుచేశారు.

ఒక వైపు మార్క్స్, నిరంతర సైద్ధాంతిక కృషి, మరోవైపు కుటుంబ పోషణ భారం, కష్టాలు ప్రారంభమైనాయి. ఈ పరిస్థితులలో మార్క్స్ కోసం ఎంగెల్స్ తనకే మాత్రం యిష్టంలేని వాణిజ్యంలోకి దిగాడు. మాంచెస్టర్ జేరుకొని తండ్రి కంపెనీలో పనికి ఒప్పుకున్నాడు. ఇదే కాలంలో తన ఫ్యాక్టరీలో కూలీగా పనిచేస్తున్న ఐరిస్ యువతి మేరీ బర్న్‌ని ప్రేమించి సహజీవనం చేశాడు. 1863 జనవరి 6న ఆమె గుండె జబ్బుతో చనిపోయింది. ఎంగెల్స్‌కుకు మానసికంగా లోటు ఏర్పడింది. మార్క్స్–ఎంగెల్స్‌లు దాదాపు 20 ఏళ్ళు వేర్వేరు నగరాలలో నివసించారు. ఇద్దరి మధ్య నిత్యం ఉత్తర ప్రత్యుత్తరాలు కొనసాగేవి. అనేక సమస్యలపై పరస్పరం అభిప్రాయాలను పంచుకొనేవారు. ఆర్థిక బాధలతో మార్క్స్ కుటుంబం అమితమైన దారిద్ర్యాన్ని అనుభవించింది. ఒకే కొడుకు చిన్నతనంలోనే జబ్బుతో చనిపోయాడు. ఈ కష్టాలలోనే మార్క్స్ మహత్తరమైన 'కేపిటల్' రచనలో వున్నాడు. ఆ కృషి ఆగకుండా కొనసాగటమే ఎంగెల్స్ ధ్యేయం. తన ప్రియ మిత్రుడిని ఆదుకోవటం కోసమే తండ్రి వ్యాపారంలో కొనసాగాడు.

1857 పారిశ్రామిక సంక్షోభం – ఈ సంక్షోభ భారాన్ని కార్మికులపై నెట్టివేయడానికి యాజమాన్యం ప్రయత్నించారు. కార్మికులు సమ్మెకి దిగారు. ఆర్థిక డిమాండ్ల నుండి రాజకీయ డిమాండ్లకు పోరాటం అభివృద్ధి చెందింది. ఫ్రాన్స్ కార్మికవర్గం ముందడుగు వేసింది. జర్మనీ వారిని అనుసరించింది. ఇంగ్లండ్, పోలండ్లు చేయి కలిపాయి. కార్మికోద్యమంలో వచ్చిన ఈ కొత్త వెల్లువను మార్క్స్ – ఎంగెల్స్‌లు సంఘటితం చేయాలనుకొన్నారు. 1864 సెప్టెంబర్ 28న లండన్ తొలి సెయింట్ మార్టిన్ హాలులో 'అంతర్జాతీయ కార్మిక సంఘాన్ని' స్థాపించారు. పలు అతివాద, మితవాద పోకడలను ఎదుర్కొన్నారు.

అనారోగ్యాన్ని, ఆర్థిక బాధలను తట్టుకొంటూ, సంఘం కార్యకలాపాలలో బిజీగా వుంటూనే మార్క్స్ 1867 మార్చి 27న 'కేపిటల్' మొదటి భాగాన్ని పూర్తిచేశాడు; దీని వెనుక ఎంగెల్స్ సాయం వెలగట్టలేం. ప్రతి సమస్యపై ఎంగెల్స్‌తో చర్చించి మార్క్స్ ముందు కెళ్ళేవాడు. కేపిటల్ గురించి ఎంగెల్స్ "ప్రపంచంలో పెట్టుబడిదారులు, కార్మికులు వున్నంతకాలం కార్మికుల దృష్టిలో ఈ పుస్తకానికున్నంత ప్రాధాన్యం మరి దేనికీ వుండబోదు" అని రాశాడు. కేపిటల్ ప్రచురించినపుడు పెట్టుబడిదారీ వర్గ ఆర్థికవేత్తలు వ్యూహాత్మకంగా మౌనం వహించారు. ఎంగెల్స్ తన ఎత్తుగడలతో ఈ కుట్రను బద్దలు కొట్టాడు. కేపిటల్‌పై కొన్ని వ్యాసాలను, విమర్శలను స్నేహితుల పేరుతో పత్రికలకు పంపాడు. వాటి పై చర్చ లేపి మౌనాన్ని బద్దలుగొట్టాడు.

తండ్రి వ్యాపారానికి ఎంగెల్స్ గుడ్‌బై చెప్పాడు. 1870 సెప్టెంబర్‌లో లండన్ చేరాడు. మార్క్స్, ఎంగెల్స్‌లు రోజూ కలుసుకునేవారు. గంటల తరబడి చర్చలు జరిపేవారు. మార్క్స్ కుటుంబానికి ఎంగెల్స్ దగ్గరయ్యాడు.

ఇదే కాలంలో ఫ్రాన్స్ – ప్రష్యా యుద్ధం కొనసాగింది. ఆ యుద్ధంపై ఎంగెల్స్ పత్రికలకు వ్యాసాలు రాసేవాడు. ఫ్రాన్స్ ఓటమి ఖాయం అని జోస్యం చెప్పాడు. అన్నట్టే జరిగింది. ఫ్రాన్సు ప్రభుత్వం ప్రష్యాతో రాజీకి దిగింది. ఫ్రాన్స్ కార్మికవర్గం ఈ జాతీయ ద్రోహాన్ని వ్యతిరేకించింది. ఫ్రాన్స్ రక్షణకు పూనుకొంది. చుట్టూ పారిస్‌ను శత్రుసైన్యం చుట్టుముట్టింది. తిండి తిప్పలులేని కార్మికులపై సొంత ప్రభుత్వం ఫిరంగులను ఎక్కుపెట్టింది. ప్రజలు తిరగబడ్డారు. పారిస్ కార్మికుల సహాయార్థం మార్క్స్ ఎంగెల్స్‌లు అంతర్జాతీయ శ్రామికవర్గాన్ని సమీకరించే ప్రయత్నాలు ముమ్మరం చేశారు.

పారిస్ కమ్యూన్ కూలద్రోయబడింది. దాని ప్రాముఖ్యాన్ని విశ్లేషిస్తూ మార్క్స్ ఫ్రాన్సులో అంతర్యుద్ధం' పుస్తకం రాశాడు. శ్రామిక పార్టీ శ్రామిక నియంతృత్వం పట్ల తమ వైఖరిని మార్క్స్, ఎంగెల్స్‌లు మళ్ళీ చాటిచెప్పారు.

1871 సెప్టెంబర్‌లో లండన్, 1872లో హేగ్‌లో జరిగిన మొదటి ఇంటర్నేషనల్‌కి మార్క్స్ ఎంగెల్స్‌లు నాయకత్వం వహించారు. కార్మికులు రాజకీయాలకు దూరంగా వుండాలనే ధోరణిని చీల్చి చెండాడారు. శ్రామికపార్టీ నిర్మాణ ఆవశ్యకతను నొక్కి చెప్పారు.

పారిస్ కమ్యూన్, మొదటి ఇంటర్నేషనల్ తర్వాత సోషలిస్టు సిద్ధాంతంలో అనేక పెడధోరణులు బయలుదేరాయి.

దూరింగ్ బెర్లిన్ యూనివర్శిటీ ప్రొఫెసర్, సోషలిజం పేరుతో ఊహాజనిత సిద్ధాంతాల్ని ప్రవేశపెట్టాడు. మార్క్స్ కేపిటల్ మొదటి సంపుటిపై తప్పుడు వ్యాఖ్యానాలు చేశాడు. ఎంగెల్స్ 'యాంటీ దూరింగ్' పేరుతో ఒక ప్రఖ్యాత గ్రంథం రచించాడు. అది జర్మన్ భాషలో 1870లో, ఇంగ్లీషులో 1907లో ప్రచురించబడింది.




దీనిలో రాజకీయ అర్థశాస్త్రం, సోషలిజం, తత్త్వశాస్త్రంపై మార్క్సిస్టు సిద్ధాంతాన్ని సమగ్రంగా అన్ని కోణాలలో వివరించాడు. భావవాదానికి ఏమాత్రం తావు లేకుండా భౌతికవాద దృక్పథంతో ప్రకృతి, సమాజం మానవ ఆలోచనలకి గతితార్కిక సూత్రాలను అన్వయించి ఒక నూతన శాస్త్రంగా ఎంగెల్స్ అభివృద్ధి చేశాడు. అది ఒక మార్క్సిస్టు ఎన్‌సైక్లోపిడియాగా ప్రసిద్ధి చెందింది. 'సోషలిజం – ఊహాజనితం, శాస్త్రీయం' మరో చిన్న పుస్తకం. గొప్ప ప్రాముఖ్యత గలది. ఇది 1880లో ప్రచురించబడింది. 'యాంటి ద్యూరింగ్' గ్రంథ సారాంశాన్ని ఎంగెల్స్ ఇందులో పొందుపరిచాడు. ఎన్నో ముద్రణలు పొందింది. ఫ్యూడలిజం నుండి పెట్టుబడిదారీవర్గం కార్మికవర్గం ఆవిర్భావం గురించి చక్కగా వివరించాడు.

తాత్కాలికంగా వచ్చిన 'శాంతి' కాలాన్ని మార్క్స్, ఎంగెల్స్‌లు జాగ్రత్తగా వినియోగించుకొన్నారు. జర్మన్ పార్టీలోని అతివాద, మితవాద పోకడలకు వ్యతిరేకంగా పోరాడుతూనే మార్క్స్, ఎంగెల్స్‌లు ఇంతవరకు ఎవరూ రాయని శాస్త్రీయ సిద్ధాంతాల్ని పరిశోధించి గ్రంథస్థం చేశారు. మార్క్స్ ఆరోగ్యం అంతంత మాత్రంగానే వుంది. కేపిటల్ 2, 3 సంపుటిలను త్వరత్వరగా పూర్తి చేయటానికి తొందర పడుతున్నాడు. ఇందుకు ఏంగెల్స్ అన్ని విధాల సాయపడుతూనే ప్రకృతి శాస్త్రాలను గతితార్కిక దృక్పథంతో పరిశీలించాడు. 'ప్రకృతి – గతితర్కం' అసంపూర్తి రచన 1872-82 మధ్య రాశాడు. పునరుజ్జీవ కాలం నుండి డార్విన్ కాలం వరకు ప్రకృతి శాస్త్రంలో జరిగిన అభివృద్ధిని సమీక్షించాడు. పదార్థ చలన రూపాలను, పరిమాణాత్మక మార్పుల నుండి గుణాత్మక మార్పులు ఎలా సంభవిస్తాయో చర్చించాడు. ఇది ఎంగెల్స్ మరణానంతరం 1920లో మాస్కోలో ప్రచురించబడింది.

జీవం పుట్టుకపై రష్యన్ శాస్త్రవేత్త ఒపారిన్, బ్రిటిష్ శాస్త్రవేత్త జె.బి.యస్. హాల్డేన్ పరిశోధనలు జరిపారు. ఇద్దరూ భౌతికవాదులు. ఎంగెల్స్ ప్రొటోప్లాజం గురించి ఎక్కువగా ప్రస్తావించాడు. 'ప్రొటీన్ల చలనమే జీవం' అన్నాడు. ఎంగెల్స్ గతితార్కిక ఆలోచన తమను ప్రభావితం చేసిందన్నారు.

డార్విన్ 'జీవజాతుల పుట్టుక' గ్రంథాన్ని విడుదలైన 12 రోజులకే ఎంగెల్స్ కొని చదివాడు. మనుగడ కోసం జీవుల మధ్య జరిగే పోరాటంలో అర్హత గల జీవులనే ప్రకృతి ఎన్నిక చేస్తుందని డార్విన్ సూత్రీకరించాడు. దీనిని కొందరు మానవజాతికి ముడిపెట్టి పెట్టుబడిదారీ వ్యవస్థలో వ్యాపార పోటీ అనివార్యమని, ఈ పోటీలో పెద్ద చేపలు చిన్న చేపల్ని మింగినట్లు పెద్ద వ్యాపారులు చిన్న వ్యాపారుల ఆస్తులను లాగేయటం సహజమని సమర్థించారు.

జంతువును, మనిషిని ఒకే గాట కట్టిన ఈ మాల్థస్ సిద్ధాంతాన్ని ఎంగెల్స్ విమర్శించాడు. 'వానరుడి నుండి నరుడి పరిణామంలో శ్రమ పాత్ర' అనే పుస్తకాన్ని రచించాడు. పనిముట్ల తయారీతో శ్రమ ప్రారంభమైందని, శ్రమ చేతుల్ని సృష్టించాయని నిరూపించాడు. శ్రమ మాటల్ని నేర్పింది. మెదడుకు ఇంధనంగా మారింది. ఆహారాన్ని ఉత్పత్తి చేసుకొని నిల్వ చేసుకొనే శక్తి ఒక్క మనిషికి మాత్రమే వుంది. అసంపూర్ణంగా ముగిసిన ఈ రచనలోనే పర్యావరణ పరిరక్షణ గురించి కూడా ఆయన ఆనాడే చెప్పాడు. "ప్రకృతిపై మన విజయాలు గురించి గొప్పలు చెప్పుకోవచ్చు. ప్రతి విజయానికి ప్రకృతి మనపై కక్ష తీర్చుకొంటుంది." మెసపొటేమియా, గ్రీస్, ఆసియా మైనర్ తదితర ప్రాంతాలలోని అడవుల్ని కొట్టి సాగుచేయటం వాతావరణంపై తీవ్ర ప్రభావం చూపిందని చెబుతూ "మన మెదడు, రక్తమాంసాలు ప్రకృతిలో భాగమే''నన్నాడు. ప్రకృతిపై పోరాటం విదేశీయులపై దండయాత్రలా వుండగూడదని, ప్రకృతి సూత్రాలను తెలుసుకొని వాటిని సరిగ్గా అన్వయించాలని చెప్పాడు.

కారల్ 14 మార్చి 1883న అస్తమించాడు. ఎంగెల్స్ ఆయన సమాధి వద్ద ఇలా అన్నాడు. "ఆ సజీవ మేధస్సు ఆలోచన ఆగిపోయింది. మేం రెండు నిముషాలు బయటకు వెళ్ళి వచ్చాం. పడక్కుర్చీలో ఆయన ప్రశాంతంగా శాశ్వతంగా నిద్రపోతున్నాడు".

డార్విన్ 'జీవజాతుల పుట్టుక సిద్ధాంతం జీవశాస్త్రాన్ని మార్చినట్లు, మార్క్స్ 'అదనపు విలువ సిద్ధాంతం' అర్థశాస్త్రాన్ని మార్చివేసింది.

మార్క్స్ కేపిటల్ రెండవ, మూడవ సంపుటులు రాతప్రతులు గానే వున్నాయి. వాటికి ఒక రూపం యిచ్చి ప్రచురించాలి. గజిబిజిగా వుండే మార్క్స్ రాత ఎంగెల్స్‌కి మాత్రమే అర్థమవు తుంది. కనుక ఆయన తన జీవితకాలంలోనే పూర్తి చేయాలి. అనారోగ్యంగా వున్నా, కంటిచూపు మందగించినా లెక్కచేయక వాటిని పూర్తిచేశాడు. మార్క్స్ కుటుంబానికి అండగా వున్నాడు.

మార్క్స్ మరణాంతరం ఎంగెల్స్ 12 ఏళ్ళు బతికాడు. ఈ కాలంలో "కుటుంబం, వ్యక్తిగత ఆస్తి, రాజ్యాంగ యంత్రాల పుట్టుక" అనే మహత్తర గ్రంథాన్ని రాశాడు. మోర్గన్ పరిశోధనా గ్రంథం 'ఆదిమ సమాజం' ఆధారంగా ప్రాచీన చరిత్రను భౌతికవాద దృక్పథంతో రాసిన ఈ రచన అద్భుతమైనది.

☞ మిగతా 31వ పేజీలో



# రాజకీయార్థికవేత్తగా ఎంగెల్స్

ఎన్ వేణుగోపాల్
ఎడిటర్, వీక్షణం మాసపత్రిక






ఫ్రెడరిక్ ఎంగెల్స్ గురించి ఇప్పటివరకూ తెలుసుకున్న దాని కన్న ఎక్కువ తెలుసుకోవడానికి ఆయన ద్విశతజయంతి ఒక సందర్భం. మార్క్స్ పేరుతో కలిసిపోయి, ఆయన నీడలో ఉండిపోయినందు వల్ల ఎంగెల్స్ గురించి మనకు తెలియవలసి నంతగా తెలియలేదు. పద్దెనిమిదో ఏట 1838లో మొట్టమొదటి కవిత అచ్చయిననాటి నుంచి డెబ్బై ఐదో ఏట 1895లో మరణించే దాకా నిరంతరం రచన కొనసాగించిన ఎంగెల్స్ స్వతంత్రంగానూ, మార్క్స్‌తో సంయుక్తంగానూ వేలాది పేజీలు రాశాడు. అనేక పత్రికలకూ, పుస్తకాలకూ సంపాదకత్వం వహించాడు. మార్క్స్‌ను ఇంకా కలుసుకోక ముందే 1842లో జర్మన్ బుద్ధిజీవుల మీద రాసిన ఒక దీర్ఘకవితలో మార్క్స్ గురించి ప్రస్తావన చేశాడు. మార్క్స్‌ను కలవకముందే స్వతంత్రంగా రాజకీయార్థ శాస్త్ర అధ్యయనం చేశాడు, రాజకీయార్థ శాస్త్ర వ్యాసాలు రాశాడు. ఎంగెల్స్ రాసిన తొలి రాజకీయార్థ శాస్త్ర వ్యాసాలు మార్క్స్ సంపాదకుడుగా ఉండిన రైనిషె సైటుంగ్ పత్రికలోనే ప్రచురిత మయ్యాయి. ఆ తర్వాత ఇద్దరూ కలుసుకున్నాక మార్క్స్ మరణించే వరకూ నలభై సంవత్సరాల పాటు అన్యోన్య, అవిభాజ్య మైత్రి కొనసాగింది. వారు కలుసుకున్న తొలిరోజుల్లోనే ఇద్దరూ కలిసి ది హోలీ ఫామిలీ రాశారు. ఆ తర్వాత ది జర్మన్ ఐడియాలజీ రాశారు, ది మానిఫెస్టో ఆఫ్ ది కమ్యూనిస్ట్ పార్టీ రాశారు. ఈ క్రమంలోనే ఎంగెల్స్ ది కండిషన్ ఆఫ్ వర్కింగ్ క్లాస్ ఇన్ ఇంగ్లండ్, ప్రిన్సిపుల్స్ ఆఫ్ కమ్యూనిజం, ది పెజంట్ వార్ ఇన్ జర్మనీ, యాంటీ డ్యూరింగ్, సోషలిజం : ఉటోపియన్ అండ్ సైంటిఫిక్, డయలెక్టిక్స్ ఆఫ్ నేచర్, ది ఆరిజిన్ ఆఫ్ ది ఫామిలీ, ప్రైవేట్ ప్రాపర్టీ అండ్ ది స్టేట్ వంటి పుస్తకాలు, పదుల సంఖ్యలో వ్యాసాలు రాశాడు. ఈ రచనలన్నీ అలా ఉంచి, కవిత్వం, వ్యాసరచన, బహుభాషా పరిచయం, సంగీతం నుంచి ఆయుధ శాస్త్రం దాకా, ఆధునిక విజ్ఞాన శాస్త్రం నుంచి రాజకీయార్థిక శాస్త్రం దాకా ఎన్నో శాస్త్రాలలో ఆసక్తీ అధ్యయనమూ ప్రావీణ్యమూ సంపాదించాడు.

ఇంతటి బహుముఖ ప్రజ్ఞాశాలి అయినప్పటికీ ఆయనను మార్క్స్ నీడలో, మార్క్స్‌తో పాటుగానే తప్ప విడిగా పరిశీలించడం జరగలేదు. అందువల్ల అసలు ఎంగెల్స్ స్వీయ ప్రతిభను విస్మరించేంతగా మార్క్స్ ఎంగెల్స్‌ల మధ్య భేదం చూడని ధోరణి ఒకటి వారి జీవిత కాలం నుంచే కొనసాగుతున్నది. తామిద్దరినీ కలిపి ఏకవచనంలో సంబోధిస్తున్నారని స్వయంగా మార్క్సే గుర్తించి రాశాడు. మరొక ధోరణి అసలు మార్క్స్ మానవతావాది అని, ఆయన చెప్పిన మానవతావాదాన్ని భ్రష్టు పట్టించి, దాన్ని మొరటైన సిద్ధాంత చట్రంగా మార్చడం ఎంగెల్స్ చేసిన పని అని వాదిస్తున్నది. అలాగే మూడో ధోరణి ఎంగెల్స్ కృషిని గౌరవిస్తూనే ఆయన మార్క్స్‌ను అరకొరగా, తప్పుగా అర్థం చేసుకొని తాను అర్థం చేసుకొన్న పద్ధతిలోనే మార్క్స్‌ను ప్రపంచానికి పరిచయం చేశాడని వాదిస్తుంది. ఈ మూడు అపసవ్యమైన ధోరణులకు భిన్నంగా మార్క్స్‌నూ, ఎంగెల్స్‌నూ కూడ విమర్శనాత్మకంగా చూడవలసి ఉన్నది. వారి స్థల కాల పరిమితులను గుర్తిస్తూ, మార్క్స్‌కూ మార్క్సిజానికీ అంతర్జాతీయ శ్రామికవర్గ ఉద్యమానికీ ఎంగెల్స్ చేసిన దోహదాన్ని గుర్తించవల్సి ఉన్నది. మార్క్స్‌తో సమానమైన బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన ఎంగెల్స్‌ను ఈ ద్విశత జయంతి సందర్భంగా మార్క్స్‌తో కలిపీ, విడిగానూ పరిశీలించవలసి ఉన్నది.

ఎంగెల్స్ రాజకీయార్థ శాస్త్రంలో సాగించిన కృషిని వివరించడానికి మాత్రమే ఈ వ్యాసం పరిమితమవుతుంది.

ఆశ్చర్యకరంగా ఎంగెల్స్ రాజకీయార్థిక రచనలు ఇంత వరకూ ఎవరూ సంకలనం చేయలేదు. ఆయన మార్క్స్ కాపిటల్ మీద రాసిన రచనల్లో కొన్ని ఎంపిక చేసిన రచనల 120 పేజీల సంకలనం మాత్రమే ఇప్పటికి లభ్యమవుతున్నది. నిజానికి ఆ సంకలనంలో కూడ ఆయన కాపిటల్ మీద రాసిన రచనలన్నీ చేరలేదు. కాపిటల్ మొదటి సంపుటం వెలువడగానే ఆయన తొమ్మిది సమీక్షలు రాశాడని తెలుస్తున్నది. అలాగే కాపిటల్ వేరు వేరు కూర్పులకూ, అనువాదాలకూ ఆయన రాసిన ముందు మాటలు, చేర్చిన అనుబంధాలు, వివరణలు, మార్క్స్ మరణానంతరం కాపిటల్ రెండు సంపుటాలు ముద్రణకు సిద్ధం చేయడంలో ఆయన కృషి వేరువేరు పుస్తకాల్లో మిగిలిపోయింది గాని ఒక్కచోట సంకలనం కాలేదు.

గడిచిన నూట ఇరవై ఏళ్లలో, మరీ ముఖ్యంగా గత యాభై ఏళ్లలో ఎంగెల్స్ - రాజకీయార్థ శాస్త్రం, ఎంగెల్స్ - మార్క్స్ కాపిటల్ అని వ్యాసాలూ పుస్తకాలూ రాసినవాళ్లు కూడ ఎంగెల్స్‌ను విమర్శించడానికి లేదా విమర్శలకు జవాబులు చెప్పడానికి, సమర్థించడానికి పరిమితమయ్యారు గాని ఎంగెల్స్ రాజకీయార్థిక శాస్త్ర రచనల మీద విడిగా, వివరంగా, విశ్లేషణాత్మకంగా రాయలేదు.

రాజకీయార్థిక శాస్త్రం మీద ఎంగెల్స్ చేసిన కృషి అంతా ఒక్క చోటికి కూడ రాని ఈ నేపథ్యంలో ఈ అంశాన్ని చర్చించడం సమస్యాత్మకమే. అయినా భవిష్యత్తులో అటువంటి ప్రయత్నానికి దోహదం చేయడం కోసమైనా సూచనలు చేయవలసి ఉన్నది.

ఎంగెల్స్ రాజకీయార్థ శాస్త్ర కృషిలో మూడు దశలున్నాయి. రాజకీయార్థశాస్త్ర అధ్యయనంలోకి మార్క్స్ ప్రవేశించడానికన్న ముందే 1843లోనే ఎంగెల్స్ ఆ అధ్యయనం, రచన ప్రారంభించాడు. అప్పటి నుంచి మార్క్స్‌తో స్నేహం కుదిరిన తర్వాత, మార్క్స్ కూడ రాజకీయార్థ శాస్త్ర అధ్యయనం చేస్తున్న క్రమంలో, 1859లో రాజకీయార్థ శాస్త్రం పైన మార్క్స్ రాసిన మొదటి పుస్తకం ఎ కాంట్రిబ్యూషన్ టు ది క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీ వరకూ ఎంగెల్స్ కూడ రాజకీయార్థ శాస్త్రం మీద రచనలు చేస్తూనే ఉన్నాడు. అలా 1843-59 మొదటి దశ. ఆ తర్వాత మార్క్స్ కాపిటల్ రచనలో మునిగిపోగా ఆ రచన సాగినన్ని రోజులూ ఉత్తరాల్లో, సంభాషణల్లో భాగం పంచుకుంటూ, రాజకీయార్థ శాస్త్ర అభివృద్ధికి దోహదం చేసిన రెండో దశ 1859-83. మార్క్స్ 1883లో మరణించే నాటికి కాపిటల్ మొదటి సంపుటం మాత్రమే వెలువడి, దానికి ఫ్రెంచి, ఇంగ్లిష్ అనువాదాలు కూడ వెలువడి ఉన్నాయి, రెండో సంపుటం దాదాపుగా పూర్తయి ఉంది. మిగిలిన రచన అంతా మార్క్స్ చేతి రాతలో, అసంపూర్ణంగా ఉండిపోయింది. ఎంగెల్స్ పూనుకుని రెండో సంపుటాన్ని ఏడాది లోపలనే అచ్చుకు సిద్ధం చేసి, వెలువరించాడు. మూడో సంపుటం మరొక ఏడాదిలో అవుతుందనుకున్నాడు గాని అది ఆ తర్వాత పది సంవత్సరాలు తీసుకుంది. ఈ క్రమమంతా గజిబిజిగా, తనకు తప్ప మరెవరికీ అర్థం కాకుండా ఉండే మార్క్స్ చేతి రాతను అర్థం చేసుకుంటూ, మార్క్స్ రచనాశైలిని అనుసరిస్తూ, అచ్చు ప్రతి సిద్ధం చేస్తూ ఎంగెల్స్ సాగించిన కృషి అపారమైనది. ఈ రెండు సంపుటాలకూ ఎంగెల్స్ వివరమైన ముందు మాటలు కూడ రాశాడు.

అంటే మొత్తం మీద దాదాపు ఇరవై స్వతంత్ర వ్యాసాలు, కాపిటల్‌కు సంబంధించి దాదాపు పదిహేను రచనలు, ఆంటీ




డూరింగ్, కండిషన్ ఆఫ్ వర్కింగ్ క్లాస్ ఇన్ ఇంగ్లండ్ వంటి ప్రధానమైన రాజకీయార్థ శాస్త్ర రచనలు, ప్రస్తావనవశాత్తూ రాజకీయార్థ శాస్త్రం గురించి రాసినవీ, మొత్తంగా రాజకీయార్థ శాస్త్ర సంవిధానాన్ని ఉపయోగించినవీ ఎంగెల్స్ రచనలు ఆరేడు వందల పేజీలు ఉండవచ్చు.

రైనిషె సైటుంగ్ సంపాదకుడిగా మార్క్స్ 1843లోనే ఎంగెల్స్ రాసిన రాజకీయార్థ శాస్త్ర వ్యాసాలు ప్రచురించాడు. ఆ తర్వాత 1844లో మార్క్స్ సంపాదకుడుగా పారిస్ నుంచి ప్రారంభమైన 'డాయిష్ - ఫ్రాన్సోసిష్ యార్ బ్యూషర్' మొదటి సంచికలోనే ఎంగెల్స్ వ్యాసం ఔట్ లైన్స్ ఆఫ్ ఎ క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీ అచ్చయింది. ఆ వ్యాసాన్ని మార్క్స్ అచ్చుకు ముందే చదివాడనీ, దాని మీద వివరమైన నోట్స్ రాసి పెట్టుకున్నాడనీ, చివరికి పదిహేను సంవత్సరాల తర్వాత, 1859లో "ఆర్థిక ప్రత్యయాల మీద విమర్శగా అద్భుతమైన వ్యాసం" అని అభివర్ణించాడనీ ఆధారాలున్నాయి. కాపిటల్ మొదటి సంపుటంలో ఈ వ్యాసాన్ని కనీసం ఐదు చోట్ల ఉటంకించాడు. స్వయంగా ఎంగెల్స్ 1871లో ఈ వ్యాసం గురించి "కాలం చెల్లినది" అనీ, "హెగెల్ పదాడంబరంతో రాసినది, ఇప్పుడు కేవలం చరిత్ర సమాచారంగా మాత్రమే చూడవలసింది" అనీ రాశాడు గాని మార్క్స్ తదనంతర రచనల మీద ఈ వ్యాసం ప్రభావాన్ని విశ్లేషకులు గుర్తించారు.

ముఖ్యంగా మార్క్స్ ఆ తర్వాత అభివృద్ధి చేసిన మూడు భావనలు - మతానికీ ఆర్థిక వ్యవస్థకూ ఉండే సంబంధం, ఉపయోగపు విలువకూ మారకపు విలువకూ మధ్య వైరుధ్యం, శ్రమకూ కౌలుకూ మధ్య సంబంధం - తొలుత ఈ ఎంగెల్స్ వ్యాసంలోనే ఉన్నాయి.

అలాగే మార్క్స్, ఎంగెల్స్ ఇద్దరూ కలిసి రాసిన కమ్యూనిస్టు పార్టీ ప్రణాళికకు ఆరు నెలల ముందే ఎంగెల్స్ ప్రశ్న జవాబులు రూపంలో రాసిన ప్రిన్సిపుల్స్ ఆఫ్ కమ్యూనిజంలో అనేక రాజకీయార్థ శాస్త్ర అంశాలున్నాయి. కమ్యూనిజం నిర్వచనం, కార్మిక వర్గ విముక్తికి అవసరమైన పరిస్థితులు, శ్రమ అమ్మకపు పరిస్థితులు, బానిసకూ, అర్ధబానిసకూ, చేతివృత్తులవారికీ, కార్ఖానా శ్రామికుడికీ, పారిశ్రామిక కార్మికుడికీ మధ్య తేడాలు వంటి అనేక విషయాలలో మార్క్సిస్టు రాజకీయార్థ శాస్త్ర మౌలిక అవగాహనలు ఈ ఎంగెల్స్ రచనలో కనబడతాయి.

☞ మిగతా 43వ పేజీలో



ఎంగెల్స్ విశిష్ట రచన

# ఇంగ్లండులో కార్మికవర్గ స్థితిగతులు




రావు కృష్ణారావు

'The condition of the Working Class in England' అనే గొప్ప రచనను తెలుగులోకి అనువదించే అవకాశాన్ని రంగనాయకమ్మ గారు నాకు కల్పించారు. నా అనువాదానికి కొన్ని మార్పులు, చేర్పులతో ఆ పుస్తకాన్ని 2010లో ప్రచురించారు. విద్యావంతులు ఆ పుస్తకాన్ని ఆదరించినా, కార్మిక నాయకులు స్పందించలేదు. వందల సంవత్సరాలు కార్మికులు దుర్భర పరిస్థితుల్లో జీవిస్తూ హక్కుల కోసం చేసిన పోరాటం గురించి తెలియకపోతే నేటి కార్మికులకు సంక్రమించిన హక్కుల విలువ తెలియదు. ప్రస్తుతం కార్మికవర్గం క్రమంగా తన హక్కులను కోల్పోతున్నది. కార్మికులకు అర్థం కాదనుకోవడానికి అది సిద్ధాంత గ్రంథం కాదు. అలాగని విసుగెత్తించే పుస్తకం కాదు. మార్క్సును బాగా ప్రభావితం చేసిన కార్మిక జీవిత మహా కథనమది.




ధనిక కుటుంబానికి చెందిన 24 ఏళ్ళ యువకుడు స్నేహితులందరిలా క్లబ్బులో తాగుతూ అందమైన అమ్మాయిలతో కబుర్లతో కాలక్షేపం చేయకుండా కష్టజీవుల పట్ల అంతులేని ప్రేమతో మురికివాడలన్నీ స్వయంగా తిరిగి అనేక నివేదికలు పరిశీలించి రాసిన గ్రంధమిది.

మచ్చుకి ఆ పుస్తకంలోని కొన్ని వాక్యాలు చూస్తే ఆ పుస్తకం విలువ తెలుస్తుంది.

"లండను నగర మురికివాడలను సందర్శించిన తర్వాత, ఈ లండను నగరవాసులు తమ నగరాన్ని ముంచెత్తిన నాగరిక అత్యద్భుతాలన్నిటినీ సాధించడానికి తమ మానవ స్వభావంలోని అత్యుత్తమ గుణాలను బలవంతంగా త్యాగం చెయ్యవలసి వచ్చిందని ఎవ్వరికైనా అర్థమైపోతుంది." -పే 26

"అతని శరీరం, ఆత్మలను కలిపి ఉంచడానికి చాలీ చాలని వేతనం... పని దొరకనప్పుడు, పోలీసులంటే భయం లేకపోతే దొంగతనం చేయవచ్చు. లేదా ఆకలితో చనిపోతే ప్రశాంతంగా, దౌర్జన్య రహితంగా ప్రవర్తించాడని పోలీసులు భావిస్తారు"-పే27.

"ప్రత్యక్షంగా ఆకలితో చచ్చిపోయిన వారికంటే చాల ఎక్కువ మంది దాని వల్లనే పరోక్షంగా చచ్చిపోతున్నారు. సుదీర్ఘ కాలం పోషకాహార లోపం వల్ల మృత్యుకారక రోగగ్రస్తులౌతున్నారు. ఇంగ్లీషు కార్మికులు దీన్ని 'సమాజం చేసిన హత్య' అంటారు. ఈ నేరం నిరంతరం చేస్తున్నందుకు మొత్తం సమాజాన్ని నిందిస్తారు. వాళ్ళు అలా అనడం తప్పా?"- పే27.

" ....బీదరికం ధనిక ప్రాంతాలకు చేరువలోనే నివసిస్తుందనే మాట నిజమే కాని, బయటకు కనిపించని ఇరుకు సందులలో, ఆనందమయ వర్గాల చూపుకందనంత దూరంలో ప్రత్యేక ప్రాంతాన్ని బీదరికానికి కేటాయిస్తారు." - పే28.

కార్మికులు నివశించే మురికి వాడలు, వాటిలోని ఇళ్ళ గురించి ఎంగెల్స్ రాసింది చదవాలే గాని ఇక్కడ వివరించలేము. సుదీర్ఘంగా వర్ణించాడాయన. మచ్చుకి ఒక మురికివాడలో అధికారిక లెక్కల ప్రకారం "1840లో 805366 కార్మిక కుటుంబాలు 5294 ఆవాసాల్లో (వాటికా పేరు తగినదైతే) నివసిస్తున్నారు. ఈ కుటుంబాల్లో నాలుగింట మూడొంతుల కుటుంబాలు ఒక్కొక్క గదిలోనే ఉంటున్నాయి." -పే30. (మరుగుదొడ్డి గుంత కూడా ఆ గదిలోనే)

"ఈ దురదృష్టవంతుల బీదరికాన్ని, ఆస్తి పర వర్గాలు చట్టబద్ధ మార్గాల్లో, ఎలా దోచుకోగలుగుతున్నాయి? చివరకు దొంగలకు కూడా వీళ్ళ దగ్గరేమీ దొరకదే!" - పే30.

"రాత్రికి ఎక్కడ తలదాచుకోవాలో తెలియని ఏభై వేల మంది లండనులో ప్రతి ఉదయం నిద్ర లేస్తారు"- పే32.

గడ్డకట్టించే చలిలో రాత్రంతా పార్కులో కిక్కిరిసి నిద్రించే స్త్రీ పురుషుల గురించి లండన్ టైమ్స్ పత్రికలో ఒక బిషప్ రాసిందాన్ని ఎంగెల్స్ సుదీర్ఘంగా ఉటంకిస్తాడు. అందులో కొన్ని వాక్యాలు " కనిపించని బీదరికపు గాయాలను చూసి సంపద, దాని ప్రకాశవంతమైన పానశాలల నుంచి నిర్లక్ష్య పూరితంగా,

అవమానకరంగా నవ్వుతోంది. ఆనందం క్రూరంగా, అధోగతిలో మౌనంగా రోధిస్తున్న బాధను ఎగతాళి చేస్తోంది."– పే33.

"వేలకొద్దీ శ్రామికులు లండన్ ధనికులకంటే అనేక విధాల యోగ్యులూ, గౌరవనీయులైన ప్రజలు మానవ యోగ్యం కాని పరిస్థితుల్లో జీవిస్తున్నారని మాత్రం చెప్పగలను. వారి తప్పేమీ లేకపోయినా, ఎన్ని విధాల బయట పడదామని ప్రయత్నించినా, అదే రకమైన దుస్థితికి గురవుతున్నారు." –పే32. ఎంగెల్స్ శ్రామిక జన పక్షపాతం తెలుసుకోవడానికి ఈ రెండు వాక్యాలు చాలు.

"ఒక మగ మనిషీ, అతని భార్య, కోడలు ఒకే పక్క మీద పడుకోవడం చూసినట్లు 'శ్రామిక వర్గ పారిశుద్ధ్య పరిస్థితి గురించిన నివేదిక' తెలియచేసింది. ఇటువంటి సంఘటన వారికి మాంచెస్టరులో ఆరు చోట్ల తటస్థించిందట." –పే 56.

కార్మికుల దుస్తుల గురించి, ఆహారం గురించి వివరంగా చెబుతాడు ఎంగెల్స్. ఆయా వివరాలను చదివి తెలుసుకోవాల్సిందే గాని ఇక్కడ చెప్పలేం. వారి పరిస్థితి గురించి చెబుతూ ఎంగెల్స్ "సమాజం తన సభ్యులను వారు ఎంతో అవసరంలో ఉన్నప్పుడు, ఎంత పాశవికంగా ఎలా వదిలి పెట్టేసిందో వెలుగులోకి వస్తుంది." అని రాశాడు. పే62.

ఈ పుస్తకంలో పిల్లల గురించి చెప్పిన విషయాలు మనసున్న మనిషి కంటనీరు తెప్పించక మానవు. "యంత్రాలు వచ్చాక స్త్రీలు, పిల్లలను పనిలో పెట్టుకునే వీలు కలగడం వల్ల, అత్యధిక లాభాలు గడించే అవకాశం బూర్జువా వర్గానికి కలిగింది."– పే64.

అంత చిన్న వయసులో, మార్క్సిజం స్పష్టంగా రూపు దాల్చక ముందే పెట్టుబడిదారీ వ్యవస్థ పనితీరు, కార్మిక వర్గం, శ్రమ దోపిడీల గురించి ఎంగెల్స్‌కున్న అవగాహన అబ్బుర పరుస్తుంది.

కృత్రిమ నైతిక ప్రమాణాలతో తూకమేసి ఐరిష్ కార్మికుల తాగుడు వ్యసనాన్ని మహానేరంగా, నీచకృత్యంగా చిత్రీకరిస్తూ 'ఐరిష్' అంటేనే నీచుడు అనే అర్థంలో నిందించే బూర్జువా మేధావుల వైఖరికి భిన్నంగా ఎంగెల్స్ ఎంత గొప్పగా రాశాడో చూడండి.

"ఈ దౌర్భాగ్యునికి ఒక్క ఆనందమైనా వుండాలి కాబట్టి, సమాజం అతన్ని మిగతా అన్నిటి నుంచీ దూరం చేసింది కాబట్టి, అతను తాగుడుకి అలవాటు పడతాడు. ఐరిష్ వాడి జీవితాన్ని, ఏ మాత్రమైనా జీవించదగినదిగా చేసేది తాగుడు ఒక్కటే! ...తాగుబోతుగా మారడం అతనికి అవసరమయ్యే స్థితిలో అతన్ని ఉంచిన సమాజం, అతని పాపానికతన్ని వదిలేసిన సమాజం, అతన్ని అనాగరికునిగా వదిలేసిన సమాజం, అతన్నెలా నిందించ గలదు?"– పే73. అని ప్రశ్నించిన ఎంగెల్స్ మానవతా దృష్టికి జోహార్లు చెప్పాల్సిందే.




"మానవునికి తొలి వరాలైన సమాజం, స్థిరత్వం, శాంతియుత జీవనం అనేవి కార్మికులకు చెందవు"– పే87.

ఎంగెల్స్ వివరించిన బాల కార్మికులు, స్త్రీ కార్మికుల స్థితి హృదయ విదారకంగా వుంటుంది. 9వ ఏడు నుండీ పిల్లలను ఫ్యాక్టరీ పనులకు తీసుకునేవారు. 13వ ఏడు వచ్చే వరకు వారు రోజుకి ఆరున్నర గంటలు పని చేయాలి. (అంతకుముందు ఈ పని గంటలు 8,12,14 చివరకు 16 గంటలు కూడా ఉండేవి.) 13 నుండి 18వ ఏడు వచ్చేవరకు రోజుకి 12 గంటలు పని చేయాలి.

బాల్యంలోనే వీరి వెన్నెముక సాధారణంగా ముందుకు గాని, కొంత మందికి పక్కకు గాని వంగిపోయేది. వీరి కాళ్ళు మోకీలు దగ్గర సాధారణంగా వెనుకకు కాని, కొన్ని సందర్భాలలో ముందుకు గాని వంగిపోయేవి. వీరు నివశించేది మురికి కూపాల్లో. పనిచేసే ఫ్యాక్టరీ వాతావరణం అంత కంటే దారుణంగా వుండేది. ఎంగెల్స్ వీరిని సన్నిహితంగా పరిశీలించాడు. కొంత మందితో పరిచయాలు కూడా చేసుకున్నాడు. పే112.

కోవెల్ అనే ఆదివారపు బడి నిర్వాహకుని నుండి ఎంగెల్స్ సేకరించిన సమాచారం ప్రకారం 17 సంవత్సరాల వయసున్న 26 మంది యువ కార్మికుల సగటు బరువు 47.5 కిలోలు.–పే113.

ఫ్యాక్టరీ కార్మికుల్లో అత్యధికులు 40 ఏళ్ళకే పని చేయలేని స్థితికి చేరుకుని మూలపడేవారు. అతి కొద్దిమంది 45వ ఏడు వరకూ పనిచేసేవారు. 50 సంవత్సరాల వయసున్న కార్మికుడు ఒక్కడూ లేడు. పే 113.

పని వల్ల కలిగే శారీరక, అంగ వికృతులు బాలికలు, స్త్రీలలో మరీ ఎక్కువ. స్త్రీలు ప్రసవ సమయం వరకు పనికి హాజరయ్యేవారు. ప్రసవాలలో సగం పగలు పనికి వెళ్ళి రాత్రి జరిగినవే! పే114

(పేజీ నెంబర్లు తెలుగు అనువాదానికి చెందినవి.)

ఇలా చెప్పుకుంటూ పోతే ఈ పుస్తకం నుండి వందల వాక్యాలు ఉదహరించవచ్చు. ఒక పక్క చరిత్రను కళ్ళకు కడుతూ విషాదాన్ని కలిగించే ఈ పుస్తకం, నేటికీ పూర్తికాని కర్తవ్యాన్ని మనకు గుర్తు చేస్తుంది.

తండ్రి బలవంతం పై 17వ ఏటనే చదువుకు స్వస్తి చెప్పి, వ్యాపారంలో ప్రవేశించిన ఎంగెల్స్ పగలు వ్యాపారవేత్తగా రాత్రి రాడికల్‌గా తన జీవితాన్ని ఆరంభించాడు. అతను ఫ్రెడ్రిక్ ఓస్వాల్




అనే మారుపేరుతో రచనలు సాగించాడు. తన స్వస్థలమైన రైన్లాండ్ లో కార్మికుల పరిస్థితుల గురించి 1839 లో రాసిన 'వుప్పెర్టల్ నుండి ఉత్తరాలు' ప్రసిద్ది చెందాయి. అతని కార్యకలాపాలు ఎంత మాత్రం నచ్చని తండ్రి, రాడికల్ మిత్రుల నుండి దూరంగా ఉంచాలనే ఉద్దేశ్యంతో అక్టోబరు 1842లో వ్యాపార పనుల మీద ఎంగెల్స్‌ను ఇంగ్లండ్ పంపాడు. ప్రపంచ పారిశ్రామిక ఉత్పత్తికి కేంద్రంగా వున్న ఇంగ్లండ్‌లోని పరిస్థితులను స్వయంగా పరిశీలించాలనే కోరికతో ఎంగెల్స్ అంగీకరించాడు. ఇంగ్లండ్ వచ్చిన తర్వాత కూడా వివిధ పత్రికలకు ఒక రాడికల్ జర్నలిస్టుగా అనేక రచనలు చేశాడు. 1844 లో ఎంగెల్స్ తాను రచించిన 'Outlines of a Critique of political Economy' అనే వ్యాసాన్ని పారిస్ నుండి ప్రచురితమయ్యే వార్షిక సంచికకు పంపాడు. అప్పుడు ఆ పత్రిక సహ సంపాదకునిగా మార్క్స్ పారిస్‌లో ఉన్నాడు. ఆ వ్యాసం పట్ల మార్క్స్ విశేష శ్రద్ధ చూపాడు. 'Brilliant sketch on the criticism of economic categories' అని మెచ్చుకున్నాడు. మార్క్స్ రాజకీయార్థశాస్త్రం వైపు మళ్ళడానికి ఆ వ్యాసం కారణమంటారు. చరిత్రలో కనీవినీ ఎరుగని రీతిలో ఇద్దరు మహనీయుల జీవితకాలపు మైత్రికి బీజం పడింది ఆ కాలంలోనే!

1842 నుండి 1844 వరకూ తాను స్వయంగా చూసిన విషయాలు, వందలాది విశ్వసనీయ నివేదికల ఆధారంగా ఎంగెల్సు 'ఇంగ్లండులో కార్మికవర్గ స్థితిగతులు' పుస్తకాన్ని తన మాతృభాష జర్మనులో రాశాడు. ఈ పుస్తకాన్ని ఇంగ్లండ్ కార్మిక వర్గానికి అంకితమిస్తూ ముందు మాట ఇంగ్లీషులో రాశాడు. అప్పటికే ఆయనకు చాల భాషలు తెలుసు. ఇది 1845లో ప్రచురితమయ్యింది. ఆ రోజుల్లో ఇది తీవ్ర ప్రభావం చూపింది. జర్మను కార్మిక వర్గానికి, రష్యాతో సహా మొత్తం యూరపు బూర్జువా వర్గానికి ఎంగెల్స్ సందేశం అందింది. ఆ పుస్తకం బూర్జువా వర్గాన్ని దోషిగా నిలిపింది. కినుక వహించిన బూర్జువా పండితులు ఎంగెల్స్ అబద్ధాలు రాశాడని, గ్రంథ చౌర్యానికి పాల్పడ్డాడని పలు ఆరోపణలు చేశారు. తరువాత జరిగిన పలు పరిశోధనల వల్ల వారి ఆరోపణలు దురుద్దేశపూరితమని తేలిపోయింది.వేళ్ళపై లెక్కించగల చిన్న చిన్న పొరపాట్లు ఉన్న మాట నిజమే. అవి అంత ప్రధానమైనవి కాదు, ఉదా. నివేదికలో యువకుల వయసు 17 అని వుంటే ఎంగెల్స్ 16 అని రాశాడు. ఇటువంటివే!

ప్రఖ్యాత బ్రిటీషు మార్క్సిష్టు చరిత్రకారుడు ఎరిక్ హాబ్స్ బాం తన పుస్తకం 'Labouring Men' లో ఎంగెల్స్‌ను గట్టిగా సమర్థించాడు. నిజాయితీ గల మార్క్సిస్టేతర చరిత్రకారులు కూడా ఎంగెల్స్ విశ్లేషణ, నిర్ధారణలతో విభేదించినా, ఆ పుస్తకంలో ఇచ్చిన సమాచారం విశ్వసనీయమైనదేనని అంగీకరిస్తూ విద్యార్థులకు సిఫార్సు చేస్తున్నారు.

'పారిశ్రామిక సమాజం, దాని పరిస్థితుల గురించి ఇప్పటి వరకూ రాసిన వాటిలో కెల్లా అత్యుత్తమ ఆక్షేపణ' అని International Encyclopedia of the social sciences, New York (1968) కొనియాడింది. సామాజిక పరిశోధనలో ఈ గ్రంథం ఒక క్లాసిక్ అని పలువురు కీర్తించారు.

'ఈ పుస్తకంలో నేను ఇంగ్లీషు బూర్జువా వర్గం ప్రజలపై హత్య, లూటీ, అన్ని రకాల ఇతర నేరాలు చేసిందని మొత్తం ప్రపంచం ముందు దోషిగా నిలబెడుతున్నాను' అంటూ ఎంగెల్స్ మార్క్సుకి ఉత్తరం రాశాడు.

"నా పుస్తకంలో ఇంగ్లీషు సమాజం గురించిన భయంకర కథనాలను నమోదు చేయకపోయి ఉంటే నేను కొంత బాధపడి ఉండే వాడిని. కాని అలా నమోదు చేసినందువల్ల ఇంకా నా రక్తం తీవ్ర ఆగ్రహంతో మరిగిపోతున్నది" అని మార్క్సుకి రాశాడు.

ఈ పుస్తకం వెలువడిన సుమారు 20 సంవత్సరాల తర్వాత మార్క్స్ 'నేను సేకరించిన సమాచారంతో రాసుకున్న నోట్సును నీ పుస్తకంతో సరిచూసుకుంటున్నాను' అని రాశాడు. ఎంగెల్స్ ఈ పుస్తకంలో పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానాన్ని సరిగా అర్థం చేసుకున్నాడని మార్క్స్ కేపిటల్‌లో రాశాడు.

ఈ గ్రంథం కేవలం చరిత్రను నమోదు చేసింది మాత్రమే కాదు. మార్క్సిజం రూపొందే క్రమంలో ఒక ముందడుగు. అయితే ఎంగెల్సే స్వయంగా చెప్పినట్లు ఇందులో ఉన్నది అపరిపక్వ మార్క్సిజం. అంతకంటే 'బీజప్రాయ మార్క్సిజం' అంటే బాగుంటుంది. కొన్ని జోస్యాలు తప్పాయని, కొన్ని పరిశీలనలు తప్పని తేలాయని, అయితే చాల విషయాలు నిజమని రుజువయ్యాయని ఎంగెల్సే స్వయంగా 1892లో చెప్పాడు. కాని భవిష్యత్ మార్క్సిష్టు సిద్ధాంత బీజాలు ఈ పుస్తకంలో చాల వున్నాయి. ఉదాహరణకు పోటీ వల్ల పారిశ్రామిక రిజర్వు సైన్యం ఏర్పడటం, యాంత్రీకరణ జరిగే కొలదీ దోపిడీ తీవ్రత పెరగడం, పరాయీకరణ, వర్గ పోరాటం మొ.

"1845 కి ముందు గాని ఆ తర్వాత గాని, ఇంతగా సత్యవంతమైన, ఆసక్తిదాయకమైన శ్రామిక వర్గ దైన్య చిత్రం వెలువడలేదు". -లెనిన్.

"మొత్తంమీద ఎంగెల్స్ ఇచ్చిన వివరాలు బహుశా మనకు లభించిన ఆ కాలపు అత్యుత్తమ సాక్ష్యాలు" - డెవిడ్ మెక్ లల్లన్.

☞ మిగతా 29వ పేజీలో




ఎంగెల్స్ రాసిన చారిత్రిక భౌతికవాదపు ఆది గ్రంథం

# జర్మనీలో రైతు యుద్ధం

డి వి వి యస్ వర్మ



ఎంగెల్స్ జర్మనీ లో రైతు యుద్ధం పుస్తకాన్ని 1850 లో రాశాడు. విప్లవోద్యమంలో పనిచేసేవారు, అలాంటి ఉద్యమాల పట్ల ఆసక్తి గల ప్రతి ఒక్కరూ చదివి తీరాల్సిన పుస్తకం ఇది. నిజానికి మార్క్స్ - ఎంగెల్స్ రచనలన్నీ చదివి తీరాల్సినవే. వీటిలో కొన్ని గొప్పవీ మరికొన్ని తక్కువ గొప్పవీ అన్న తేడా లేదు. ప్రతి రచనా విశిష్టమైనదే. దేని ప్రత్యేకత దానిదే. అవి మనకు ఒక కొత్త ప్రపంచ దృక్పథాన్ని, చరిత్ర అధ్యయనానికి భౌతిక దృష్టిని కలిగిస్తాయి. ఆర్థిక, సామాజిక విశ్లేషణకు, కార్యాచరణకు సాధన సంపత్తిని సమకూరుస్తాయి. ఎంగెల్స్ రాసిన "జర్మనీలో రైతు యుద్ధం" పుస్తకంలోని కొన్ని ప్రత్యేకతలను రేఖామాత్రంగా పరిశీలించుకుందాం

### ఎందుకు రాశాడు ?

జర్మనీలో 1848-49 లో విప్లవం జరిగింది. ఇది తన కళ్ళ ముందు జరిగింది. దీనిలో ఆయన పాత్రధారి కూడా. అంతకు ముందు 300 సంవత్సరాల కిందట జర్మనీలో రైతు యుద్ధం పేరుతో విప్లవం జరిగింది. ఈ రెంటికీ మధ్య చాలా పోలికలు, కొన్ని భేదాలు కనిపించాయి. ఈ విషయాన్ని ఎంగెల్స్ తన ముందుమాటలో వెల్లడిస్తూనే "జర్మన్ ప్రజలకు కూడా తన విప్లవ సంప్రదాయం వుంది. ఇతర దేశాల విప్లవాలలోని అత్యుత్తమ వ్యక్తులతో సరితూగగల వ్యక్తులను జర్మనీ సృష్టించిన కాలం ఒకటి వుంది. దానిని జర్మన్ ప్రజలకు అందించాల్సిన అవసరం వుంది" అని కూడా రాశాడు.




జర్మనీలో రైతు యుద్ధం జరిగి అప్పటికే 300 సంవత్సరాలు గడిచాయి. జర్మనీలో పరిస్థితులు మారాయి. కానీ మనం పోరాడవలసిన శత్రువులు ఆనాటి శత్రువులేనని ,అలాగే 1848-49 లో విప్లవానికి ద్రోహం చేసిన వర్గాలు 1525 నాటికే ద్రోహుల రూపంలో కనబడతారనీ అన్నాడు. అది తొలి విప్లవం, ఇది మలి విప్లవం అంటూ వీటి నుండి తగిన గుణపాఠాలను తీసుకుని భవిష్యత్ విప్లవ విజయానికి బాటలు వేయాలన్న సంకల్పంతో ఆయన ఈ రచన చేశాడు.

### చారిత్రిక భౌతిక వాదానికి ఆది గ్రంథం

1525లో జరిగిన రైతు యుద్ధానికి సంబంధించిన సమాచారాన్ని ప్రముఖ జర్మన్ చరిత్రకారుడు విల్ హెల్మ్ జిమ్మర్ మాన్ పుస్తకం నుండి స్వీకరించినట్లు ఎంగెల్స్ చెప్పుకున్నాడు.

జిమ్మర్ మాన్ రాసిన 'ది హిస్టరీ ఆఫ్ గ్రేట్ పెజంట్ వార్' పుస్తకం ఆనాటి ఆర్థిక సామాజిక అంశాలను అత్యంత వాస్తవికంగా వివరించిందనీ, భావవాద చరిత్రకారుల పుస్తకాలలో ఇది మినహాయింపు అని ఎంగెల్స్ కొనియాడాడు. ఈ పుస్తకం ఆనాటి చారిత్రిక వాస్తవాలను వెలుగులోకి తెచ్చింది కానీ ఆ సంఘర్షణ అంతర్గత సారాన్ని వెల్లడించలేక పోయింది. అలాంటి వర్గ దృష్టి 16 శతాబ్ది నాటికి అందుబాటులో లేకపోవడం కారణంగా ఎంగెల్స్ పేర్కొన్నాడు.

మార్క్స్ - ఎంగెల్స్‌లు 1848 నాటికే చరిత్రను గతి తార్కిక, చారిత్రిక భౌతిక వాద దృక్పథంతో పరిశీలించే పద్ధతిని ఆవిష్కరించారు. కమ్యూనిస్టు ప్రణాళికలో అది ప్రస్ఫుటం అయ్యింది. మార్క్స్ తన కాలంలో జరుగుతున్న ఘటనల విశ్లేషణకు ఈ పద్ధతిని వినియోగించాడు. ఫ్రాన్సులో అంతర్యుద్ధం, లూయీ బోనపార్ట్ బ్రూమేర్ 18 వ తేదీ పుస్తకాలు రాశాడు. ఎంగెల్స్ ఈ చారిత్రక భౌతికవాద పద్ధతిని 300 సంవత్సరాల పూర్వ చరిత్రను ఆవిష్కరించడానికి వినియోగించాడు.

ఈ పుస్తకం తొలి అధ్యాయంలో ఆనాటి జర్మనీలోని రాజకీయ, ఆర్థిక, సామాజిక పరిస్థితుల మీదా, పర్యవసానంగా రూపు దిద్దుకున్న వివిధ వర్గాలను, వారి సామాజిక స్థితినీ, వారి ఆకాంక్షలను ఎంగెల్స్ శాస్త్రీయ పద్ధతిలో చేసిన అద్భుతమైన విశ్లేషణ మనకు కనిపిస్తుంది.

సోవియట్ యూనియన్‌లో ఈ పుస్తకాన్ని ప్రచురించిన "మార్క్సిజం - లెనినిజం" సంస్థ తన పరిచయ వాక్యాలలో "జర్మన్ చరిత్రలోని ఆ ముఖ్యమైన దశ మీద తాను చేసిన పరిశోధనకు భౌతికవాద పరస్పరవాద, చారిత్రక భౌతిక వాదాల




పద్ధతిని ప్రయుక్తం చేయడంలోనూ, జర్మనీలోని 16 వ శతాబ్ది తొలి కాలపు రాజకీయ, మత పోరాటపు సాంఘిక ఆర్థిక కారణాలనూ, వర్గ స్వభావాన్నీ వెల్లడించిన చారిత్రిక సాహిత్యంలో ఎంగెల్స్ మొదటివాడు" అని పేర్కొంది. అలా ఎంగెల్స్ రాసిన జర్మనీలో రైతు యుద్ధం చారిత్రక భౌతికవాదపు ఆది గ్రంథం అయ్యింది.

## మతం ముసుగులో ఫ్యూడల్ వ్యతిరేక తిరుగుబాట్లు

16 వ శతాబ్దిలో జరిగిన తిరుగుబాట్లు మతం ముసుగును కప్పుకున్నాయి. ఈ తిరుగుబాట్లను భావవాద చరిత్రకారులు పై పొరను మాత్రమే చూసి వ్యాఖ్యానాలు చేశారు . దీనిని ఎంగెల్స్ ప్రస్తావిస్తూ "మన చరిత్ర కారులూ, జ్ఞాన సంపన్నులూ చెప్పేది ఏమంటే ఆనాటి ప్రజలు స్వర్గలోక విషయాల గురించి ఒక అంగీకారానికి వచ్చి వుంటే భూలోక విషయాల గురించి కొట్లాడవలసిన కారణమేమీ ఉండేది కాదు. "అంటూ వారు పై పైన కనిపించే మతపరమైన ముసుగు చుట్టూ తిరగడాన్ని చూపించాడు. నిజానికి వారు భూలోక సమస్యలనుండి విముక్తి కోసం స్వర్గలోకాన్ని పరదాగా చేసుకున్నారు . మతయుద్ధాలుగా పిలువబడుతున్న వాటిలో స్పష్టమైన భౌతిక ప్రయోజనాలు ఉన్నాయని వివరించాడు ఆ యుద్ధాలు కూడా వర్గయుద్ధాలేనని కాకపోతే అవి మతం దుస్తులు వేసుకున్నాయని ఎంగెల్స్ స్పష్టం చేసాడు. వివిధ వర్గాల ప్రయోజనాలూ, డిమాండ్లూ అన్నీ మతం తెరవెనుక మరుగున పడినప్పటికీ అవి వర్గ యుద్ధాలేనని తన విశ్లేషణ ద్వారా ఈ పుస్తకంలో నిరూపించాడు.

దీనికి గల చారిత్రిక పరిణామాన్ని అయన వెల్లడించాడు మధ్యయుగాల అనేవి ఆదిమ స్థితినుండి అభివృద్ధి అయ్యాయి . అవి పాత నాగరికతను, పాత తత్వ శాస్త్రాలను, రాజకీయాలను, న్యాయ శాస్త్రాలనీ తుడిచి పారవేశాయి. ప్రతి దానినీ కొత్తగా ప్రారంభించాయి ఇలా తుత్తునియలైన పాత ప్రపంచం నుండి అవి మిగుల్చుకున్నది ఒకేవొక్కటి,అది క్రైస్తవ మతమూ, తమ నాగరికతను కోల్పోయి సగం ధ్వంసమైన పట్టణాలు మాత్రమే.

పర్యవసానంగా ప్రతి ఆదిమ అభివృద్ధి దశలో వున్నట్లే మతగురువులు బౌద్ధిక విద్య మీద గుత్తాధిపత్యం పొందారు. విద్య అనేది ప్రధానంగా మత విద్య అయింది. మతగురువుల చేతుల్లో రాజకీయాలు, న్యాయ శాస్త్రం, ఇతర శాస్త్రాలలాగే కేవలం మతశాస్త్ర శాఖలుగా వుండిపోయాయి. అవి మతశాస్త్ర సూత్రాల ప్రకారం వివరింపబడేవి. చర్చి పిడి సూత్రాలు, రాజకీయ సూత్రాలదీ అదే దారి అయింది. బైబిల్ ఉల్లేఖనలకు ఏ న్యాయ స్థానంలోనైనా న్యాయ శాస్త్రపు విలువ ఉండేది. మతశాస్త్రపు ఆధిక్యం వీటన్నింటినీ ఆవరించిన సంశ్లేషణంగా చర్చి ఆ స్థానాన్ని ఆక్రమించింది.

ఈ పరిస్థితులలో ఫ్యూడలిజానికి వ్యతిరేకంగా, చర్చికి వ్యతిరేకంగా జరిగిన దాడులు, అన్ని విప్లవకర సూత్రాలు అన్నీ ఏకకాలంలో సంప్రదాయ వ్యతిరేకమైన మత సూత్రాలుగా వుండవలసి వచ్చింది. ఆనాటి సాంఘిక పరిస్థితుల మీద దాడి చెయ్యడానికి ముందు ఈ సంప్రదాయాల పవిత్రతను చీల్చి పారవేయడం తప్పనిసరి అయింది. ఫ్యూడలిజంపై వ్యతిరేకత మధ్యయుగాలలో అన్ని చోట్లా సజీవంగా వుంది. ఐతే అది మార్మిక వాద రూపాన్ని లేదా సంప్రదాయ మత సిద్ధాంతాలకు వ్యతిరేక మైన రూపాన్ని లేదా తిరుగుబాటు రూపాన్ని ధరించాల్సి వచ్చింది. అది ఏ రూపాన్ని ధరించేది ఆనాటి పరిస్థితుల మీద ఆధారపడి వుంటుందని ఎంగెల్స్ తన చారిత్రిక భౌతికవాద దృక్పథంతో జర్మనీలో రైతు యుద్ధంలో మతం ముసుగు వేసుకోడానికి గల కారణాలను ఆవిష్కరించాడు.

అలాగే రైతుల డిమాండ్‌లు కూడా సంప్రదాయ వ్యతిరేక మత సిద్ధాంత రూపంలోనే వ్యక్తీకరించబడిన తీరును ఎంగెల్స్ వెల్లడించారు. మతగురువులకు, పోప్ వ్యవస్థకు వ్యతిరేకంగా తొలి క్రైస్తవ చర్చి నియమావళిని పునరుద్ధరించాలని అవి కోరాయి. "దేవుని పిల్లల సమానత్వం" నుండి అది పౌరుల సమానత్వం ఉండాలని, కొంతవరకు ఆర్థికసమానత్వం వుండాలని కోరింది. నిర్బంధ శ్రమను, భూమి శిస్తు, అధికపన్నులు వేసే హక్కులరద్దునూ డిమాండ్ చేశాయి. సమాజంలో వివిధ అంతస్థుల మధ్య గల విపరీతమైన భేదాలను తొలగించాలని కోరారు . ఈ డిమాండ్‌లు తొలి క్రైస్తవ సిద్ధాంతపు అంతరార్థాలుగా ప్రకటించ బడ్డాయి. మతసంస్కరణ చుట్టూ తిరిగిన ఈ డిమాండ్‌లు ఫ్యూడల్ వ్యవస్థపై తిరుగుబాటును ప్రకటించడంగా ఎంగెల్స్ వెల్లడించారు. మత సంస్కరణ పేరుతో ప్రారంభమైన ఈ తిరుగుబాట్లలోజరిగిన ప్రచారంలో ఆకర్షితులైన వారు ఒకే వర్గ సముదాయం కాదు, అది వివిధ వర్గాల మిశ్రమం. తుది పోరు నాటికి ఈ వర్గాలలో కొన్ని రాజీ పడడం కొన్ని వర్గాలు క్రియారహితం కావడాన్ని ఎంగెల్స్ చూపిస్తాడు. ఈ తిరుగుబాట్ల ప్రచారానికి నాయకత్వం వహించిన లూథర్ , మూంత్సర్‌ల పాత్రలపై ఎంగెల్స్ చేసిన విశ్లేషణ దీనిని వివరిస్తుంది.

జర్మనీలో ఫ్యూడల్ సమాజపు పునాదులను 1525లో జరిగిన రైతు యుద్ధం దుర్బలపరిచిందని, దీనిలో రైతులు ప్రదర్శించిన విప్లవ శక్తిని ప్రశంసిస్తూనే రైతు ఉద్యమ బలహీనతలను వెల్లడించాడు. రైతులు సంఘటితంగా లేక పోవడమూ, రైతు ఉద్యమం సద్యోజనితంగా, అనైక్యంగా

వుండడమూ, రైతులలోని తక్కువ చైతన్య స్థాయి ఇవన్నీ రైతు యుద్ధం ఓటమికి కారణాలుగా ఎంగెల్స్ ప్రకటించారు. రైతులలో వున్న గుప్త శక్తిని గుర్తించాలని, ఫ్యూడలిజానికి, పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేక విప్లవాలలో విజయానికి కార్మిక వర్గానికి పొత్తు దారుగా రైతాంగం పాత్రను నొక్కి చెప్పాడు.

ఈ పుస్తకంలో రైతుల తిరుగుబాట్లకు సంబంధించిన అనేక కోణాలను ఎంగెల్స్ ఆవిష్కరించారు. వ్యాసానికి విస్తృతికి గల పరిమితుల రీత్యా ఈ పరిచయాన్ని ముగించుకుందాం.

**ముగింపు**

ఈ పుస్తకం పలు రంగాలలో మనకు మార్గదర్శనం చేసేదిగా, ప్రేరణ ఇచ్చేదిగా ఉంటుంది

1. దేశంలో, రాష్ట్రాలలో, వివిధ ప్రాంతాలలోని రాజకీయ, ఆర్థిక, సామాజిక రంగాల అభివృద్ధి క్రమాన్ని చారిత్రిక భౌతికవాద దృక్పథంతో విశ్లేషించుకోడానికి, రూపు దిద్దుకున్న వర్గాలను, వాటి స్వభావాన్ని అంచనా వేసుకోడానికి ఈ పుస్తకం ప్రాతిపదికను ఇస్తుంది.
2. దేశంలో, రాష్ట్రంలో, స్థానికంగా కొన్ని ప్రాంతాలలో జరిగిన ప్రజా తిరుగుబాట్లను, అవి సృష్టించిన నాయకులను వెలుగులోకి తేవడం ద్వారా తిరుగుబాట్ల సంప్రదాయాలను ప్రజా ఉద్యమాలకు స్ఫూర్తినిచ్చే ప్రతీకలను రూపొందించు కోవలసిన అవసరాన్ని ఈ పుస్తకం వెల్లడిస్తుంది.
3. దేశమంతటా జరిగిన, జరుగుతున్న కుల, మతపరమైన ఉద్యమాలపై విశ్లేషణకు ఈపుస్తకం విశేషంగా ఉపకరిస్తుంది. ఈ ఉద్యమాలలో ప్రగతిశీలమైన వాటిని, ప్రగతి నిరోధకమైన వాటిని గుర్తించే చూపును ఇస్తుంది. కులం అయినా, మతం అయినా అవి ఏకవర్గ స్వభావం కలవి కావని, అవి బహు వర్గాల మిశ్రమ రూపంగా గుర్తించడానికి, వర్గ ప్రయోజనాల దృష్టితో వాటి పట్ల వ్యవహరించడానికి దారి చూపుతుంది.




4. కార్మిక – కర్షక పొత్తును సమర్థించడం అందరికీ తెలిసిందే. పొత్తులకు వర్గప్రయోజనాలు ప్రధానం అన్న అంశాన్ని నొక్కి చెబుతుంది. ఇదే పార్టీలతో పొత్తులకు వర్తించే అంశాన్ని ఈ పుస్తకం గుర్తు చేస్తుంది.

చివరిగా ఎంగెల్స్ తన ఉపోద్ఘాతంలో చెప్పిన మాటలతో ముగించుకుందాం "ప్రత్యేకంగా నాయకుల కర్తవ్యం యేమిటంటే సిద్ధాంత సమస్యలన్నిటి పైనా అంతకంతకూ స్పష్టమైన అవగాహన సంపాదించుకోవడం.... సోషలిజం ఒక శాస్త్రం అయింది గనుక దానిని శాస్త్రంగా అనుసరించాలని, అనగా అధ్యయనం చెయ్యాలని, అది డిమాండ్ చేస్తుందనే విషయాన్ని నిత్యం మనసులో ఉంచుకోవాలి. అంతకంతకూ స్పష్టమైన అవగాహనను మరింత పట్టుదలతో కార్మిక జనాలలో వ్యాప్తి చేయడమూ, పార్టీ యొక్కా, ట్రేడ్ యూనియన్ల యొక్కా నిర్మాణాన్ని అంతకంతకూ దృఢంగా కట్టుదిట్టం చేయడమూ కర్తవ్యంగా వుంటుంది".

ఎంగెల్స్ రాసిన చారిత్రిక భౌతికవాదపు ఆది గ్రంథం నిజంగానే మనకు కర్తవ్య బోధ చేస్తుంది. ❑

## ఇంగ్లండులో కార్మికవర్గ స్థితిగతులు

**(26వ పేజీ తరువాయి)**

"ఎంగెల్స్ రచన ప్రపంచ సోషలిస్టు సాహిత్యంలో ఒక అత్యుత్తమ రచనగా శాశ్వత స్థానం పొందింది"– ఎంగెల్స్ జీవిత చరిత్రకారులు.

19వ శతాబ్దపు అత్యంత ప్రతిభావంతులైన తత్వవేత్తలలో ఒకడైన ఎంగెల్స్ తన ప్రాణ స్నేహితుడైన మార్క్స్‌ను మహా మేధావిగా గుర్తించి ఒక పక్క ఆయనకు పోషకునిగా వుంటూనే, ఆయనకు ద్వితీయునిగా, మార్క్స్ నీడలోనే పని చేశాడు. ఎంగెల్స్ చాలా త్యాగాలు చేశాడు. అదంతా మార్క్స్ కోసమే చేశాడనుకుంటే అది అర్ధ సత్యమే. ఆయనకు మానవాళి పట్ల అపరిమిత ప్రేమ. ఆయన జీవితాంతం మానవుల అభ్యున్నతి కోసం తపించి పోయాడు. మార్క్స్ తనకంటే ప్రతిభావంతమైన, మరింత ఉపయోగకరమైన కృషి చేయగలడని నమ్మి ఆయనకు సాయం చేయడం కోసం రెండు దశాబ్దాలు ఇష్టం లేని ఉద్యోగం చేశాడు. మార్క్స్ చనిపోయిన తర్వాత కూడా తన రచనా వ్యాసంగం ఆపి, కేపిటల్ 2,3 సంపుటాలను పరిష్కరించి ప్రచురించాడు. అనారోగ్యంతోనే ఆ పని పూర్తి చేశాడు. ఆ పని కోసం తన గ్రంథాన్ని మధ్యలో ఆపేశాడు. ఇంచుమించుగా మార్క్స్‌కి సమానుడైన మహా ప్రతిభాసంపన్నుడు తను చేయగల, తనకిష్టమైన సృజనాత్మక కృషిని త్యాగం చేసి బండ చాకిరీ చేశాడంటే ఆ త్యాగం విలువ మన అంచనాలకు అందదు. ఎంగెల్స్ 200వ జయంతి సంవత్సరంలో ఆయన కృషిని తెలుసుకోవడం, ఆయన రచనలు చదవడం, ఆయన చూపిన మానవ ప్రేమను ఎంతో కొంత వంటపట్టించుకోవడమే ఆయనకు మనమిచ్చే ఘన నివాళి. ఆయనను స్మరించుకోవడమంటే మన సంస్కారాన్ని మనం పరిరక్షించుకోవడమే! ❑



# శ్రమైక జీవన సౌందర్యం ఎంగెల్స్ రచన "వానరుడు నరుడైన క్రమంలో శ్రమ పాత్ర"




ఎం.వి.ఎస్.శర్మ, ఎడిటర్, ప్రజాశక్తి

మార్క్సిజం ఒక ప్రాపంచిక దృక్పథం. గతం నుండి నేర్చుకుని, వర్తమానానికి అన్వయించి, ఉజ్వల భవిష్యత్తు వైపు మానవాళిని నడిపించడానికి తోడ్పడే ఒక సాధనం. అంటే మార్క్సిజం అనివార్యంగా ఆచరణతో పెనవేసుకుని వుంటుంది.

అదే విధంగా మార్క్స్, ఎంగెల్స్‌ల జీవితాలూ, వారిరువురి ఆలోచనలు, ఆచరణ పెనవేసుకునే వుంటాయి. విశ్వమానవ కళ్యాణం కోసం తమ జీవితాలను అర్పించిన ఆదర్శమూర్తులు వారిద్దరూ. మార్క్సిజం మార్క్స్, ఎంగెల్స్ ఇద్దరూ కలబోసుకున్న భావాల నుండి రూపొందింది. అంతేగాక, వారిద్దరి సమకాలీన కార్మికోద్యమాల, విప్లవాల నుంచి, అందులో మార్క్స్, ఎంగెల్స్‌లు ప్రత్యక్షంగా పాల్గొని పొందిన అనుభవాల నుండి, చేసిన పరిశీలనల నుండి రూపొందింది. మార్క్సిజం ఈజ్ నాట్ ఎ డాగ్మా, ఇట్ ఈజ్ ఎ గైడ్ టు యాక్షన్.


ఫ్రెడరిక్ ఎంగెల్స్
వానరుడు మానవుడుగా మారే క్రమంలో శ్రమ నిర్వహించిన పాత్ర

మార్క్సిజం సిద్ధాంతం ప్రధానంగా పెట్టుబడిదారీ సమాజాన్ని విశ్లేషించడానికి, దానిని మార్చి మెరుగైన వ్యవస్థను రూపొందించ డానికి ప్రయత్నిస్తుంది. ఇందులో మానవులే కేంద్రం. తక్కిన పెట్టుబడిదారీ సిద్ధాంతాలకి లాభమే కేంద్రం. వారు ప్రజాస్వామ్యం గురించో, స్వేచ్ఛ గురించో గొప్పగా కబుర్లు చెప్పినా అవన్నీ 'లాభం' అన్న లక్ష్య సాధన కోసమే.

మానవులు తమ మనుగడ కోసం ప్రకృతిపైన, ప్రకృతి వనరులపైన ఆధారపడుతూనే, ఆ ప్రకృతిని, ఆ వనరులను తమ అవసరాలకు తగ్గట్టు మార్చుకోడానికి ప్రయత్నిస్తారు. ఈ ప్రయత్నించే క్రమం పేరే 'శ్రమ'. ఈ క్రమంలో మానవులు ఉపయోగించే పరికరాలే శ్రమసాధనాలు.

ఈ శ్రమ ఫలితాన్ని కొద్దిమంది స్వాధీనం చేసుకుని ఏ విధంగా కుబేరులయిందీ మనం చూస్తున్నాం. ఈ క్రమం చట్టబద్ధంగానే జరిగింది. ఐతే ఈ క్రమంలో శ్రమజీవులు అన్యాయం అయిపోతున్నారు. ఇది అన్యాయమే కాదని, మార్కెట్ యొక్క సహజ న్యాయమేనని పెట్టుబడిదారీ సమర్థకులు వాదిస్తారు. ఆ వాదనల డొల్లతనాన్ని బైటపెట్టి 'అదనపు విలువ సిద్ధాంతం'తో దోపిడీ రూపాన్ని విశదపరిచాడు మార్క్స్.

మార్క్స్ అధ్యయనం, సాహిత్య సృజన ప్రధానంగా శ్రమ, ఉత్పత్తి సంబంధాల చుట్టూ జరిగింది. సమాజ అస్థిత్వానికి పునాదిగా ఉత్పత్తి, ఉత్పత్తి సంబంధాలు ఉంటాయి. ఐతే మానవ సంబంధాలలో రెండో పార్శ్వం మానవజాతి పునరుత్పత్తి. ఈ పార్శ్వం మీద ప్రధానంగా కృషి చేసి ఎంగెల్స్ మార్క్సిజానికి ఒక సంపూర్ణత్వం తెచ్చాడు. "కుటుంబం - వ్యక్తిగత ఆస్తిరాజ్యాంగాల పుట్టుక", "ప్రకృతిలో గతితర్కం" వంటి రచనలు లేని మార్క్సిజాన్ని మనం ఊహించుకోలేము.

ఎంగెల్స్ సృజనాత్మకతను సూటిగా మనకు తెలియజెప్పే చిన్న రచన "వానరుడు నరుడైన క్రమంలో శ్రమ పాత్ర". 1876 లో ఎంగెల్స్ దీనిని రచించాడు. మానవ శ్రమ నుండే అదనపు విలువ ఉత్పత్తి అవుతుందని మార్క్స్ సూత్రీకరిస్తే, ఆ సూత్రీకరణ వెనక ఉన్న దృక్పథాన్నే కలిగిన ఎంగెల్స్, మానవ పరిణామ క్రమం వెనక సైతం శ్రమదే కీలకపాత్ర అని ఈ రచనలో స్పష్టం చేశాడు.

'లేబర్' అని ఈసడింపుగా సంపన్నులు, దోపిడీవర్గాలు అంటారు. దానికి భిన్నంగా 'లేబర్' మానవత్వపు సారాంశం అని ఎంగెల్స్ రచన చదివితే మనకి బోధపడుతుంది. పనిముట్టు పట్టుకోగలిగే ఆకృతి మనిషి చేయికి రావడం వెనక, ముఖ్యంగా బొటనవేలు తక్కిన నాలుగు వేళ్లకూ ఎడంగా ఉండడం వెనక ఆదిమకాలపు నరవానరాలు చేసిన శ్రమ పాత్ర ఎంతవుందో, అది ఎంత కీలకమో ఎంగెల్స్ వివరించిన తీరు గొప్పగా వుంటుంది. అదే మాదిరిగా రెండుకాళ్ల మీద నిటారుగా నిలవగలగడం అనే దాన్ని ముందుకాళ్లు రెండూ భూమి నుండి స్వేచ్ఛ పొందడంగా ఎంగెల్స్ వర్ణించడం వెనక సునిశితత్వం మనం అవగతం చేసుకోవాలి.

భాష మనకు సరస్వతీదేవి - వాగ్దేవి ఇచ్చిన వరంగా చెప్పేవారు ఎంతటి మూర్ఖత్వం ప్రచారం చేస్తున్నారో, ఈ పుస్తకం

చదివితే బోధపడుతుంది. సమిష్టి శ్రమ జీవనంలో పరస్పరం భావాలను వ్యక్తీకరించుకోవాల్సిన ఆవశ్యకతే భాష రూపొంద డానికి ప్రాతిపదిక అయిందని ఎంగెల్స్ తెలియజెప్పాడు. అలాగే సాహిత్యం, నృత్యం, సంగీతం, చిత్రలేఖనం వంటి కళలు శ్రమ నుండే రూపొందాయి తప్ప రాజుల ఆస్థానాల్లో, పండితుల మెదళ్లలో కాదన్న సత్యం ఎంగెల్స్ వివరించాడు.

తెలివితేటలు కొన్ని కులాలకే సొత్తు అని, దైవ నిర్ణయం అని, లేదా పూర్వజన్మ సుకృతం అని భావించే ప్రబుద్ధులు చాలా మంది వున్నారు. కాని మనిషి మెదడు పరిణామ క్రమంలో వేగంగా అభివృద్ధి చెందడానికి శ్రమతోబాటు ఆహారం తయారీలో నిప్పును ఉపయోగించడం ఏ విధంగా దోహదపడ్డాయో ఎంగెల్స్ వివరించాడు.

జ్ఞానానికి ప్రాతిపదికే శ్రమ. ఆ జ్ఞానాన్ని శ్రమజీవులకి అందకుండా చేసే కుట్ర మనువాదులది, దాన్ని సరుకుగా మార్చి అమ్ముకునే దుర్మార్గం పెట్టుబడిదారులది. జ్ఞానం సమిష్టి హక్కు అని, దాని మూలాలు శ్రమలోనే వున్నాయని శ్రమజీవులకు ప్రబోధించే పుస్తకం "శ్రమపాత్ర".

తనని తాను సమిష్టి శ్రమ ప్రక్రియలో మానవుడు ఆవిష్కరించుకున్నాడు. తక్కిన జంతు ప్రపంచం మాదిరిగా 'ప్రకృతి'తో సర్దుకుపోకుండా, దానిపై ఆధిపత్యం కోసం జరిగే సమిష్టి శ్రమయజ్ఞంలో ఒక్కోసారి తానే సమిధ అయిపోతూ,




అయినా ఆ పోరాటాన్ని సాగిస్తూ పరిణామ క్రమాన్ని ముందుకు తీసుకు పోతున్నాడు. అంతిమంగా శ్రమజీవులదే విజయం అని, ఆ విజయాన్ని ఆ శ్రమజీవులే చైతన్యంతో సాధించాలని మార్క్సిజం చెప్తుంది. శ్రమ, మానవుడు విడదీయలేని రెండు పార్శ్వాలు.

ఐతే పెట్టుబడిదారీ వ్యవస్థ శ్రమను మానవుడి నుంచి వేరు చేయడానికి ప్రయత్నిస్తుంది. ఆ క్రమంలోనే 'నిరుద్యోగం' పెరుగుతుంది. ప్రస్తుత నయా ఉదారవాద యుగపు విలువలు శ్రమను గేలిచేసి, కష్టపడకుండా డబ్బు పోగేసుకోవడమే ఘనతగా చెప్పుకుంటాయి. ఇది ఎంతటి అమానవీయమో ఎంగెల్స్ రచన వొంటబట్టించుకుంటే బోధపడుతుంది. అలాగే ఈ దశ శాశ్వతం కాదని, తిరిగి మానవుడు, శ్రమ విడదీయలేని తీరులో కలిసిపోయి పల్లవించే "శ్రమైక జీవన సౌందర్య" వ్యవస్థ ఏర్పడడం తథ్యమని బలమైన విశ్వాసమూ కలుగుతుంది.

సమాజం పురోగమించాలని భావించే ప్రతీవ్యక్తి, సాటి మనిషి కష్టాన్ని గౌరవించాలన్న సంస్కారం అలవర్చుకోవాలని, శ్రమలోని సమిష్టితత్వాన్ని అర్థం చేసుకోవాలని, అలా అర్థం చేసుకోడానికి "వానరుడు నరుడైన క్రమంలో శ్రమ పాత్ర" చదివి తీరాలని బలంగా భావిస్తున్నాను. ❑

## ఫ్రెడరిక్ ఎంగెల్స్ రెండవ శత జయంతి

**(21వ పేజీ తరువాయి)**

కుటుంబం సమాజంలో భాగము గనుక కుటుంబ పరిణామం సామాజిక పరిణామంలో భాగంగా వుంటుందని ప్రామాణికంగా నిరూపించాడు. గణవ్యవస్థ జీవితాన్ని అనివార్యమైన దాని పతనాన్ని, సొంత ఆస్తి, వర్గాల పుట్టుకను రాజ్యాంగ యంత్రం ఆవిర్భావాన్ని మనస్సుకు హత్తుకొనేలా రాశాడు. దంపతీ వ్యవస్థను ఎక్సరే కళ్ళతో చూశాడు. "స్త్రీ పురుషుల మధ్య వైషమ్యమూ, మొట్టమొదటి వర్గ వైషమ్యాలు, చరిత్రలో ఏకకాలంలో తలెత్తాయి" అన్నాడు.

మార్క్స్ తర్వాత యూరప్, అమెరికా సోషలిస్టులకు ఎంగెల్స్ ఏకైక నాయకుడిగా వున్నాడు. స్పెయిన్, రుమేనియా, రష్యా తదితర దేశాల కార్మిక సంఘాలతో, సంబంధాలు పెట్టుకొని సలహాలు యిచ్చేవాడు. రెండవ ఇంటర్నేషనల్ మహాసభ పారిస్‌లో 14 జులై 1889లో జరిగింది. 20 దేశాల నుండి ప్రతినిధులు పాల్గొన్నారు. ఇంటర్నేషనల్ కార్యకలాపాలలో ఎంగెల్స్ చురుకుగా పాల్గొన్నాడు. ప్రముఖ పాత్ర పోషించాడు. అంతర్జాతీయ కార్మికోద్యమంలో తలెత్తిన మితవాద, అతివాద ధోరణులకు వ్యతిరేకంగా తీవ్రంగా పోరాడాడు.

వృద్ధాప్యంలో కూడా ఎంగెల్స్ యువకుడిలా వుండేవాడు. ఉత్తేజంగా, ఉల్లాసంగా వుండేవాడు. 74 ఏళ్ళు వచ్చాయి. చేయాల్సిన పని ఎంతో వుంది. క్యాన్సర్ వ్యాధి ఆయన్ని కబళించింది. చరమాంకం ఎదురైందని అర్థమైంది. ప్రశాంతంగా మృత్యువుని ఆహ్వానించాడు. 1895 ఆగస్టు 5న రాత్రి 11 గంటలకు ఎంగెల్స్ అస్తమించాడు. ఆయన కోరిక మేరకు అత్యంత నిరాడంబరంగా అంత్యక్రియలు జరిగాయి. దహన సంస్కారం తర్వాత చితాభస్మాన్ని ఆయనకెంతో ఇష్టమైన ఈస్ట్‌బోర్న్ సమీపంలోని సముద్రంలో కలిపారు.

మార్క్స్, ఎంగెల్స్‌లు భౌతికంగా మన మధ్య లేకపోయినా, మార్క్సిజం కార్మికవర్గానికి, పీడిత ప్రజలకు వేగుచుక్కలా దారి చూపుతోంది. ❑

– ప్రజాసాహితి సౌజన్యంతో...



# హెగెల్‌కు మార్క్సిజానికి మధ్య వారధి లుడ్విగ్ ఫొయెర్‌బాఖ్




డి. సోమసుందర్

డేనిష్ తత్త్వవేత్త, సామాజిక శాస్త్రవేత్త, రాజకీయ నాయకుడు కార్ల్ నికొలాయ్ స్టార్కే తన పట్టభద్ర పరీక్ష కోసం 1883లో రూపొందించిన సిద్ధాంత గ్రంథం "ఫొయెర్ బాఖ్''. దీనిని 1885లో గ్రంథ రూపంలో ప్రచురించారు. జర్మన్ సోషల్ డెమొక్రటిక్ పార్టీ సిద్ధాంత పత్రిక 'ది నోయెసైత్' సంపాదకవర్గం 'ఫోయెర్ బాఖ్' గ్రంథాన్ని విమర్శనా పూర్వకంగా సమీక్షించాల్సిందిగా ఎంగెల్స్‌ను కోరింది. ఎంగెల్స్ రాసిన సమీక్షను 1886 సంవత్సరపు నాలుగు, ఐదు సంచికల్లో 'ది నోయెసైత్' ప్రచురించింది. ఆ తర్వాత ఎంగెల్స్ తన సమీక్షను సవరించి ఒక చిరు గ్రంథ రూపంలో 1888లో ప్రచురించాడు. "లుడ్విగ్ ఫోయెర్ బాఖ్, జర్మన్ సాంప్రదాయ తత్వశాస్త్ర పరిసమాప్తి" పేరుతో ప్రాచుర్యం పొందిన ఈ గ్రంథం అనంతర కాలంలో కార్ల్‌మార్క్స్, ఎంగెల్స్ ఏరిన రచనల, సంకలిత రచనల సంపుటాల్లోనూ, స్వతంత్ర గ్రంథంగానూ వలుభాషల్లోకి అనువాదమయ్యింది. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 1966లో రష్యన్ ఎడిషన్‌ను ప్రచురించింది. మాస్కోలోని ప్రోగ్రెస్ పబ్లిషర్సు 1970 నుండి పలుసార్లు ఇంగ్లీషు భాషలో ప్రచురించింది. 1982లో మాస్కో ప్రగతి ప్రచురణాలయం ఏటుకూరి బలరామమూర్తి గారు చేసిన తెలుగు అనువాదాన్ని ప్రచురించింది.




1888 నాటి తొలి ప్రచురణకు ఎంగెల్స్ ఒక క్లుప్తమైన ముందు మాటను రాసాడు. సంప్రదాయక జర్మన్ తత్వశాస్త్ర సిద్ధాంతాల విషయంలో కారల్‌మార్క్సు, తానూ ఒకే దృక్పథం కలిగి వున్నామనీ, వేర్వేరుగానూ, ఉమ్మడిగానూ తాము సాధించిన జ్ఞాన పరిణామాన్ని ఎంగెల్స్ తన ముందుమాటలో వివరించాడు. సంప్రదాయక జర్మన్ తత్వశాస్త్ర సిద్ధాంతాల పట్ల తమకు ఏర్పడిన భిన్న దృక్పథాన్ని వ్యక్తీకరించడానికీ, అంతకు ముందు తమకు వుంటూ వచ్చిన పాత తత్వశాస్త్ర చైతన్యంతో అమీతుమీ తేల్చుకోవడానికి రెండు సంపుటాల గ్రంథాన్ని రూపొందించిన విషయాన్ని ఎంగెల్స్ ఈ ముందు మాటలో గుర్తు చేసాడు. "హెగెల్ అనంతర తత్వశాస్త్ర విమర్శ" రూపంలో తయారైన ఆ గ్రంథం నాటి పరిస్థితుల కారణంగా ముద్రణకు నోచుకోలేదని ఎంగెల్స్ పేర్కొన్నాడు. 1845 నాటి ఆ గ్రంథం ఆ తర్వాత కాలంలో తత్వశాస్త్ర రంగంలో తమకు వచ్చిన స్పష్టత కారణంగా తమ దృష్టిలో విలువ లేనిదిగా భావించి ఎలుకలకు ఫలహారంగా వదిలేశామన్నాడు. హెగెల్‌కూ తమకూ మధ్య వారధిగా వున్న లుడ్విగ్ ఫొయెర్ బాఖ్‌పై రాయడానికీ కూడా తమకు వీలు కుదరలేదని ఎంగెల్స్ వివరించాడు.

అయితే హెగెలియన్ తత్వశాస్త్రం పట్ల తమ వైఖరినీ, హెగెల్ నుండి తాము ముందుకు సాగిన తీరును, విభేదించిన విధానాన్ని వివరించడానికీ, ఫొయెర్‌బాఖ్ తమపై కల్గించిన అపార ప్రభావాన్ని గౌరవపూర్వకంగా తలచుకోవడానికి ఒక గ్రంథం రాయాల్సిన రుణభారం తమపై వుందని ఎంగెల్స్ తెలిపాడు. సరిగ్గా అదే సమయంలో స్టార్కే గ్రంథం రావడంతో దానిపై సమీక్ష పేరుతో లుడ్విగ్ ఫొయెర్ బాఖ్ గ్రంథ రచన సాగించానని ఎంగెల్స్ పేర్కొన్నాడు.

జర్మన్ భావవాద తత్వశాస్త్ర వ్యవస్థాపకునిగా ప్రసిద్ధి చెందిన ఇమ్మాన్యుయేల్ కాంట్, ఆయన అనంతర కాలపు తత్వవేత్తలు మాక్స్‌స్టీర్నెర్, డేవిడ్ ఫ్రిడ్రిక్ స్ట్రాస్, జోహన్నాస్ గాట్లిబ్ ఫిష్టే, హెగెల్, ఫోయెర్‌బాఖ్, బ్రూనోబౌవర్, ఫ్రిడ్రిక్ షిల్లర్, లుడ్విగ్ బ్యూఖ్నెర్, యాకోబ్ మోల్‌షెట్ వంటి వారి రచనలు సంప్రదాయ తత్వశాస్త్రంలో విభిన్న సైద్ధాంతిక ధోరణులను వ్యక్తీకరించాయి. తీవ్రమైన వాద, ప్రతివాదాలు, సంవాదాలు, సూత్రీకరణలు నాటి మేధోమథనాన్ని దానితో పాటు జర్మన్ తత్వశాస్త్రాన్ని పరిపుష్టం చేసాయి.

భావం ప్రాథమికమా, పదార్థం ప్రాథమికమా అనే తత్వశాస్త్ర మూల ప్రశ్నపై వెలువడ్డ అభిప్రాయాల పర్యవసానంగా తత్వవేత్తలు

రెండు శిబిరాలుగా చీలిపోయారు. రెండు సైద్ధాంతిక ధోరణుల మధ్య జరిగిన తాత్విక పోరాటాన్ని మార్క్స్, ఎంగెల్స్ లోతుగా అధ్యయనం చేసారు. 'జర్మన్ ఐడియాలజీ', 'హోలీ ఫ్యామిలీ', 'ఫొయెర్ బాఖ్‌పై సూత్రీకరణలు' 'యాంటీ డ్యూరింగ్', 'ఫొయెర్ బాఖ్' 'డైలెక్టిక్స్ ఆఫ్ నేచర్' వంటి రచనలలో కారల్‌మార్క్స్, ఎంగెల్స్ ఆనాటి తమ అభిప్రాయాలను, తమ ఆలోచనా రంగంలో రూపుదిద్దుకున్న దృక్పథాన్ని సంయుక్తంగాను, విడివిడిగాను, సూటిగా స్పష్టంగా వెల్లడిస్తూ వచ్చారు.

సంప్రదాయక జర్మన్ తత్వశాస్త్రం నుండి రూపుదిద్దుకున్న భౌతికవాదం, గతితర్కం వంటి విప్లవాత్మక ధోరణులను నిశితంగా పరిశీలిస్తూ వచ్చిన మార్క్స్, ఎంగెల్స్ భౌతికవాద తత్వశాస్త్రంను అభివృద్ధి చేసారు. ఆ క్రమంలో తాత్విక భౌతికవాద ప్రాతిపదిక నుండి వైదొలిగిన భావనలన్నిటినీ మార్క్స్, ఎంగెల్స్ పదే పదే ఖండిస్తూ వచ్చారు. హెగెల్‌నూ, ఫొయెర్ భాఖ్‌ను అపారంగా అభిమానిస్తూ వచ్చిన మార్క్స్, ఎంగెల్స్‌లు వారిద్దరి ఆలోచనలలోని ప్రగతిశీల పార్శ్వాన్ని స్వాగతిస్తూ, వారి సైద్ధాంతిక ధోరణులలోని పరిమితులను విస్పష్టంగా విమర్శించారు.

"లుడ్విగ్ ఫొయెర్‌బాఖ్ జర్మన్ సంప్రదాయ తత్వశాస్త్ర పరిసమాప్తి" గ్రంథంలో ఎంగెల్స్ ఆనాటి మేధోమథనం నేపథ్యంలో తమ ఆలోచనలలో సంభవించిన పరిణామాన్ని, సైద్ధాంతిక రంగంలో తాను సాధించిన స్పష్టతను విపులీకరించాడు. నాలుగు భాగాలుగా రాసిన ఈ గ్రంథం తొలి భాగంలో హెగెల్ తత్వశాస్త్రం లోని కీలక అంశాలను ఎంగెల్స్ ప్రస్తావించాడు. సత్యాన్ని అన్వేషించడమే తత్వశాస్త్ర లక్ష్యంగా భావించిన తత్వవేత్తలు సమాజగమనం 'అఖండ సత్యం' వైపుగా కొనసాగుతుందని సూత్రీకరించారు. 'వాస్తవమైన ప్రతీదీ హేతుబద్ధమైనది. హేతుబద్ధమైన ప్రతీదీ వాస్తవమైనది, తన పరిణామ క్రమంలో వాస్తవికత ఆవశ్యకతగా రూపొందుతుంది' అంటూ హెగెల్ చేసిన సూత్రీకరణ ఆధారంగా ఎంగెల్స్ తన సంవాదాన్ని కొనసాగించాడు. హెగెల్ ఆలోచనా పద్ధతిలోని నియమాలను తన కాలం నాటి పరిస్థితులకు వర్తింపచేస్తే దాని పర్యవసానంగా వచ్చే నిర్ధారణలను ఎంగెల్స్ వివరించాడు. ప్రష్యన్ రాచరికానికీ, రోమన్ రిపబ్లిక్‌కూ, రోమన్ సామ్రాజ్యానికీ, విప్లవ కాలం నాటి ఫ్రాన్స్‌కు హెగెల్ సూత్రీకరణను వర్తింపచేసి చూపించాడు.

వాస్తవికత, హేతుబద్ధత, ఆవశ్యకత అంశాలపై హెగెల్ చేసిన సూత్రీకరణలను బట్టి "పరిణామ క్రమంలో వాస్తవికత మారిపోతుందని, అదేమీ శాశ్వత సత్యం కాదనీ, అన్ని కాలాల్లోనూ అన్ని పరిస్థితుల్లోనూ సాంఘిక, రాజకీయ వ్యవస్థలకు అనుబంధంగా వుండదని" ఎంగెల్స్ అంటాడు.




అంతకు పూర్వం వాస్తవికమైనదంతా మారిన పరిస్థితుల్లో అవాస్తవికం అయిపోతుందని, దాని ఆవశ్యకతను పోగొట్టుకుంటుందనీ, దాంతో అస్థిత్వ హక్కునూ, హేతుబద్ధతను కోల్పోతుందని, పతనమైన నశించిపోయే వాస్తవికత స్థానంలో ఒక నూతనమైన విజయావకాశం కలిగిన వాస్తవికత ఆవిర్భవిస్తుందని ఎంగెల్స్ వివరిస్తాడు. హెగెల్ పద్ధతిలోని గతితర్కం మారుతున్న పరిస్థితులలో పరస్పర విరుద్ధ పర్యవసానాలకు దారి తీస్తుందని అంటాడు.

తత్వశాస్త్ర లక్ష్యమైన 'సత్యం' అనేది అంతిమం కాదని, అది నిరంతరం గ్రహణ క్రమంలో, సుదీర్ఘమైన విజ్ఞానశాస్త్ర చారిత్రకాభివృద్ధిలో కన్పిస్తుందని, అందువల్ల తత్వవేత్తలు బోధించే 'అఖండ సత్యం' అనే స్థితి ఏదీ ఉండజాలదని ఎంగెల్స్ స్పష్టం చేస్తాడు. విజ్ఞానశాస్త్రం క్రింది నుండి పై స్థాయి జ్ఞానానికి చేరుకుంటూనే వుంటుందని, 'అఖండ సత్యం' అనే స్థితి దగ్గర విజ్ఞానాభివృద్ధి ఆగిపోదని ఎంగెల్స్ అంటాడు. తత్వవేత్తల ఊహల్లో కన్పించే లోపరహితమైన సమాజం, లోపరహితమైన రాజ్యం వాస్తవంలో ఉండవని ఎంగెల్స్ అంటాడు. చారిత్రక వ్యవస్థలన్నీ కింది స్థాయి నుండి పై స్థాయికి మానవ సమాజపు అనంత పరిణామ క్రమంలో మధ్యంతర దశలుగా మాత్రమే ఉంటాయని ఎంగెల్స్ పేర్కొన్నాడు.

గతి తార్కిక తత్వశాస్త్రంలో శాశ్వతమూ, అఖండమూ, పవిత్రమూ అనే భావనలకు చోటు లేదని, పాతది నశించి, కొత్తది రూపొందడం అనే నిరంతరాయమైన పరిణామం మాత్రమే వుంటుందని ఎంగెల్స్ అంటాడు. మానవ ఆలోచన, కార్యాచరణల ఫలితంగా ఏర్పడిన అని అంశాల శాశ్వతత్వ భావనకు దెబ్బ కొట్టడంలోనే హెగెలియన్ తత్వశాస్త్రపు నిజమైన ప్రాధాన్యత, విప్లవ స్వభావం ఇమిడి వున్నాయని ఎంగెల్స్ వ్యాఖ్యానిస్తాడు. హెగెల్ ఆలోచనా పద్ధతిలో అస్పష్టంగా వున్న భావనల నుండి అనివార్యంగా వచ్చే నిర్ధారణలే గతితర్కంగా రూపొందాయని ఎంగెల్స్ స్పష్టం చేస్తాడు. కానీ సంప్రదాయ తత్వశాస్త్రంలోని తాత్విక వ్యవస్థ నియమాల ప్రకారం పరిణామ క్రమానికి ఒక ముగింపు, వ్యవస్థకు ఒక అంతం ఉండి తీరాలి. ఆలోచనలన్నీ ఏదో ఒక అఖండ సత్యానికి చేరుకోవాలి. దాంతో హెగెల్ తన పద్ధతిని ఉపయోగించి రూపొందించిన ఆలోచనావ్యవస్థ రోజువారీ ఆచరణాత్మక, రాజకీయ డిమాండ్లకు అనువర్తింపచేయడంతో




అంతిమంగా రాజరికానికి సమర్ధనగా 'అఖండ సత్యం' భావన మిగిలిపోయింది. ఇది హెగెల్‌ను ప్రత్యర్ధి రాజకీయ శిబిరంలోకి నెట్టింది. 'హెగెలియన్ ఆలోచనా పద్ధతిలోని పిడివాద సారాంశం అఖండ సత్యం రూపం ధరించింది. ఫలితంగా పిడివాదాన్ని రద్దు చేసే గతి తర్కం విస్మరించబడిందని' ఎంగెల్స్ పేర్కొన్నాడు. సమగ్రమైన ఒక విప్లవ ఆలోచనా క్రమం అత్యంత మితవాద రాజకీయాలకు దారి తీసిందని ఎంగెల్స్ విమర్శించాడు.

'హెగెలియన్ తాత్విక పరిశీలనా పద్ధతి విస్తారమైన పరిధిని ఆవరించిందని తర్కం, ప్రకృతికి సంబంధించిన తత్వశాస్త్రం, మానసిక తత్వశాస్త్రం, చారిత్రక, హక్కుల, మత తత్వ శాస్త్రాలు, తత్వశాస్త్ర చరిత్ర, సౌందర్య తత్వశాస్త్రం వంటి విభాగాలలో హెగెల్ ఎంతో శ్రమించాడనీ, అపారమైన జ్ఞాన సంపదను ఆయన పోగు చేసాడని' ఎంగెల్స్ ప్రశంసిస్తాడు. కానీ అందరి తత్వవేత్తల వలెనే హెగెల్ కూడా ఒక ఆలోచనా వ్యవస్థను రూపొందించాల్సి వచ్చిందని, దాని ప్రకారం చరిత్రలో మానవుడు సాధించాల్సిన లక్ష్యాన్ని తాత్వికుని ఆలోచనలలో సాధించాలని హెగెల్ ప్రయత్నించాడని, మానవుని క్రియాశీల పాత్రను హెగెల్ అంచనా వేయలేకపోయాడని ఎంగెల్స్ పేర్కొన్నాడు. హెగెల్ తత్వశాస్త్ర సిద్ధాంతంలో ఆలోచనా వ్యవస్థకు ప్రాధాన్యం ఇచ్చిన వారంతా మతం, రాజకీయ రంగాలలో అత్యంత మితవాదులుగా మిగిలిపోయారని, గతితార్కిక పద్ధతిని ప్రధానమైనదిగా భావించే వారంతా తీవ్రమైన ప్రతిపక్ష ధోరణికి చెందుతారని ఎంగెల్స్ సూత్రీకరించాడు. హెగెల్ తాత్విక ధోరణి రెండు శాఖలుగా చీలిపోయి యువ హెగెలియన్‌లు ఆవిర్భవించడానికి దారి తీసిన పరిణామ క్రమాన్ని ఎంగెల్స్ విస్తారంగా ప్రస్తావించాడు.

గ్రంథం రెండో భాగంలో హెగెల్, ఫాయెర్ భాఖ్‌ల గురించి ష్టార్కె చేసిన విశ్లేషణను ఎంగెల్స్ ప్రస్తావించాడు. తత్వశాస్త్ర మూలప్రశ్న నుండి బయలుదేరిన విభిన్న ధోరణులకు చెందిన తాత్వికుల ఆలోచనలలోని అసంగతత్వాన్ని ఎంగెల్స్ విశ్లేషించాడు. ఫాయెర్ బాఖ్ రచించిన 'క్రైస్తవ మత సారాంశం' గ్రంథంలోని సూత్రీకరణల ఆధారంగా హెగెల్‌కూ ఫాయెర్‌బాఖ్‌కు వున్న సారూప్యతలనూ, భిన్నత్వాలనూ, వైరుధ్యాన్ని ఎంగెల్స్ సుదీర్ఘంగా వివరించాడు. భావవాద తత్వశాస్త్రాన్నించి ఫాయెర్‌బాఖ్ దూరం జరిగి భౌతికవాదిగా ఆవిర్భవించినప్పటికీ అతని ఆలోచనా వ్యవస్థ తిరిగి భావవాద నిర్ధారణలకు వచ్చిందని ఎంగెల్స్ వివరించాడు. ప్రకృతి విజ్ఞాన శాస్త్రాలు, పరిశ్రమల అభివృద్ధి తత్వవేత్తల ఆలోచనలను ప్రభావితం చేసిన తీరును ఎంగెల్స్ మూడు, నాలుగు భాగాల్లో వివరించాడు. కాంట్ ప్రతిపాదించిన అజ్ఞేయవాదం సిద్ధాంతరీత్యా, ఆచరణరీత్యా కూడా తిరస్కారానికి గురయ్యిందని, నయా కాంట్‌వాదులు భౌతిక వాదాన్ని పరోక్షంగా అంగీకరించారని ఎంగెల్స్ వివరిస్తాడు. హెగెల్ ఆలోచనా పద్ధతి సారంలోనూ, రూపంలోనూ భావవాద పరంగా తల్లకిందులు చేయబడిన భౌతికవాదమని ఎంగెల్స్ సూత్రీకరించాడు.

ఫాయెర్‌బాఖ్ ప్రతిపాదించిన నైతిక సూత్రాలు, మతం, వ్యక్తుల సుఖాపేక్ష, ప్రేమ వంటి భావనలు అందరి ప్రజలను, అన్ని సందర్భాలనూ సంతృప్తి పరచడానికే ఉద్దేశించబడినాయని, అందువల్లనే ఆచరణయోగ్యం కాకుండా పోయాయని ఎంగెల్స్ స్పష్టం చేస్తాడు. వర్గసమాజంలో ప్రతి వర్గం, ప్రతి వృత్తీ తన సొంత నైతిక సూత్రాలను కలిగి వుంటుందనీ, వాటిని సైతం అవసరం వచ్చిన ప్రతిసారీ శిక్షాభయం లేకుండా ఉల్లంఘిస్తూనే వుంటుందని ఎంగెల్స్ అంటాడు. అందరినీ ఐక్యం చేస్తుందనుకున్న ప్రేమ నిజానికి యుద్ధాలలో, తగాదాలలో, కోర్టు వ్యాజ్యాలలో, గృహ కల్లోలాల్లో, విడాకుల్లో, ఒకరినొకరు దోపిడీ చేసుకునే అన్ని సందర్భాల్లోనూ వ్యక్తం అవుతూనే వుంటుందని ఎంగెల్స్ అధిక్షేపిస్తాడు. ఫాయెర్‌బాఖ్ కూడా ఊహా ప్రపంచంలోనే విహరిస్తాడనీ, ప్రకృతి గురించి, మనిషి గురించి మాట్లాడినప్పటికీ ఆ మాటలన్నీ ఊహలేనని నిజమైన ప్రకృతి గురించి, మనిషి గురించి ఫాయెర్ బాఖ్ ఏమీ చెప్పలేకపోయాడని ఎంగెల్స్ విమర్శిస్తాడు.

మానవులను చరిత్రలో భాగస్వాములుగా చూడాలని, ఫాయెర్‌బాఖ్ కొత్త మతంలోని ఊహాత్మక మానవుని తొలగించి ఆ స్థానంలో నిజమైన మానవుల, వారి చారిత్రాత్మక అభివృద్ధికి చెందిన విజ్ఞానశాస్త్రాన్ని పెంపొందించాలని ఎంగెల్స్ స్పష్టం చేస్తాడు. కారల్‌మార్క్స్ తన 'పవిత్ర కుటుంబం' గ్రంథంలో ఫాయెర్ బాఖ్ ఆలోచనలను ముందుకు తీసుకెళ్ళే పనిని సాగించాడని ఎంగెల్స్ ప్రస్తావించాడు. హెగెల్ ప్రతిపాదించిన చారిత్రక తత్వశాస్త్రం చరిత్ర చోదక శక్తులు, వాటికి కొన్ని నియమాలు వున్న విషయాన్ని గుర్తించిందని, అయితే తత్వశాస్త్రం వీటిని చరిత్రలోనూ, మానవులలోనూ వెతకకుండా తత్వశాస్త్ర సిద్ధాంతాల నుండి చరిత్రలోకి చొప్పించిందని ఎంగెల్స్ అంటాడు.

చారిత్రక భౌతికవాదాన్ని, గతితార్కిక నియమాలనూ చరిత్రకు, సమాజాలకు వర్తింపచేసినపుడు వివిధ వర్గాల మధ్య అనివార్యంగా వర్గపోరాటం జరుగుతుందన్న నిర్ధారణకు దారి తీస్తుందని ఎంగెల్స్ వివరిస్తాడు. లుడ్విగ్ ఫాయెర్ బాఖ్‌పై మార్క్స్

రాసిన సూత్రీకరణలలో రేఖామాత్రంగా ఈ ఆలోచనలన్నీ కన్పిస్తాయి. 1848లో ప్రకటించిన కమ్యూనిస్టు ప్రణాళికలో కారల్‌మార్క్స్, ఎంగెల్స్ వర్గపోరాట సిద్ధాంతాన్ని సమగ్రంగా వివరించారు. కమ్యూనిస్టు ప్రణాళిక మూడో భాగంలో వున్న "సోషలిస్టు, కమ్యూనిస్టు సారస్వతం" గురించి వివరించిన అంశాలన్నీ ఎంగెల్స్ తన లుడ్విగ్ ఫాయెర్ బాఖ్ గ్రంథంలో విస్తారంగా ప్రస్తావించాడు.

కారల్‌మార్క్స్ ముప్పయ్యవ వర్ధంతి సందర్భంగా 1913లో లెనిన్ రాసిన ఒక వ్యాసంలో మార్క్సిజం యొక్క మూడు మూలాలు, మూడు భాగాలు గురించి వివరించాడు. జర్మన్ తత్వశాస్త్రం, ఇంగ్లీషు అర్థశాస్త్రం, ఫ్రెంచి సోషలిజం భావాల న్యాయమైన వారసురాలిగా మార్క్సిస్టు సిద్ధాంతం అభివృద్ధి చెందిందని లెనిన్ పేర్కొన్నాడు. జర్మన్ తత్వశాస్త్రం నుండి ఆవిర్భవించిన భౌతికవాదం, గతితర్కం భావనలను భౌతికవాద తత్వశాస్త్రంగా రూపొందించడంలో కారల్‌మార్క్స్, ఎంగెల్స్ చేసిన కృషిని ఎంతో ఆరాధనా పూర్వకంగా లెనిన్ ప్రశంసించినాడు. హెగెల్, ఫాయెర్‌బాఖ్ వంటి సంప్రదాయక తత్వవేత్తల విజయాల నుండి "అత్యంత పరిపూర్ణ, గంభీర, సర్వగ్రాసి అభివృద్ధి సిద్ధాంతంగా మార్క్సిజం ఆవిర్భవించిన తీరును" లెనిన్ వివరించాడు. లెనిన్ చాలా క్లుప్తంగా రాసిన ఆ వ్యాసం మార్క్సిజం ఆవిర్భావం గురించిన నేపథ్యంపై మనకు అవగాహన కల్పిస్తుంది.




'కమ్యూనిస్టు ప్రణాళిక' మాదిరిగానే ఎంగెల్స్ రాసిన యాంటీడ్యూరింగ్, ఫాయెర్‌బాఖ్ గ్రంథాలు వర్గచైతన్యపూరితమైన కార్మికులందరికీ పాఠ్యగ్రంథాలని లెనిన్ పేర్కొన్నాడు. "మార్క్సిస్టు తత్వశాస్త్రమైన గతితార్కిక భౌతికవాద సిద్ధాంతం పుట్టు పూర్వోత్తరాలపై అవగాహన పెంచుకోవడానికి ఫాయెర్‌బాఖ్‌పై ఎంగెల్స్ రాసిన గ్రంథం ఎంతగానో ఉపకరిస్తుందని" లెనిన్ పలు సందర్భాలలో గట్టిగా చెప్పాడు. "తత్త్వవేత్తలంతా ప్రపంచాన్ని పలు విధాలుగా వ్యాఖ్యానించినారు. అయితే చేయాల్సిందల్లా దానిని మార్చడం" అనే సుప్రసిద్ధమైన మార్క్స్ ఉల్లేఖన కూడా ఫాయెర్‌బాఖ్‌పై మార్క్స్ రాసుకున్న సూత్రీకరణలోనిదే. ❑

---

# క్యోనిగ్స్‌బెర్గ్‌లోని జె. బ్లోహ్‌కి ఎంగెల్స్

**లండన్ 1890, సెప్టెంబరు 21(-22)**

నేను మీకు మరో విషయం కూడా చెప్పదలుచుకున్నాను. మీరి సిద్ధాంతాన్ని, దాని మూలాధారాల నుంచే అధ్యయనం చెయ్యండి గాని, పరోక్షాధారాల నుంచి చెయ్యబోకండి; నిజానికది చాలా సులభతరం కూడా. మార్క్సు రచనల్లో మూలాధారాల పరిశీలన పాత్ర వహించని రచన దాదాపు లేదని చెప్పవచ్చు. అయితే ప్రత్యేకించి "లూయీ బోనపార్ట్ బ్రూమేర్ పద్దెనిమిదవ తేదీ" మూల సమాచార అన్వయానికి అత్యుత్తమోదాహరణల్లో ఒకటి. "పెట్టుబడి" గ్రంథంలో కూడా దీనికి పలు పరోక్ష ప్రస్తావనలున్నాయి. ఇప్పుడిక నా యీ దిగువ రచనలను చూడమని మిమ్మల్ని కోరుతున్నాను. "మిస్టర్ ఏజేన్ ద్యూరింగ్ విజ్ఞాన శాస్త్రంలోకి తెచ్చిన విప్లవమూ", "లుడ్విగ్ ఫాయెర్ బాఖ్, సాంప్రదాయిక జర్మన్ తత్వశాస్త్ర పరిసమాప్తి". వాటితో నేను చారిత్రక భౌతికవాదాన్ని గూర్చి - నాకు తెలిసినంత వరకు అది ఉంది - అత్యంత విపులమైన వివరణను యిచ్చాను.

యువకులు ఒక్కొక్కసారి ఆర్థిక పార్శ్వానికి - దానికి యోగ్యమైనదానికన్న - ఎక్కువ ప్రాధాన్యాన్ని ఇస్తున్నారంటే, యీ దోషంలో స్వయంగా మార్క్సుకూ, నాకూ కూడా పాక్షికంగా కొంత బాధ్యత వుంది. ఆర్థిక అంశాన్ని తిరస్కరించిన మా ప్రత్యర్థులకు వ్యతిరేకంగా, ఆ ప్రధాన సూత్రాన్ని మేము నొక్కి చెప్పాల్సి వచ్చింది. పరస్పర వర్తనలో యిమిడి వున్న యితర అంశాలకు సముచితమైన స్థానాన్నిచ్చే వ్యవధి గాని, స్థలం గాని, అవకాశం గాని మాకు అన్నప్పుడు అభ్యం కాలేదు. కాని, చరిత్రలో ఒక విభాగాన్ని చిత్రించవలసి వచ్చినప్పుడు, అంటే ఆచరణరీత్యా అన్వయించవలసి వచ్చినప్పుడు అది వేరే విషయం. అక్కడ ఏ పొరపాటూ కూడా అంగీకారయోగ్యం కాదు. అయితే దురదృష్టవశాత్తూ కొంతమంది ఓ కొత్త సిద్ధాంతాన్ని తాము బాగా అర్థం చేసుకున్నామనీ - వాటినైనా అన్నప్పుడు సరిగా కాదు - దాని ప్రధాన సూత్రాలను జీర్ణం చేసుకొన్న మరుక్షణం నుంచి మరే కృషీ లేకుండా వాటిని అన్వయించగలమనీ అనుకోవడం చాలా తరచుగా సంభవిస్తోంది. కాగా యిటీవలి "మార్క్సిస్టులను" సైతం నేనీ ఆరోపణ నుంచి మినహాయించలేను. ఎందుకంటే యీ విషయంలో కూడా చాలా గందరగోళం సృష్టించబడింది.



# ప్రకృతిలో గతితర్కం - నేటి సైన్స్ నిర్వచనం

ఎంగెల్స్ రచనల పరిచయం

మర్ల విజయ కుమార్



1883లో ఫ్రెడరిక్ ఎంగెల్స్ అసంపూర్ణ రచన, "ప్రకృతిలో గతితర్కం" తొలిసారిగా ప్రచురితమైంది. తన కాలంనాటి విజ్ఞాన శాస్త్రాన్ని సమీక్షించి ఆయన ప్రకృతిలోని ప్రతీ ఘటన, ప్రతీ చర్య గతి తార్కికమైన పరస్పర విరుద్ధ శక్తుల ఘర్షణ, ఐక్యత ద్వారా జరుగుతాయని నిరూపించాడు. ఆయన తన కాలానికి ఎంతో ముందుగా ప్రకృతిలోని ఏ చర్య ఏక కారణ జనితం కాదని, అనేక విరుద్ధ శక్తుల ఫలితమేనని చెప్పాడు. ఆ తరువాత 70 ఏళ్ళకి గందరగోళ సిద్ధాంతం (Chaos Theory)ను అభివృద్ధి చేసి అతి సంక్లిష్టమైన సమస్యలను కంప్యూటర్ల సహాయంతో ఛేధించగలుగుతున్నారు. ఇప్పుడు, విజ్ఞాన శాస్త్రం బ్రహ్మాండమైన అభివృద్ధిని సాధించిన సమయంలో మనం ఆయన కనుగొన్న తార్కిక మూల సూత్రాల ఆధారంగా ప్రకృతిలోని ఘటనలను నేటి సైన్స్‌తో అర్థం చేసుకోవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.




### విశ్వం - కాలం - పదార్థం

భూమిపై జీవం పుట్టినప్పటి నుండీ, ఈ విశ్వం గురించిన ఆలోచనలు మానవునితోనే ప్రారంభం అయ్యాయి. ఈ విశ్వం ఎప్పుడు, ఎలా, ఎందుకు ప్రారంభం అయ్యిందీ అనే ప్రశ్నకు 20వ శతాబ్దం వరకూ మతం పరిధిలోనే ఎవరికి తోచిన సమాధానం వారు వెతుక్కున్నారు. 20వ శతాబ్దంలోనే శాస్త్రవిజ్ఞాన ప్రాతిపదికన ఈ ప్రశ్నలకు సమాధానం వెతకటం మొదలైంది. కాలానికీ, పదార్థానికీ శక్తితో ఉన్న సంబంధాన్ని ఐన్‌స్టీన్ తన ప్రఖ్యాత $E=MC^2$ సూత్రంతో వివరించటంతో, విశ్వం గురించిన మన అవగాహనలో విప్లవాత్మకమైన మార్పు వచ్చింది. అయితే, గత వంద ఏళ్ళలో ఐన్‌స్టీన్‌తో సమకాలీనంగా క్వాంటం మెకానిక్స్ అభివృద్ధి కావటంతో, పరమాణువుల సూక్ష్మ ప్రపంచం గురించిన మనకు మొదటిసారిగా అవగాహన ఏర్పడింది. క్వాంటం మెకానిక్స్ రంగంలో పదార్థం అంటే ఏమిటి అనే ప్రశ్న గత వంద ఏళ్ళలో ఒక తేలని చిక్కు ప్రశ్నగా మిగిలి పోయింది. ఎందుకంటే, ఒక ఎలెక్ట్రాన్ మనం పరిశోధించినప్పుడు ఒకసారి తరంగ లక్షణాలనూ, మరొకసారి పదార్థ లక్షణాలనూ ప్రదర్శిస్తోంటే, నీల్స్‌భోర్, హైసెన్‌బర్గ్ వంటి శాస్త్రజ్ఞులు పదార్థాన్ని నిర్వచించటానికి భావవాద పరిధిలో సమాధానం వెతుక్కోవటంతో భౌతిక శాస్త్రంలో ఒక పెద్ద సంక్షోభం ప్రారంభం అయ్యింది. ఐన్‌స్టీన్, ష్రోడింగర్ మొదలుగా అనేక మంది శాస్త్రజ్ఞులు, పదార్థం మన పరిశీలన వలన తన లక్షణాలను మార్చుకోదనీ, అటువంటి ప్రతిపాదన శాస్త్రవిరుద్ధమనీ, మనం గమనించినా, లేకున్నా, పదార్థం మన కంటే చాలా ముందుగానే ఉన్నదనీ, మానవ జాతి అంతమైన పోయినా, పదార్థం ఉనికిలో మార్పు ఉండదని వాదించారు. ఐన్‌స్టీన్ మాటల్లో, "పదార్థం యొక్క లక్షణాలను వివరించటంలో మనకు గందరగోళం ఉందంటే, దానర్థం, పదార్థ లక్షణాలలో గందరగోళం ఉన్నట్లు కాదు. మనకు ఇంకా అవగాహన కాని మరికొన్ని లక్షణాలు పదార్థానికి ఉన్నాయని మనం అర్థం చేసుకోవాలి."

విశ్వం ఏర్పడిన తొలి అపర క్షణాలలో (దీనినే ప్లాంక్ కాలం అంటారు. ఇది ఒక సెకనులో కోటి, కోటి, కోటి, కోటి, కోటి, కోటి, కోటి, కోటవ వంతు) కాలంలో, 'నాస్తి' నుండి తొలి పదార్థం ఉద్భవించిందని శాస్త్రజ్ఞులు ప్రతిపాదన చేస్తున్నారు. ఇక్కడ 'నాస్తి' అంటే శూన్యం కాదు. "ఏమీ లేకపోవటం" అని మనం అర్థం చెప్పుకోవాలి. ఇప్పటి భౌతిక విజ్ఞాన శాస్త్రం చెప్పేదేమిటంటే, శూన్యంలో అపారమైన శక్తి ఉండి, అనేక పరమాణువులు అపర క్షణాలలో ఉద్భవించి, మాయం అయిపోతుంటాయి. ఈ శూన్యం గతితార్కిక లక్షణాలను కలిగి ఉంటుంది. ఎప్పుడైతే ఒక (+) పరమాణువు ఏర్పడుతుందో, దానితోపాటే ఒక (−) పరమాణువు కూడా ఉంటుంది. ఈ రెండు విరుద్ధ పరమాణువులకీ మధ్యన గతితార్కికమైన పరస్పర విరుద్ధ సంబంధం ఉంటుంది (డైలెక్టికల్ కాంట్రడిక్షన్). ఈ కారణంగానే,

పుట్టిన వెంటనే, ఈ రెండు పరస్పర విరుద్ధ పరమాణువులు, ఒకదానితో ఒకటి ఢీకొని, నాశనం అయిపోతాయి. ఈ ప్రక్రియ అనునిత్యం విశ్వంలో జరుగుతూంటుంది. అయితే, విశ్వం ఏర్పడిన తొలి దశలో, ప్లాంక్ కాల పరిధిలో, గురుత్వ శక్తి ఆకర్షక శక్తిగా కాకుండా, వికర్షక శక్తిగా పనిచేయటం వలన, ఈ విరుద్ధ పరమాణువులు, వినాశనం కాకుండా మిగిలి ఉన్నాయి. అయితే, ప్లాంక్ కాల పరిధి దాటిన తరువాత, గురుత్వ శక్తి తిరిగి ఆకర్షక శక్తిగా పనిచేయటంతో, (+), (– ) పరమాణువుల పరస్పర వినాశనం జరిగింది. అయితే, మనకు ఇప్పటికీ అర్థం కాని ఒక ప్రక్రియ వలన, (–) పరమాణువుల కంటే, (+) పరమాణువులు అతికొద్దిగా ఎక్కువగా ఉండటం వలన, చివరికి, ఈనాటి విశ్వం ఈ మిగిలిన పదార్థంతో ఏర్పడి ఉండవచ్చునని శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. ఈ పరస్పర విరుద్ధపరమాణువులనే, మేటర్, యాంటీ మేటర్ అని పిలుస్తారు.

ఒక అణువులో 99.999999..% ఖాళీ ప్రదేశం ఉంటుంది. మరి అణువులు దూదిపింజల్లా అంత ఖాళీ ప్రదేశంతో ఉన్నప్పుడు, అవి మనకు ఘన పదార్థాలుగా ఎందుకు అగుపిస్తాయి? ఒక ఇనుపముక్కకు అంత గట్టితనం ఎక్కడ నుంచి వచ్చింది? ప్రఖ్యాత భౌతిక శాస్త్రజ్ఞుడు ష్రోడింగర్ మాటల్లో చెప్పాలంటే, పదార్థాన్ని ఆయన "షౌ కొమ్మెన్" అనే జర్మన్ పదంతో నిర్వచించాడు. అంటే, మనకు అగుపించేది దాని నిజమైన లక్షణం కాదు అని అర్థం. ఎందుకంటే, ఒక ఎలెక్ట్రాన్‌ను గాని తీసుకుంటే, దానికి ఒక స్థానం అంటూ లేదు. అది ఫలానా స్థలంలో ఈ క్షణంలో ఉండటానికి అనేక అవకాశాలు ఉన్నాయి అని, మనం దాని ఉనికి గమనిస్తే, దాని అవకాశాలలో ఒకదానిని మాత్రమే మనం గుర్తించగలిగామనీ అర్థం. నిజానికి, పదార్థం అంటే, ఒక రాళ్ళగుట్ట వంటిది కాదు. ఎలెక్ట్రాన్ ఒక బంతి వంటిదికాదు. అది ఒక శక్తిక్షేత్రం. ఒక క్షణంలో, ఈ శక్తి క్షేత్రం యొక్క శక్తి కేంద్రం ఎక్కడ ఉన్నట్లుగా మనకు నిర్ధారణ అవుతుందో, అక్కడ ఆ ఎలెక్ట్రాన్ ఉండే అవకాశాలు ఎక్కువ అని మాత్రమే మనం చెప్పుకోగలము. ఈ శక్తిక్షేత్రాల బలాన్ని బట్టి, ఇనుపముక్క గట్టిగా ఉన్నట్లుగానూ, దూదిపింజ మెత్తగా ఉన్నట్లుగానూ మనకు అనిపిస్తుంది. ఈ పదార్థ శక్తిక్షేత్రాల మధ్యన జరిగే ప్రక్రియల ఆధారంగా, రసాయన, విద్యుత్ లక్షణాలు ఆధారపడి ఉంటాయి. కార్బన్ అణువులు, ఆక్సిజన్ అణువులతో సంయోగం చెందటానికి, ఈ శక్తిక్షేత్రాల మధ్యన జరిగే చర్యలేనని మనకు అర్థం అవుతోంది. ఈ పదార్థ లక్షణాలకు, మన పరిశీలనకీ ఏ విధమైన సంబంధం లేదు. మానవుడు ఉద్భవించటానికి వందల కోట్ల సంవత్సరాలకి ముందు నుండే పదార్థ లక్షణాలు ఏర్పడి ఉన్నాయి.




ఇక కాలం విషయానికి వస్తే, మనం నిత్యజీవితంలో, కాలాన్ని సంఘటనల గొలుసుకట్టుగా భావిస్తుంటాము. నిర్విరామంగా ముందుకు సాగిపోయేది కాలం. ఇక్కడ 'ముందుకు' అనే పదానికి వాడుకలో ఉన్న అర్థం, గడచిన ఘటనల నుండి, ప్రస్తుత ఘటనలకు, అక్కడ నుండి భవిష్యత్తుకూ గమనం అని మనం సాధారణంగా అర్థం చెప్పుకుంటాము. కానీ భౌతిక శాస్త్రంలో, అవ్యవస్థ నుండి వ్యవస్థకు జరిగే పరిణామంగా కాలాన్ని గుర్తిస్తారు. ఉదాహరణకు, ఒక టీ కప్పు జారి క్రింద పడిపోతే అది ముక్కలవుతుంది. కానీ మనం ఎప్పుడూ కప్పు ముక్కలు, ఒక చోటచేరి కప్పుగా ఏర్పడటం చూడము. ప్రకృతిలో విడివిడిగా ఉన్న పదార్థాలను, శక్తిని ఖర్చుపెట్టి, ఒక వస్తువుగా తయారు చెయ్యటం ద్వారా మనం అంతకు ముందు ఉన్న సమతుల్యాన్ని ఛేదించి, ఒక వస్తువును తయారుచెయ్యటంతో, అవ్యవస్థ ఏర్పడుతుంది. ఉదాహరణకు, ఒక 10 ఎకరాల భూమిలో, అప్పటి వరకూ ఉన్న తుప్పలనూ, గుట్టలనూ చదునుచేసి, చక్కటి దారులని, ఒక కొలనును ఏర్పాటుచేసి, అందమైన పూలమొక్కలను పాతి, ఒక ఉద్యానవనాన్ని తయారు చేశామే అనుకోండి. ఆ ఉద్యానవనాన్ని తయారుచేయటానికి, దానిని అదే స్థితిలో ఉంచటానికి మనం నిత్యం శక్తిని ఖర్చు పెట్టవలసి ఉంటుంది. కాని కరువుకాటకాలవలననో, యుద్ధం, అంటువ్యాధుల వంటి వైపరీత్యాల కారణంగానో, ఆ ఊరిని ప్రజలు విడిచిపెట్టి వలస వెళ్ళిపోయి, కొన్ని సంవత్సరాల తరువాత తిరిగి వచ్చారనుకోండి. ఆ ఉద్యానవనం మళ్ళీ యధాస్థితికి చేరుకుని, బీడుభూమిగా మారిపోయి ఉంటుంది. అంటే వ్యవస్థ ప్రకృతి సిద్ధమైనది, అవ్యవస్థ తాత్కాలికమైనది. ఈ వ్యవస్థ నుండి అవ్యవస్థకు, తిరిగి వ్యవస్థకు ప్రస్థానాన్ని కాల గమనంగా భౌతిక శాస్త్రంలో గుర్తిస్తారు. అలాగే ప్రకృతిలోని పదార్థాల నుండి ఒక జీవి ఉద్భవించటం వ్యవస్థ నుండి అవ్యవస్థకు మార్పు. అయితే, ఈ మార్పు తాత్కాలికం మాత్రమే. జీవి మరణంతో, తిరిగి జీవ పదార్థాలు నిర్జీవ పదార్థాలుగా మారి ప్రకృతిలో కలిసిపోవటం సహజపరమైన వ్యవస్థ. కాల గమనంలో, ముందు, వెనుక, గతం, భవిష్యత్తు అనేవి మన సౌకర్యం కోసం ఏర్పాటుచేసుకున్న భావనలు. నిజానికి, భౌతిక శాస్త్రంలో గతానికి, భవిష్యత్తుకూ ఏమీ తేడాలేదు. ఆ కారణంగానే, ఒక అపర క్షణంలో మహావ్యాకోచానికి గురైనట్లుగా (బిగ్ బ్యాంగ్) చెప్పబడుతున్న ఈ విశ్వం, ఒకదశ తరువాత మళ్ళీ కుంచించుకుపోయే అవకాశాలు ఉన్నాయి.




అప్పుడు గడిచిపోయిన ఘటనలన్నీ తిరిగి వ్యతిరేక పథంలో (అంటే, పెద్ద వృక్షం చిన్నదయి, తిరిగి విత్తనంగా మారిపోవటం, జీవి ముసలితనం నుండి యవ్వనానికి, తరువాత బాల్యానికీ, చివరిగా అండదశకు మారటం వంటి ప్రక్రియల వంటివి) జరిగే అవకాశం ఉంటుందా అంటే, సైన్స్ లేదని చెప్తోంది. ఈ వ్యవస్థ నుండి అవ్యవస్థకూ, తిరిగి, వ్యవస్థకూ ప్రయాణమే మనం కాలగమనంగా గుర్తించాలి.

ఇక మన నిత్యజీవితంలో ఇక్కడ, అక్కడ, దూరం అనే పదాలకు మన అవసర నిమిత్తం కొన్ని భావనలను ఏర్పాటు చేసుకున్నాము. మనం నివసించే ఈ నాలుగు డైమన్షన్ల విశ్వంలో (మూడు స్థల డైమన్షన్లు, ఒక కాల డైమన్షన్) రెండు వస్తువుల మధ్యన దూరాన్ని ఖచ్చితంగా వాటి స్థానాలను బట్టి మనం నిర్ధారించగలుగుతాము. కాని మనం జీవితాంతం ఈ నాలుగు డైమన్షన్ల ప్రపంచం దాటి బయటకు చూడలేము. నిజానికి మన విశ్వం అధిక డైమన్షన్లు గలిగిన మరొక మహావిశ్వంలో ఒక చిన్న తునక అనుకుందాము. అప్పుడు, ఆ అధిక డైమన్షన్ ప్రపంచంలో బ్రతికే జీవులకు, మనకు తెలిసిన దూరాలు లెక్కలోకి రావు. ఉదాహరణకు, ఒక కాగితంపై, రెండు డైమన్షన్లలో ఒక జీవి ఉన్నాడనుకోండి. అతడికి మూడవ డైమన్షన్ అయిన మందం అనేది ఏవిధంగానూ అవగాహన అయ్యే అవకాశం లేదు. కాని మనం ఆ కాగితాన్ని కాని మడిస్తే, ఆ జీవికి తెలిసిన దూరం కుంచించుకుపోతుంది. అదేవిధంగా, అధిక డైమన్షన్ల ప్రపంచంలో, మనకు కోట్ల కోట్ల కోట్ల కిలోమీటర్ల దూరంలో ఉన్నట్లుగా అగుపించే తారలు, నిజానికి మనకు అతిదగ్గరగా ఉండి ఉండ వచ్చును. అంటే మనకు అగుపించే ఈ విశ్వ రూపం, అధిక డైమన్షన్లలో వేరొక రూపం, లక్షణాలు సంతరించు కోవచ్చును. ఈ మన విశ్వం మరొక మహావిశ్వంలో ఒక చిన్న తునక అనే ప్రతిపాదన భౌతిక శాస్త్రంలో క్వాంటం మెకానిక్స్‌లో ఉద్భవించిన తేలని చిక్కుప్రశ్నలకు సమాధానం వెతుక్కోవటంతో ప్రారంభం అయింది. అయితే, ఇప్పటికిప్పుడు, మనం మరొక పెద్ద మహా విశ్వంలో భాగమా అనే ప్రశ్నకు రుజువు లభించదు కానీ, మన గణిత శాస్త్ర పరిధిలో మాత్రం అటువంటి అవకాశం ఉందని తెలుస్తోంది.

ఇక ఆఖరి, అతిప్రధానమైన, "ఈ విశ్వం ఎందుకు ఉద్భవించిందనే" ప్రశ్నకు సైన్స్ ఏమని సమాధానం చెప్తోంది? ఈ విశ్వం ఎప్పుడు, ఎలా ఏర్పడిందనే ప్రశ్నకు భౌతిక శాస్త్ర పరిధిలో చక్కటి పొందికైన వివరణలు ఇవ్వబడ్డాయి. 'పొందికైన' అంటే, శాస్త్రపరిశోధన ఆధారంగా, మనకు తెలిసిన భౌతిక సూత్రాల పరిధిలో అని మనం అర్థం చెప్పుకోవచ్చును. ఒక మహావిశ్వపు నురుగులో, అనేక బుడగలవలే విశ్వాలు పుట్టుకొస్తూంటాయి. వాటిలో అతికొద్దిమాత్రమే మహావ్యాకోచానికి గురయి, మన విశ్వం వలనే ఏర్పడవచ్చును. ఈ విశ్వాలు ఏర్పడటానికి ఏ అతీత శక్తి నిర్ణయం అవసరం లేదనే విషయాన్ని భౌతిక శాస్త్రం నేడు ఖచ్చితంగా నిర్ధారణ చెయ్యగలిగింది. ఈ విశ్వం "స్వయంభు" అని, దీనికి ఒక సృష్టికర్త ఉన్నాడని చెప్తే, ఆ సృష్టికర్తను ఎవరు సృష్టించారనే అంతుతేలని ప్రశ్నలు ఉదయిస్తాయని శాస్త్రజ్ఞులు నేడు చెప్తున్నారు. అయితే మరి, ఒక మహావిశ్వపు నురగనుండి మన విశ్వం ఉద్భవించిందంటే, ఆ మహా విశ్వం ఎక్కడ నుండి వచ్చింది అనే ప్రశ్న తలెత్తుతుంది. ఈ ప్రశ్నకు సమాధానం చెప్పాలంటే, మనం గతితార్కిక భౌతికవాద పరిధిలో సమాధానం వెతుక్కోవలసి ఉంటుంది. నాస్తి నుండి పరస్పర విరుద్ధలక్షణాలు గలిగిన మేటర్, ఏంటీ మేటర్ పుట్టుక రావచ్చని, ఇది అనునిత్యం జరిగే ప్రక్రియ అని నేడు సైన్స్ నిర్ధారించిన ప్రాతిపదికగా, ఈ విశ్వం తనంతట తానుగా ఉద్భవించగలదని (స్వయంభు), ప్రఖ్యాత భౌతిక శాస్త్రజ్ఞులైన స్టీఫెన్ హాకింగ్, స్టీవెన్ వైన్బర్గ్, లారెన్స్ క్రాస్ వంటి వారు నేడు చెప్పగలుగుతున్నారు. సాధారణంగా అంతగా చదువుకోని వారు ఈ విశ్వంలోనూ, మన జీవితాలలోని ప్రతీఘటననూ భగవంతుడు నియంత్రిస్తాడని నమ్మితే, విద్యాధికులు, ఈ భావన పరిధిని దాటకుండా, ఏదో ఒక అతీత శక్తి లేనిదే ఈ విశ్వం ఎట్లా సృష్టించబడిందని ప్రశ్నిస్తుంటారు. ఈ విశ్వాన్ని నడిపించటంలోనే కాక, దీనిని సృష్టించటంలో కూడా ఏ సృష్టికర్తకూ పాత్ర లేదని స్టీఫెన్ హాకింగ్ ప్రకటించాడు. ఒకనాడు ఈ విశ్వం ఎందుకు సృష్టించబడిందనే ప్రశ్న ఆధ్యాత్మిక పరిధిలోనే ఉంటే, నేడు నూతన విజ్ఞాన శాస్త్రం, భౌతిక సూత్రాల పరిధిలో, గతితార్కిక సూత్రాల ఆధారంగా సశాస్త్రీయమైన సమాధానం ఇవ్వగలుగుతోంది. అయితే, ఇదే ఆఖరు సమాధానం అని మనం ఘంటాపధంగా చెప్పలేము. కాలం గడచిన కొద్దీ, రాబోయే తరాలు మరి కొన్ని నూతన శాస్త్రీయ భావనల ఆధారంగా, ఈ విశ్వం గురించిన మౌలికమైన ప్రశ్నలకు కొత్త సమాధానాలు కనుగొనవచ్చును. ఇంకా తేలని చిక్కు ప్రశ్నలు అనేకం ఉన్నాయి. ఈ మొత్తం విశ్వంలో, మనకు దృగ్గోచరమయ్యే పదార్థం, మొత్తం విశ్వం

యొక్క ద్రవ్యరాశిలో 5% మాత్రమే. మిగతా 95%లో, 25% చీకటి పదార్థంగానూ, 70% చీకటీ శక్తిగానూ ఉండవచ్చునని శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. ఈ చీకటిపదార్థ, చీకటి శక్తుల లక్షణాలు మనకు ఇప్పటివరకూ అవగాహన కాలేదు. వాటి ప్రభావాన్ని మాత్రమే మనం గమనించగలుగుతున్నాము. కాలం గడచిన కొద్దీ, రాబోయే తరాలు మరి కొన్ని నూతన శాస్త్రీయ భావనల ఆధారంగా, ఈ విశ్వం గురించిన మౌలికమైన ప్రశ్నలకు కొత్త సమాధానాలు కనుగొనవచ్చును. ఐన్‌స్టీన్ చెప్పినట్లుగా, పదార్థం యొక్క లక్షణాలు మనకు ఇంకా అవగాహన కాలేదు. ఈ పదార్థ రహస్యాన్ని ఛేదించినకొద్దీ, మన భౌతిక శాస్త్ర పునాదులలోనే సమూలమైన, మౌలిక మార్పులు సంభవించవచ్చును. ఇది ప్రగతికి ప్రాధమిక సూత్రం.

**భౌతిక వాస్తవికత**

మన చుట్టూ ఉండే ఈ భౌతిక ప్రపంచం, నిత్య చలనంలో ఉండి, అనునిత్యం మార్పుకు లోనవుతున్న పదార్థంతో ఏర్పడిందని గతితార్కిక భౌతిక వాదం వివరిస్తుంది. చలనం, మార్పు అనేవి పదార్థం యొక్క మూల లక్షణాలు కావటం మూలాన, పదార్థ నిర్మితమైన ఈ విశ్వం నిత్యం మార్పునకు లోనవుతుంటుంది. ఇదే సూత్రం జీవులకు, మానవ సమాజానికి కూడా వర్తిస్తుంది. ఎందుకంటే, ఇవి కూడా పదార్థ నిర్మితాలే. అట్లానే, మానవుని మేధస్సు, ఆలోచనలు పదార్థం నుండి ఉద్భవించినవే. ఆ కారణం చేత, సమాజానికి అతీతంగా, ఈ ప్రపంచంతో సంబంధం లేని ఏ ఆలోచనలూ ఉద్భవించలేవు. అందుచేత, చైతన్యమనేది, జీవుల భౌతిక లక్షణమని, జీవి ఉన్నంతకాలం, తన చుట్టూ ఉన్న పరిసరాలకు స్పందిస్తూన్నంతకాలం మాత్రమే జీవి యొక్క చైతన్యానికి అస్థిత్వం ఉంటుందని, జీవి మరణించిన తరువాత, ఆత్మ అనేది ఉండదని భౌతిక వాదం చెప్తుంది. దీనినే నేటి సైన్స్ నిర్ధారించింది. మానవుని ఉనికితో, అతని ఆలోచనలకు అతీతంగా ఉండి, మానవునితో సహా, ఈ సర్వ విశ్వం అంతా నిండి ఉండేదే పదార్థమని, అది భౌతిక వాస్తవికత అని లెనిన్ వివరించారు. అట్లానే మన పరిశీలన ద్వారా నిర్ధారణ కాజాలని




విషయాలను భగవంతుని లీలలుగా భావవాదం వివరణ ఇచ్చి, సమస్యను తప్పుదారి పట్టిస్తుంది. ఈ విశ్వంలోని వస్తువుల యొక్క అంతర్గత లక్షణాలు, వాటి బాహ్య రూపం ఒకటే అయితే, సైన్స్ అవసరమే లేదని కార్ల్‌మార్క్స్ చెప్పారు. అంటే, ఈ భౌతిక ప్రపంచంలోని వస్తువుల, బయటకు కనిపించని అంతర్గత లక్షణాలను వెలికి తీసి విశ్లేషించటమే సైన్స్ యొక్క బాధ్యత అని అర్థం. ఉదాహరణకు, పరమాణువుల లక్షణాలు, మన కంటికి కనిపించే పెద్దవస్తువుల లక్షణాలకు భిన్నంగా ఉండటాన్ని క్వాంటం మెకానిక్స్ వివరిస్తుంది. ఈ భౌతిక ప్రపంచంలో మనకు కనిపించే పెద్ద వస్తువులు (ఉదా: సూర్యుడు, తారలు) ప్రదర్శించే లక్షణాలకు, సూక్ష్మ ప్రపంచంలో పరమాణువుల (ఎలక్ట్రాన్లు, ప్రోటాన్లు మొ.వి.) లక్షణాలను విశదీకరించి, ఈరెంటి మధ్యన సారూప్యాన్ని సాధించటానికి నేడు సైన్స్ కృషి చేస్తోంది. అయితే అనంతకోటి నక్షత్రాలతో నిండి లక్షల కోట్ల కాంతి సంవత్సరాల (ఒక కాంతిరేఖ సెకనుకు 3 లక్షల కిలోమీటర్ల వేగంతో ఒక ఏడాది పాటు ప్రయాణించే దూరం) దూరానికి విస్తరించిన ఈ మహావిశ్వాన్ని సంపూర్ణంగా నిర్వచించటం నేటి సైన్స్‌కు సాధ్యం కాకపోవచ్చును. మానవ జాతి చరిత్రలో వైజ్ఞానిక యుగం ప్రారంభం అయి నాలుగు వందల సంవత్సరాలు కూడా కాలేదు. కాని ఇంత తక్కువ కాలంలో మనం ఈ విశ్వాన్ని అర్థం చేసుకోవటంలో ఎంతో ప్రగతి సాధించాము. రాబోయే కాలంలో మరిన్ని గొప్ప ఆవిష్కరణలు జరగవచ్చును. లెనిన్ చెప్పినట్లుగా, పరమ సత్యం అనేది మనకు ఎన్నడూ సంపూర్ణంగా అవగతం కాదు. తరాలు గడిచిన కొద్దీ, దానివైపు అంగుళం, అంగుళం దగ్గరకు జరిగినా, అది ఇంకా సుదూరంలోనే ఉంటుంది. అది సంపూర్ణంగా అవగాహన కాలేదు కనుక, దానిని పరమేశ్వరుని సృష్టి అని చెప్పి, అన్వేషణ చేయకపోవటం పలాయన వాదం, భావ వాదం అవుతుంది. సత్యశోధన మానవుని ఉనికికి కారణాలను తెలుసుకోవటానికి అత్యవసరం. మానవజాతి ఈ కృషిని కొనసాగిస్తూనే ఉంటుంది. ❑

**జ్ఞానానికీ, శాస్త్ర జ్ఞానానికీ సంబంధించినంత**
**వరకూ మనిషి భౌతికవాదిగానే ఉంటాడు.**
**విజ్ఞాన శాస్త్రానికి ఆవల, తనకు ఏమీ తెలియని**
**రంగాల విషయంలో మాత్రం మనిషి తన అజ్ఞానాన్ని**
**గ్రీకు భాషలోకి అనువదించుకుని,**
**దానికే 'అజ్ఞేయవాదం' అనే ముద్దుపేరు పెట్టుకుంటాడు.**
*- ఎంగెల్స్*

**లోకం గురించిన ప్రతి ఒక్క భావచిత్రమూ**
**కొన్ని పరిమితుల్లోనే రూపుదిద్దుకుని, అందులోనే**
**ఉండిపోతుంది. అది అలా జరగడానికి, ఆయా చారిత్రక**
**పరిస్థితులు వస్తునిష్టమయిన కారణాలు కాగా,**
**ఆ వ్యక్తి శారీరక - మానసిక ధర్మాలు**
**వ్యక్తినిష్టమయిన కారణాలవుతాయి.**
*- ఎంగెల్స్*



# ఎంగెల్స్ "కుటుంబం..." ప్రాసంగికత




ఆర్వీ రామారావు

మానవ జాతి చరిత్ర గమనాన్ని శాస్త్రీయ పద్ధతిలో అర్థం చేసుకుని దోపిడీవ్యవస్థను సమూలంగా నాశనం చేయడానికి కార్ల్ మార్క్స్, ఫ్రెడరిక్ ఎంగెల్స్ కలిసే సమాజ పరిణామానికి కావలసిన దివిటీ వెలిగించినా ఆ సిద్ధాంతాన్ని మార్క్సిజం అని మాత్రమే పిలుస్తున్నాం. మార్క్స్-ఎంగెల్స్ ఇద్దరు భిన్న వ్యక్తుల పేర్లే అయినా వారి ఆత్మలు ఒక్కటే. ఆలోచనా స్రవంతి అంతా ఒకే ధార. వాళ్లను, వాళ్లు ప్రవచించిన సిద్ధాంతాన్ని విడదీసి చూడడం కుదరదు. ఎంగెల్స్ పేరు ఎక్కడా ఈ సిద్ధాంతం గురించి చెప్పేటప్పుడు వినిపించదు. కానీ వారిద్దరూ శారీరకంగా మాత్రమే వేర్వేరు. ఆలోచనలో, సిద్ధాంతీకరణ అంశంలో అభిన్నమైన వారు. వీరిద్దరి కృషి పరస్పర పూరకమే కానీ విడదీసి చూడదగింది కాదు. అలా చూడడం ఇద్దరికీ అపచారమే. ఎంగెల్స్ తద్దినం పెట్టే వాడికి తమ్ముడూ కాదు. తోడ పెళ్లి కొడుకు అంతకన్నా కాదు. వారిద్దరూ కలిసే కమ్యూనిస్టు మేనిఫెస్టో రాశారు. అనేక గ్రంథాలు జమిలిగానే రాశారు. విడివిడిగా కూడా రాశారు. మానవ జాతి చరిత్రను కొత్త మలుపు తిప్పడానికి నిరంతరం వీరిద్దరూ కలిసే పాటుబడ్డా మార్క్స్ రచనలను వెలికి తీసుకురావడానికి, ఆర్థికంగా మార్క్స్‌కు సహాయ పడడానికి ఎంగెల్స్ చేసిన ప్రయత్నం సామాన్యమైంది కాదు.




అయినా ఎంగెల్స్ కొనసాగించిన అధ్యయనం, రచన వ్యాసంగం విడిగా కూడా అపారమైందే. 1883 మార్చి 14న కార్ల్ మార్క్స్ మరణించిన తరవాత దాదాపు పుష్కర కాలానికి, 1895 ఆగస్టు 5న ఎంగెల్స్ మరణించాడు. ఆ పన్నెండేళ్లు ఎంగెల్స్ మార్క్సిజాన్ని పరిపుష్టం చేయడానికి నిరంతరం కృషి చేశాడు.

మార్క్స్ మరణించిన మరుసటి సంవత్సరం ఏప్రిల్‌లో మొదలెట్టి మే 26 నాటికి ఎంగెల్స్ "ది ఆరిజిన్ ఆఫ్ ఫామిలీ, స్టేట్ అండ్ ప్రైవేట్ ప్రాపర్టీ (కుటుంబం, రాజ్యం, సొంత ఆస్తి)" గ్రంథాన్ని పూర్తి చేశారు. అమెరికా నృ శాస్త్రవేత్త 1877లో వెలువరించిన "ఏన్షియంట్ సొసైటీ" మార్క్స్, ఎంగెల్స్ ఇద్దరినీ బాగా ఆకర్షించింది. మార్క్స్ ఈ గ్రంథం మీద చాలా నోట్స్ రాసి పెట్టుకున్నాడు. బహుశా ఆయన ఒక గ్రంథమే రాయాలను కున్నాడేమో. కానీ రాయలేకపోయారు. మార్క్స్ రాయాలనుకుని రాయలేకపోయిన గ్రంథాన్ని 1884లో ఎంగెల్స్ రాశారు. మోర్గాన్ "ఏన్షియంట్ సొసైటీ" ని చారిత్రక భౌతికవాద దృష్టితో చూడాలన్నది మార్క్స్ సంకల్పం. ఈ పని ఎంగెల్స్ పూర్తి చేశారు. ఎంగెల్స్ విడిగా రాసిన ఏడు గ్రంథాలలో ఇది విశిష్టమైంది. మానవ పరిణామక్రమాన్ని, కుటుంబ వ్యవస్థ, అందులో రాజ్యం, సొంత ఆస్తి మొదలైన అంశాలను ఎంగెల్స్ మార్క్స్‌తో కలిసి సిద్ధాంతీకరించిన దృక్కోణంతోనే ఎంగెల్స్ ఈ గ్రంథం రాశారు. "ఏన్షియంట్ సొసైటీ" పై మార్క్స్ నోట్స్ రాసి పెట్టుకున్నారని, చారిత్రక భౌతిక వాద దృక్పథంతో ఈ గ్రంథంపై మరో గ్రంథం రాయాలనుకున్నారని, ఆ పద్ధతిలోనే తాను "ది ఆరిజిన్ ఆఫ్ ఫామిలీ, స్టేట్ అండ్ ప్రైవేట్ ప్రాపర్టీ" గ్రంథాన్ని పూర్తి చేశానని ఎంగెల్స్ ఈ గ్రంథానికి రాసిన మొదటి ప్రచురణ పీఠికలో చెప్పుకున్నారు.

ఈ గ్రంథాన్ని జర్మనీలోనే ప్రచురించాలని ఎంగెల్స్ అనుకున్నా ఆ రోజుల్లో జర్మనీ చాన్సలర్ ఓట్టో వాన్ బిస్మార్క్ తీసుకొచ్చిన సోషలిస్టు వ్యతిరేక చట్టాల వల్ల వీలు కాలేదు. నిజానికి "ది ఆరిజిన్ ఆఫ్ ఫామిలీ, స్టేట్ అండ్ ప్రైవేట్ ప్రాపర్టీ" అన్న గ్రంథాన్ని బిస్మార్క్ నిషేధించలేరన్న భావన కూడా ఎంగెల్స్‌కు ఉండేదని 1884 ఏప్రిల్ 26న తన రాజకీయ సహచరుడు కార్ల్ కాట్స్కీ రాసిన లేఖలో పేర్కొన్నారు. చివరకు ఆ ప్రతిని జూరిచ్‌లో ఉన్న బెరన్‌స్టీన్‌కు పంపించారు. స్టుట్‌గార్ట్‌లో అది 1884 అక్టోబర్‌లో అచ్చయింది. ఆ తరవాత స్టుట్‌గార్ట్‌లోనే 1886, 1889లో రెండు పునర్ముద్రణలు వచ్చాయి.




ఈ గ్రంథం 1880లలో పోలిష్, రొమేనియన్, ఇటాలియన్, డేనిష్, సెర్బియన్ భాషల్లోకి అనువాదమైంది. 1891లో నాల్గవ ముద్రణ వచ్చే సరికి ఆ తరవాత నృశాస్త్రం, మానవజాతి శాస్త్రాల్లో అందుబాటులోకి వచ్చిన తాజా సమాచారాన్ని చేర్చి నాల్గవ ముద్రణ వెలువరించారు ఎంగెల్స్. 1902లో తప్ప ఇది ఇంగ్లీషులో వెలువడలేదు.

కుటుంబం, రాజ్యం, ప్రైవేటు ఆస్తి 20వ శతాబ్దంలో, 21వ శతాబ్దంలో అనేక భాషల్లో వెలువడింది. ఇది ఎంగెల్స్ మహత్తర కృషిగా భావిస్తారు. మార్క్స్ చారిత్రక భౌతిక వాదానికి, అదనపు విలువ సిద్ధాంతానికి, డార్విన్ జీవ పరిణామ వాదానికి ఎంత ప్రాధాన్యం ఉందో ఎంగెల్స్ పుస్తకానికి కూడా అంతే ప్రాముఖ్యత ఉంది.

మానవ జాతి చరిత్రలో మొదటి కుటుంబ వ్యవస్థ పితృస్వామిక వ్యవస్థలో ఉన్న న్యూక్లియర్ ఫామిలీ కాదని అది మాతృగణన కుటుంబం అని ఎంగెల్స్ తేల్చాడు. తండ్రి ఎవరో ఇదమిత్థంగా తెలియనప్పుడు తల్లి పేరనే సంతానాన్ని గుర్తించడం మాతృగణన కుటుంబ వ్యవస్థ లక్షణం. మనకు ఉన్న వైనతేయులు, కాద్రవేయులు లాంటి మాటలు ఈ పద్ధతికి అనుగుణమైనవే. వినుత సంతానం వైనతేయులు. కద్రువ సంతానం కాద్రవేయులు. మాతృ గణన సమాజంలో స్త్రీలు తమ తోటి స్త్రీల సంతానాన్ని కూడా తమ సంతానంగానే భావించేవారు. ఎందుకంటే వారు కలిసి పని చేసేవారు. కలిసి బతికేవారు. సహకరించని పురుషుల మీద చర్య తీసుకునే అవకాశం కూడా వారికి ఉండేది. పురుషుడు సహకరించకపోతే అతనికి ఎంత మంది పిల్లలున్నా, ఎంత వస్తు సామాగ్రి ఉన్నా అతణ్ని వెళ్లగొట్టగలిగే వారు. సాధారణంగా పురుషులు ధిక్కరించగలిగే వారు కాదు. ఆ వ్యవస్థలో మహిళే సర్వాధికారి. అవసరమైనప్పుడు పురుషుడి మెడలు వంచగలిగేది.

మహిళ ఒక పురుషుడిని పెళ్లాడిన తరవాత అతని కుటుంబంతో కలిసి నివసించే దశ వచ్చిన తరవాత సంతానాన్ని తండ్రి పేరుతో గుర్తించే సంప్రదాయం వచ్చింది. దీన్నే పాట్రీలీనియల్ వ్యవస్థ అంటారు. పాండు రాజు సంతతిని పాండవులు అని, కురు రాజు సంతానాన్ని కౌరవులు అనడం ఇందుకే. దీనితో కుటుంబంలో స్త్రీ లేదా తల్లి హోదా మారిపోయింది. ఉమ్మడి కుటుంబంలో స్త్రీకి ఉన్న ప్రాధాన్యం, ఆధిపత్యం తగ్గిపోయింది.

దీన్నే ఎంగెల్స్ "తల్లి హక్కు కోల్పోవడం" అన్నారు. ఈ పరిణామానికి ఎంగెల్స్ రాజకీయ ప్రభావాన్ని జోడించారు. ఈ మార్పే స్త్రీ జాతి ఓటమికి కారణం అన్నాడు. పశుపాలక సంస్కృతి లోకి సమాజం అడుగిడడం దీనికి కారణం అంటాడు. అయితే 20వ శతాబ్దంలోని కొందరు సామాజిక శాస్త్రవేత్తలు ఎంగెల్స్ చెప్పిన మాతృగణన సమాజం లేదని వాదించారు. 1970, 1980లలో స్త్రీవాదులు, సోషలిస్టులు ఎంగెల్స్ భావనను పునరుద్ధరించారు. ఇటీవలి కాలంలో పరిణామ జీవ శాస్త్రవేత్తలు, మానవ శిలాజాలను అధ్యయనం చేసేవారు, జన్యు శాస్త్రవేత్తలు ఎంగెల్స్ వాదనను బేరీజు వేసి, జన్యు శాస్త్రం ఆధారంగా ఆదిమ మానవ సంబంధాలు మాతృగణన వ్యవస్థ మీద ఆధారపడ్డవే అని తేల్చారు.

సమాజ పరిణామ క్రమాన్ని మొదట మోర్గాన్, ఆ తరవాత ఎంగెల్స్ శావేజి దశ, బర్బర దశ, నాగరిక దశ అని వింగడించారు. శావేజ్ అన్న మాటకు ఇప్పుడు ఆటవిక, క్రూర, అనాగరికలాంటి అర్థాలు ఉన్నాయి. బార్బరిజం అన్న మాట కూడా నిందార్థంలోనే వాడుకలో ఉంది. అయితే మోర్గాన్, ఎంగెల్స్ ఈ మాటలను నిందార్థంలో వాడలేదు. ఆ మాటలను ప్రతికూలార్థంలో వాడలేదు.

ఆదిమ కమ్యూనిస్టు సమాజంలో మాతృగణన తెగలలో స్త్రీలు అప్ప చెల్లెళ్లలాగే జీవించేవారు. నా అప్ప చెల్లెళ్ల సంతానం తమ సంతానం అనే భావించారు. కలిసి పని చేసేవారు. కలిసి బతికేవారు. ఇదీ మోర్గాన్, ఎంగెల్స్ అభిప్రాయం. మహిళల ఆధిపత్యమే కొనసాగేది. ఇంట్లో ఉండే వస్తు సమాగ్రి ఉమ్మడి సొత్తే. పురుషుడికి ఎంత మంది సంతానం ఉన్నా, ఎంత వస్తు సామాగ్రి ఉన్నా మహిళలకు సహకరించకపోతే పెట్టేబేడా సర్దుకుని బయటకు వెళ్లిపోవలసిందే.

ఎంగెల్స్ అంచనా ప్రకారం అన్యాక్రాంతం చేయదగిన ఆస్తి సమకూరిన తరవాతే మహిళలు మగవాడి ఇంట్లో కాపురం చేయవలసిన అగత్యం ఏర్పడింది. అదే పురుషుడి పేర సంతానాన్ని గుర్తించవలసిన స్థితికి దారి తీసింది. అయితే దీని పర్యవసానం ఏమిటంటే భార్య, తల్లి తమ మునుపటి ఆధిపత్య స్థానాన్ని కోల్పోయారు. ఇదే ఏక భర్తృకతకు, ఏకపత్నీవ్రతానికి దారి తీసింది. స్త్రీ మరుకూటానికి చెందింది అయిపోయింది. ఈ కొత్త జీవన విధానం మహిళ సర్వాధికారిగా ఉండే స్థితి కోల్పోవడానికి దారి తీసింది. ఇదే మహిళల చారిత్రక ఓటమి అంటాడు ఎంగెల్స్.

కుటుంబ అవతరణకు రక్త సంబంధీకుల మధ్య పెళ్లికి మొదటి దశ అంటాడు ఎంగెల్స్. ఇదే జంతుజాలం నుంచి




మనుషులను విడదీసింది. ఈ దశలో ఒక తరం వారు మరో తరం వారితో కలిసి జీవించడం, పెళ్లి చేసుకోవడం తప్పు (టాబూ) గా మారింది. అంటే తండ్రి కూతుర్ల మధ్య; నాయనమ్మ, అమ్మమ్మకు, మనవలకు, మనవరాళ్లకు మధ్య లైంగిక సంబంధం తప్పు అన్న భావన ఏర్పడింది. పితృస్వామిక కుటుంబాలు, మాతృస్వామిక కుటుంబాల మధ్య విభేదమే గోత్రాలు ఏర్పడడానికి దోహదం చేసింది.

రెండవ దశలో తోబుట్టువులు లేదా తోబుట్టువల వరస అయ్యే వారి మధ్య లైంగిక సంబంధాలు నిషేధం అన్న భావన కలిగింది. తెలుగు సంప్రదాయంలో ఉన్న మేనరికాలను అర్థం చేసుకోవడానికి ఈ సూత్రం ఉపకరిస్తుంది. మేనరికాలు తెలుగువారిలో ఉన్నంతగా ఇతర జాతుల్లో కనిపించవు. ఇక్కడా ఓ తేడా ఉంది. మేనమామ కూతురిని పెళ్లి చేసుకోవడం హక్కుగా భావించే సంప్రదాయం తెలుగు వారికి ఉంది. మేనత్త కూతురిని పెళ్లి చేసుకోవడం తప్పు అని వాదించే తెలుగు కుటుంబాలూ ఉన్నాయి. ఈ తేడా కోస్తా ఆంధ్ర, తెలంగాణ ప్రాంతంలో ఇప్పటికీ స్పష్టంగా గమనించవచ్చు. తెలంగాణాలో మేనత్త కూతురిని పెళ్లాడడం తప్పనుకోరు. దీనికి మహా ఇతిహాసమైన మహా భారతాన్ని సాక్ష్యంగా చూపుతారు కూడా. అర్జునుడు మేనత్త కూతురైన సుభద్రను పెళ్లి చేసుకోలేదా అని సమర్థించుకుంటారు. తెలుగు వారిలో, మరీ ముఖ్యంగా కోస్తా ప్రాంతంలో మేనమామనే పెళ్లి చేసుకునే సంప్రదాయం ఉంది. ఇది తెలంగాణాలో తక్కువ. సగోత్రీకుల మధ్య పెళ్లిళ్లను దేశమంతటా ఈసడిస్తారు.

ఆ తరవాత దంపతీ వివాహాల పద్ధతి వచ్చింది. అప్పుడు కూడా భర్తకు అనేక మంది భార్యలు ఉన్నా అసలు భార్య (పట్టపు రాణి) ఒక్కరే. పురుషుల్లో బహుభార్యాత్వం ఇప్పటికీ సక్రమంగానో, అక్రమంగానో కొనసాగుతూనే ఉంది. స్త్రీల విషయంలో మాత్రం బహుభర్తృత్వం నిషేధం. బహుభర్తృత్వ సంప్రదాయాన్ని కొనసాగిస్తున్న తెగలు మన దేశంలో ఇప్పటికీ ఉన్నాయి. ద్రౌపది బహుభర్తృత్వానికి ప్రతీక. ద్రౌపదిని పవిత్రమైందిగా భావించే మహాభారతంలోని గౌరవనీయమైన పాత్ర గనక మనకు తప్పనిపించడంలేదు. ఆచరణలో మాత్రం అనుమతించం. మహిళల విషయంలో బహుభర్తృత్వాన్ని అంగీకరించకపోవడానికి ప్రధాన కారణం సక్రమ సంతానం, అక్రమ సంతానం అన్న భావనే. మరీ పచ్చిగా చెప్పాలంటే సక్రమ సంతానానికే తండ్రి ఆస్తి మీద హక్కు అన్న అభిప్రాయం బలంగా ఉండడమే. ఈ కారణంగానే స్త్రీ పాతివ్రత్యానికి ఎక్కడ లేని పవిత్రత ఆపాదించడం. ఎంగెల్స్ దృష్టిలో ఆస్తి హక్కు కారణంగానే స్త్రీ పురుషుల మధ్య భేదం ప్రధానమైపోయింది.

మానవ విజ్ఞాన శాస్త్రంలో అమెరికా నృశాస్త్రవేత్త మోర్గాన్ పరిశోధన విప్లవాత్మకమైతే, ఆ గ్రంథం ఆధారంగా ఎంగెల్స్ రాసిన కుటుంబం, రాజ్యం, ప్రైవేటు ఆస్తి కుటుంబ వ్యవస్థ ఆనవాళ్లు, పరిణామక్రమం; అందులో రాజ్య వ్యవస్థ; ప్రైవేటు ఆస్తి పాత్రను విడమర్చడంలో చారిత్రక భౌతిక వాద సిద్ధాంత నిరంతరతను సార్థకం చేసింది. మోర్గాన్ ప్రాచీన సమాజాన్ని వింగడించడంలో భౌతికవాద దృక్పథాన్ని అనుసరించడానికి నలభై ఏళ్లకు ముందే మార్క్స్ చారిత్రక భౌతికవాద మూల సూత్రాలను కనిపెట్టారు. ఈ సూత్రాలే ఎంగెల్స్ రచనకు మూలాధారం. చరిత్రను భౌతికవాద దృష్టితో అర్థం చేసుకుంటే ఉత్పత్తి, పునరుత్పత్తి సంబంధాలే మానవజాతి మనుగడను, ప్రస్థాన క్రమాన్ని నిర్దేశించాయని రుజువు అవుతుంది. సామాజిక సంబంధాలను నిర్దేశించేది కూడా ఉత్పత్తి, పునరుత్పత్తి సంబంధాలే.

ప్రాచీన సమాజాల్లో స్త్రీపురుషుల మధ్య సమానత్వం ఉండేదని ఎంగెల్స్ అంటాడు. మాతృగణన సమాజాల్లో ఒక వ్యక్తి సంబంధాలు తల్లితోనూ, తల్లి సోదరుడితోనూ ముడివడి ఉండేవి. తన సోదరి సంతానం బాగోగులు చూడడం పురుషుడి ప్రధాన బాధ్యతగా ఉండేది. మన కుటుంబాల్లో మేనమామకు ఉన్న ప్రధాన్యాన్ని ఈ దృష్టితోనే అర్థం చేసుకోవాలి. అందుకే "తల్లి చచ్చినా మేనమామ ఉండాలి" అన్న సామెత పుట్టింది.

ఆదిమ మానవుడు కేవలం ఆహారాన్వేషణ మీదే ఆధారపడి బతికినప్పుడూ స్త్రీ పురుషుల శ్రమలో కచ్చితమైన శ్రమ విభజన ఉండేది. పురుషులు వేటకు వెళ్తే మహిళలు కందమూలాలు సేకరించే వారు. పిల్లల పెంపకం బాధ్యత నిర్వహించేవారు. ఇందులో పురుషుడు అధికం, స్త్రీ లోకువ అనే అంశం ఏమీ లేదు. ఆదిమ కాలంలో లైంగిక వ్యవహారాల్లో స్వైర విహారం ఉన్నందు వల్ల తల్లి నుంచి మాత్రమే సంతానాన్ని గుర్తించగలిగే అవకాశం ఉండేది. ఆ తరవాతే ప్రైవేటు ఆస్తికి అవకాశం వచ్చిన తరవాతే తండ్రి నుంచి సంతానాన్ని లెక్కించే పద్ధతి వచ్చింది. పది వేల ఏళ్ల కింద వ్యవసాయం సాధ్యమైనప్పుడు మానవ జాతి శావేజీ దశ నుంచి బర్బర దశలోకి అడుగుపెట్టింది.

వ్యవసాయం అభివృద్ధి చెందడం, జంతువులను మచ్చిక చేసుకోవడం, కొత్త ఉపకరణాలు కనిపెట్టడం, కుండలు తయారు చేయడం, నూలు వడకడం వల్ల స్త్రీలకు చాకిరీ కొంత తగ్గినా పంటల మీద వారి ఆధిపత్యం తగ్గడంతో పాటు వారి సామాజిక

స్థితి కూడా దిగజారింది. ఆదిమ కమ్యూనిస్టు సమాజం నుంచి క్రమంగా నాగరిక సమాజం ఏర్పడే దశకు చేరుకున్న తరవాత ప్రైవేటు ఆస్తి ప్రాధాన్యత పెరిగి పాత గణ జీవనం అంతమైంది. ప్రైవేటు ఆస్తి గణాధిపతుల చేతిలో కేంద్రీకృతం కావడం మొదలైంది. అదే పాలక వర్గాలు ఏర్పడడానికి దారి తీసింది. పశుపాలన, లోహశాస్త్రం, సేద్యం వల్ల సమాజంలో అదనపు ఉత్పత్తి పోగు పడడం సాధ్యమైంది.

బానిస సమాజం (ఇది మన దేశంలో దాదాపుగా లేదు), ఆ తరవాత ఫ్యూడలిజం, ఆ తరవాత పెట్టుబడిదారీ విధానం అవతరణతో దోపిడీ రూపాలూ మారాయి. ఇది మహిళలు ఇంటికే పరిమితమయ్యే స్థితికి దోహదం చేసింది. స్త్రీ సామాజిక ఉత్పత్తిలో భాగస్వామి అయ్యే దశ నుంచి పునరుత్పత్తికి పరిమితం కావలసి వచ్చింది. 20వ శతాబ్దం రెండవ అర్థ భాగంలో పారిశ్రామికీకరణ పర్యవసానంగా స్త్రీలు పరిశ్రమల్లో పని చేయడమూ మొదలైంది. మహిళలు ఉత్పత్తిలో భారీ స్థాయిలో భాగస్వాములైనప్పుడే మహిళాభ్యుదయం సాధ్యం అని ఎంగెల్స్ విశ్లేషించారు. అయితే ఇది పెట్టుబడిదారీ సమాజంలో మహిళకు అవసరమైన స్వేచ్ఛ ఇవ్వదని కూడా ఎంగెల్స్ గుర్తించాడు. సంక్షేమ రాజ్యాలు విచ్ఛిన్నం కావడం, కుటుంబాలు చిన్నవై పోవడం పెట్టుబడిదారీ వ్యవస్థ సంక్షోభానికి కారణం. ఈ పరిస్థితి సమానత్వానికి దారి తీయకపోగా అసమానతలను మరింత పెంచింది. మహిళలు




సాక్షికంగా మాత్రమే పని చేయగలుగు తున్నారు. పేదలు, సంపన్నుల మధ్య అంతరాలు మరింత విస్తృతం అవుతున్నాయి. మహిళలు ఎదుర్కుంటున్న అసమానత పురుషుల వైఖరి మీదో, వారి ఇష్టాయిష్టాల మీదో ఆధారపడిన అంశం కాదు. మహిళల పరిస్థితి మౌలికంగా వర్గ సమస్య అన్నది ఎంగెల్స్ వింగడింపు. పెట్టుబడిదారీ సమాజాన్ని పడదోయడంలో శ్రామిక మహిళల, పురుషుల ఐక్యత కీలక పాత్ర పోషిస్తుంది. వర్గ సమాజాన్ని కూలిస్తే తప్ప స్త్రీ, పురుషుల విముక్తి సాధ్యం కాదు.

సంపద ఒక వ్యక్తి చేతిలో పోగు పడడం, అదీ పురుషుడి చేతిలో కేంద్రీకృతం కావడం, తన సంపాదన తన సంతానానికి మాత్రమే సంక్రమించాలనుకోవడంవల్ల స్త్రీ-పురుషుల మధ్య వ్యత్యాసాలు కొనసాగుతూనే ఉన్నాయి. ఆర్థిక కారణాల వల్లే ఏకపత్నీ వ్రతానికి ప్రతిష్ఠ పెరిగింది కనక ఆ కారణాలు అంతరిస్తే తప్ప అసమానతలు అంతం కావు. వర్గ సమాజం నుంచి విముక్తి లభిస్తే తప్ప స్త్రీ-పురుష సమానత్వం సాధ్యం కాదు అన్నది కుటుంబం, రాజ్యం, ప్రైవేటు ఆస్తి అన్న గ్రంథం చెప్పే సారాంశం. సోషలిస్టు వ్యవస్థలో ఈ సంబంధాలు ఏ మేరకు మెరుగు పడతాయో ఇంకా వేచి చూడవలసిన స్థితిలోనే ఉన్నాం. ❑

---

## రాజకీయార్థికవేత్తగా ఎంగెల్స్

**(23వ పేజీ తరువాయి)**

మార్క్స్ ఇంట్రడక్షన్ టు ది క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీ వెలువడిన తర్వాత దాని మీద సమీక్ష రూపంలోనూ, కాపిటల్ రచనాక్రమంలో అవసరమైన సలహాలూ సూచనలూ ఇవ్వడం లోనూ, కాపిటల్ మొదటి సంపుటం వెలువడిన తర్వాత దాన్ని ప్రచారం చేయడానికి చేసిన రచనలలోనూ, మార్క్స్ మరణానంతరం కాపిటల్‌ను పూర్తి చేయడానికి జరిపిన కృషి లోనూ ఎంగెల్స్ రాజకీయార్థిక శాస్త్ర అభినివేశం, అపారమైన కృషి వ్యక్తమవుతాయి.

ఈ కృషికి సరైన మదింపు జరగకపోగా, ఎంగెల్స్ మార్క్స్‌ను వక్రీకరించాడనో, సరిగా అర్థం చేసుకోలేదనో, తప్పుడు అర్థాలు చెప్పాడనో, మార్క్స్ ఇవ్వదలచుకోని వక్కాణింపులు ఇచ్చాడనో చాల విమర్శలు చెలరేగాయి.

అయితే సాంకేతిక అంశాలలో, పదచర్చలలో, నొక్కుల్లో తేడాలు ఉండవచ్చు గాని స్ఫూర్తిలో, అవగాహనలో ఎంగెల్స్ చేసినది పూర్తిగా మార్క్స్‌కు కొనసాగింపు మాత్రమే. విమర్శలూ వివాదాలూ ఎన్ని ఉన్నా మార్క్స్‌కు అవిభాజ్య సహచరుడు, మార్క్సిజాన్ని స్థిరపరిచినవాడు, కొనసాగించినవాడు ఎంగెల్స్. రాజకీయార్థ శాస్త్రంలో మార్క్స్‌కన్న ముందే ప్రవేశించినప్పటికీ, మార్క్స్‌తో సమానమైన కృషి చేసినప్పటికీ, మార్క్స్ ప్రతిభను గుర్తించి తనను తాను సహాయక పాత్రలో చూసుకున్న వినయశీలి ఎంగెల్స్. ఎంగెల్స్ లేకపోయినా మార్క్స్ ఉండేవాడు. ఆ మాట కొస్తే మార్క్స్ కాకపోతే మరొకరు వచ్చేవారు. కాని ఎంగెల్స్ లేకపోతే మార్క్స్ ఇంత ప్రభావశీలంగా ఉండేవాడా ఆలోచించ వలసిందే.

(విశాఖపట్నంలో కా. వై విజయకుమార్ మార్క్సిస్ట్ అధ్యయన కేంద్రం ఆధ్వర్యంలో జరిగిన ఫ్రెడరిక్ ఎంగెల్స్ ద్విశత జయంతి ఉత్సవాల ప్రారంభ సదస్సులో 2019 డిసెంబర్ 15న చేసిన ఉపన్యాసానికి సంక్షిప్త రూపం) ❑



# ఎంగెల్స్ చరిత్రకు ఎంగెల్స్ అపచారాన్ని దిద్దుబాటు చేసిన మార్క్స్ మరణ నేపథ్యం - ఒక పరిశీలన

**ఎంగెల్స్‌లో పలు కోణాలు**

**పి. ప్రసాదు (పిపి)**
ఐ.యఫ్.టి.యు. జాతీయ కార్యదర్శి



ఇది ఎంగెల్స్ ద్విశతజయంతి సంవత్సరం. ఈ సందర్భంగా ఒక ప్రత్యేక సంచికను తీసుకురావాలని 'జాతీయ స్ఫూర్తి' మాసపత్రిక సంపాదక వర్గం నిర్ణయించింది. ఒక వ్యాసాన్ని రాసివ్వమని ఆ పత్రిక సంపాదకులు డి.వి.వి.యస్. వర్మ గారు నన్ను కోరారు. అనారోగ్యంతో పాటు NRC, CAA, NPR ల వ్యతిరేక ఉద్యమ కార్యభారంలో వారు కోరిన స్వల్ప వ్యవధిలో రాసివ్వలేనని నా నిస్సహాయతను వ్యక్తం చేశాను. నాకు యిష్టమైన ఏదో ఒక అంశంపై రాయమని స్వేచ్ఛను కల్పించారు. కనీసం ఎంగెల్స్ రాసిన ఏదో ఒక గ్రంథం మీద రాయమన్నారు. ఆలోచించాను. నాకు వృత్తిపరంగా, ప్రవృత్తిపరంగా రెండు ప్రత్యేక అభిరుచి, ఆసక్తులు గల క్రింది రెండు అంశాలు నా మనస్సులో మెదిలాయి.

మొదటిది, సుమారు నాలుగు దశాబ్దాలుగా నేను వృత్తిపరంగా కార్మిక రంగంలో పని చేస్తున్నాను. మాంచెస్టర్ కార్మిక వాడల్లో కార్మికవర్గ బ్రతుకులను శోధించి ఎంగెల్స్ తన 24వ ఏట రచించిన **'ఇంగ్లాండులో కార్మికవర్గ స్థితిగతులు'** పుస్తకం నా మనస్సులో మెదిలింది. సైద్ధాంతిక, తాత్విక గ్రంథాల కంటే ఒక శ్రామికోద్యమ ప్రతినిధిగా దానిని సమీక్షిస్తూ వ్యాసం రాయడం నా వృత్తిధర్మంగా వుంటుంది.

రెండవది, సుమారు రెండు దశాబ్దాలుగా విప్లవోద్యమాలలో విప్లవాదర్శాల రాజకీయ ఆవశ్యకత గూర్చి ఆవేదన, ఆసక్తులను ప్రదర్శిస్తున్నాను. ఆ రీత్యా ఎంగెల్స్ ఎంతో ఆదర్శమూర్తి (రోల్ మోడల్)గా కనిపించడం సహజం. మార్క్స్, లెనిన్‌ల వలె పెటీ బూర్జువా వర్గం నుంచి ఎంగెల్స్ రాలేదు. ఆయన స్వయంగా బూర్జువా వర్గీయుడు. రెండు దశాబ్దాల పాటు ఒక బట్టల మిల్లుకు యజమానిగా వ్యవహరించాడు. అయినా సైద్ధాంతికంగా తాత్వికంగా **'వర్గాంతరీకరణం'** (డీక్లాసిఫికేషన్) చెందాడు. పేద మధ్యతరగతి వర్గాలలో పుట్టి, కమ్యూనిస్టులుగా మారి, విప్లవ నిర్మాణాలలో సమున్నత స్థానాలకు ఎదిగిన నాయకులు సైతం నేడు **'వ్యతిరేక వర్గాంతరీకరణ'** (రీక్లాసిఫికేషన్) చెందుతున్న ధోరణులు నేడు మన కళ్ళెదుట కనిపిస్తున్నాయి. కావున ఎంగెల్స్ యొక్క 'వర్గాంతరీకరణ' ప్రక్రియతో పాటు ఆయనలోని విప్లవాదర్శాల మీద రాయడం నా ప్రవృత్తి ధర్మంగా వుంటుంది.

కానీ యీ వృత్తిపరమైన మరియు ప్రవృత్తిపరమైన అంశాలు కాకుండా ఎంగెల్స్‌లోని మరో కొత్త కోణం గూర్చి రాయాలని ఎంచుకున్నాను.

చాలా సంవత్సరాలుగా ఎంగెల్స్‌లో ఒక కొత్త కోణం గూర్చి ఆలోచిస్తూ వచ్చాను. అట్టి నా ఆలోచనలకు 2018వ సం॥రం ఒక తుదిరూపం ఇచ్చింది. అది మార్క్స్ ద్విశతజయంతి సంవత్సరం. ఆ సందర్భంగా మార్క్స్‌ను గూర్చి మరింత అధ్యయనం చేశాను. ఫలితంగా ఎంగెల్స్ చరిత్ర నన్ను బాగా ఆకర్షించింది. అలా అనే కంటే అది నన్ను ఆవహించిందనడమే సరైనదేమో! అప్పటి నుండి చరిత్రలో ఎంగెల్స్ పాత్రకు ఎంగెల్స్ అపచారం చేశాడనే భావన నాలో బలపడింది. చరిత్రకు ఎంగెల్స్ చేసిన అట్టి అపచారాన్ని మార్క్స్ మరణం దిద్దుబాటు చేసిందనే భావన కూడా నా మనస్సులో బలంగా నాటుకున్నది. అదే యీ వ్యాస రచనకు కారణంగా మారింది.

ఈ వ్యాసానికి పెట్టిన శీర్షిక (హెడ్డింగ్)ను చదవగానే పాఠకులకు ప్రాథమికంగా నా మీద కోపం వస్తుంది. అది ఎంగెల్స్ మీద ప్రేమాభిమానాలతో మాత్రమే. నేను ఎంగెల్స్ మీద నింద వేస్తున్నాననే ధర్మాగ్రహంతో మాత్రమే. కానీ దీన్ని పూర్తిగా చదివితే ఎంగెల్స్ మీద ప్రగాఢ ప్రేమతో నేను రాసినట్లు గ్రహిస్తారు. ఎంగెల్స్ మీద వారి ప్రేమ భావన మరింత పెరుగుతుంది. శీర్షికను చూసి వదిలేయకుండా ఆసాంతం చదివితే ఎంగెల్స్ యొక్క నూతన కోణాన్ని గ్రహించిన అనుభూతి పొందుతారు.

మార్క్స్, ఎంగెల్స్‌ల సహచరుడు జర్మన్ పార్టీ ప్రముఖ నేత విల్ హెల్మ్ లీబ్ క్నెఖ్ట్ తన జ్ఞాపకాలలో ఎంగెల్స్ గూర్చి ఒక మాట చెప్పాడు. మార్క్స్ మరణానంతరం ఎంగెల్స్ ఈ క్రింది రెండు పాత్రలను పోషించినట్లు చెప్పాడు. మొదటిది, మార్క్స్ స్థానంలో మార్క్స్‌కి బదులుగా వుండటం; రెండవది, మార్క్స్ అభీష్టాన్ని నెరవేర్చుతూ వుండడం. అదే వ్యాసంలో ఎంగెల్స్ గూర్చి లీబ్‌క్నెఖ్ట్ మరో ప్రాముఖ్యత గల యీ క్రింది మాట చెప్పడం గమనార్హం. **మార్క్స్ జీవించినంత కాలం, ఎంగెల్స్ మాటల్లో కూడా చెప్పాలంటే, ఆయన మరొకరికి తాళం వేసేవాడుగా వుండేవాడు. ఆ తర్వాతే ఆయన తన సామర్థ్యాన్ని ప్రదర్శించాడు. అంటే తాళం వేయడమే కాదు, తానే స్వయంగా పాట పాడగలనని ఎంగెల్స్ నిరూపించాడు.**

ఔను, అది నిజం! మార్క్స్ జీవించిన కాలంలో లీబ్‌క్నెఖ్ట్ చెప్పినట్లు **'మార్క్స్ పాట - ఎంగెల్స్ తాళం'**గా బయటకు నాటి సమకాలికుల దృష్టిలో కనిపించేది. నిజానికి అది నిజం కాదు. మార్క్స్ జీవితకాలంలోనే **'మరో మార్క్స్'** పాత్రను ఎంగెల్స్ పోషించడం నిజం. ఒకే పాటకు యిద్దరూ కోరస్. అంతే తప్ప, **ఒకరు పాట - మరొకరు తాళం**గా లేరు. ఇంకో మాట ఏమంటే, తన పాటకు ఎంగెల్స్ తాళం వేస్తున్నట్లు మార్క్స్ ఎన్నడూ భావించలేదు. కానీ మార్క్స్ పాటకు తాను తాళం వేసేవాడిగా ఎంగెల్స్ తనకు తాను చెప్పుకునేవాడు. ఎంగెల్స్‌ను తన సహచరుడుగా మార్క్స్ భావిస్తుంటే, తాను మార్క్స్‌కు అనుచరుడిగా ఎంగెల్స్ చెప్పుకునేవాడు. మార్క్స్ జీవితకాలంలో ఎంగెల్స్ గూర్చి మార్క్స్ భావించినట్లు నాటి మిత్రబృందంలో **'జంట సహచరులు'**గా ప్రాచుర్యం పొందలేదు. మార్క్స్ పట్ల అతి వినయంతో ఎంగెల్స్ పది మందిలో పదేపదే చెప్పుకున్నట్లు **'గురు శిష్యులు' (పాట-తాళం)** గా మాత్రమే ప్రాచుర్యం పొందడం జరిగింది. ఎంగెల్స్ గూర్చి మార్క్స్ భావన కంటే, ఎంగెల్స్ గూర్చి ఎంగెల్స్ భావనే ఆ కాలంలో **నలుగురిలో నానుడి**గా మారింది. కానీ మార్క్స్ మరణానంతరం పై నానుడికి కాలం చెల్లింది. పై నానుడిని బ్రతికించడానికి ఎంగెల్స్‌కు సాధ్యం కాకపోయింది. పాటను పాడటానికి మార్క్స్ గొంతు మూగబోయింది. పాటలో తాను భాగస్వామి కాదని అబద్ధం ఆడటం ఎంగెల్స్‌కు యిక సాధ్యం కాలేదు. మార్క్స్ మరణానంతరం మార్క్స్ గొంతు కూడా ఎంగెల్స్ గొంతులో ధ్వనించింది. **'నాది తాళం మాత్రమే'** అని పచ్చి అబద్ధాన్ని పట్టపగలు బొంకడానికి ఎంగెల్స్‌కు యిక అవకాశం లేకపోయింది. 12 ఏళ్ళ పాటు రెండు గొంతులతో కూడిన కోరస్‌ను ఎంగెల్స్ వినిపించాడు. అది ఆనాటి పది మందిలో ప్రాచుర్యం పొందింది.

పైన లీబ్‌క్నెఖ్ట్ పేర్కొన్నట్లు పాటగా కాకుండా తాళం పాత్రగానే ఆనాడు ఎంగెల్స్ ప్రాచుర్యం పొందాడని చెప్పడానికి ఫాల్ లాఫార్గ్ మాటలు కూడా సాధికారికంగా ఉంటాయి. ఫాల్ లాఫార్గ్ కారల్‌మార్క్స్‌కు అల్లుడు. ఫ్రెంచి పార్టీ ప్రముఖ నేత. ముఖ్యంగా మార్క్స్ ఎంగెల్స్‌లను అతి సమీపం నుంచి పరిశీలించిన సన్నిహితుడు. అందుకే ఆయన మాటలకు సాధికారికత వుంటుంది.

ఎంగెల్స్ గూర్చి లాఫార్గ్ పేర్కొన్న యీ క్రింది వాక్యాలను గమనించుదాం. **తాము రోజూ ఎంగెల్స్‌ను చూసే ఇంగ్లీష్ వారికి కూడా ఆయనలోని ఉన్నత బౌద్ధిక గుణాలను (ఇంటెలెక్చువల్ క్వాలిటీస్) గూర్చి బొత్తిగా తెలియదు. ఎందుకంటే వాళ్ళ ముందు తన జ్ఞానాన్ని ఎంగెల్స్ ప్రదర్శించలేదు. యూరప్‌లో అత్యంత జ్ఞానవంతుడుగా మార్క్స్ చేత ఎంగెల్స్ గౌరవం పొందాడు. కానీ వాళ్ళ దృష్టిలో మాత్రం మంచి ద్రాక్ష సారాయిని మెచ్చుకోగల సహచరుడు మాత్రమే.** ఔను కదా! నిజానికి మార్క్స్‌తో పాటు ఎంగెల్స్ కూడా జ్ఞాన సూర్యుడు. కానీ ఆయన స్వతంత్ర్య జ్ఞాన సూర్యుడిగా కాకుండా, దాని చుట్టూ పరిభ్రమించే ఉపగ్రహంగా మాత్రమే తనకు తాను ఆనాడు ఆయన ప్రచారం చేసుకున్నాడు. బయటకు ఎలాంటి విబేధాలు లేని గురుశిష్యులుగా మార్క్స్ ఎంగెల్స్‌లు ప్రాచుర్యం పొందినా, అది నిజం కాదు. పై యిద్దరి వ్యక్తిత్వాలలో వైవిధ్యం గూర్చి అతి సన్నిహితులకే తెలుస్తుంది. లాఫార్గ్ పేర్కొన్న యీ క్రింది మాటలను చూద్దాం. **మార్క్స్-ఎంగెల్స్ వ్యక్తిత్వాల మధ్య చాలా వైవిధ్యం ఉంది. వాళ్ళు చూడటానికే కాకుండా మనస్తత్వంలోనూ, స్వభావంలోనూ ఆలోచించే పద్ధతిలోనూ, అనుభూతి పొందే పద్ధతిలో కూడా భిన్నులు.** దీనర్థం వారిద్దరూ ఇంట్లో ఒకటి కాదు - బయటా ఒకటి కాదు. ఎవరి ప్రత్యేకత వారిదే. ఇద్దరూ వేర్వేరు జ్ఞాన సూర్యులే. ఇద్దరూ వేర్వేరు గాయకులే. అయినా ఆనాటి సమకాలికులలో మాత్రం 'గ్రహం-ఉపగ్రహం'గానూ, 'పాట-తాళం'గానూ ప్రాచుర్యం పొందారు. అయితే మార్క్స్ జీవిత కాలంలో మార్క్స్ ప్రమేయం లేకుండా ఎంగెల్స్ స్వయంగా నిర్మించిన యీ అసత్యకృతక ప్రాచుర్య వ్యవస్థను మార్క్స్ మరణం విచ్ఛిన్నం చేసింది. మార్క్స్ మరణానంతరం మార్క్స్-ఎంగెల్స్‌ల సమకాలీన విప్లవ రాజకీయ సిద్ధాంత, నిర్మాణ శ్రేణుల్లో ఎంగెల్స్ ఆకస్మికంగా జ్ఞాన భాస్కరునిగా వెలుగొందసాగాడు. ఓ పుష్కర కాలం పాటు, అంటే తాను మరణించే వరకూ ముఖ్యంగా యూరప్ గడ్డ మీద నిరాటంకంగా ఎంగెల్స్ తేజోవంతమైన పాత్రలో ప్రాచుర్యం పొందడం విశేషం.




ఫ్రీడ్రిఖ్ లెస్నెర్ అనే మరో సన్నిహితుడు ఎంగెల్స్‌తో తన జ్ఞాపకాలలో యిలా పేర్కొన్నాడు. **కొత్త వాళ్ళతో ఎంగెల్స్ ముభావంగా వుండేవాడు. ఎంగెల్స్ గూర్చి మనకు సరైన అభిప్రాయం కలగాలంటే, ఆయనతో మనకు బాగా పరిచయం వుండాలి. అంతే గాకుండా ఆయనకు మనం కూడా పూర్తిగా పరిచయం కావాలి. అప్పుడు మాత్రమే మన దగ్గర ఎంగెల్స్ మనస్సు విప్పి మాట్లాడేవాడు.** దీనిని బట్టి కూడా అర్థమయ్యేదేమంటే మార్క్స్ జీవిత కాలంలో మార్క్స్ చాటున ఎంగెల్స్ పాత్ర దాగి వుండేది. మార్క్స్-ఎంగెల్స్‌లు **'రెండు దేహాలు**




**- ఒకే ముఖం**'గా నాడు తెరమీద దర్శనమయ్యేవాళ్ళని అర్థమవుతుంది. కానీ మార్క్స్ మరణం తర్వాత **ఎంగెల్స్ దేహం - ఎంగెల్స్ ముఖం** అనే కొత్త కూర్పు ఏర్పడింది. ఎంగెల్స్ తేజోవంతమైన ముఖం యూరప్‌లో దర్శనమైనది.

ఔను మరి, మార్క్స్ జీవిత కాలంలో ఎంగెల్స్ ఘోర అన్యాయం చేశాడు. ఆయన చేసిన అపరాధం క్షమించరానిది. ఆయన పెద్ద ముద్దాయి. అయితే యివన్నీ వ్యక్తిగతమైనవి కాదు. చారిత్రక, రాజకీయ కోణాలలో చెబుతున్నది మాత్రమే. ఔను చరిత్రలో లిఖించబడాల్సిన తన సముచిత స్థానానికి ఎంగెల్స్ తీవ్ర అపచారం చేశాడు. అది చరిత్రకు చేసిన అన్యాయమే కదా. గ్రహాన్ని ఉపగ్రహంగా, పాటను తాళంగా చరిత్రలో లిఖించాలను కోవడం చారిత్రక అపచారం కాక మరేమవుతుంది. అది వ్యక్తిత్వపరంగా ఎంగెల్స్ వినయం, నిరాడంబరత, విధేయత, స్నేహశీలతలను గగనానికి ఎత్తిపట్టిన మాట నిజం. అదే సమయంలో గగన విహారం చేసిన ఎంగెల్స్ తనను తాను కృతకంగా మార్క్స్‌కు నీడగా వుండటం ఒక అన్యాయమే కదా. చరిత్రకు ఎంగెల్స్ చేసిన అట్టి అన్యాయం 'యింకానా... ఇకపై సాగదు..' అని మార్క్స్ అమరత్వం చాటి చెప్పింది. ఏ మార్క్స్‌కు నీడగా వుండాలని ఎంగెల్స్ తపించాడో, అదే మార్క్స్ అమరత్వం అది నీడ కానే కాదని నిరూపించింది. ఎంగెల్స్ అపరాధాన్ని అది సవరించి చరిత్రకు న్యాయం చేసింది.

ఎంగెల్స్ 70వ జయంతి సందర్భంగా 28-11-1890వ తేదీన లండన్‌లో మార్క్స్, ఎంగెల్స్‌ల రాజకీయ మిత్రుల కలయిక జరిగింది. అప్పటికి మార్క్స్ మరణించి ఏడున్నర ఏళ్ళు దాటింది. అప్పటికే ఎంగెల్స్ అంటే ఏమిటో నాటి మిత్ర బృందానికి వెల్లడైపోయింది. ఆయన 'తాళం' కాదని తెలిసిపోయింది. **'మార్క్స్‌లోనే ఎంగెల్స్'**ను చూసుకునే పరిస్థితికి మారింది. **ఒక్క ఎంగెల్స్‌లోనే యిద్దరు మార్క్స్‌లు** వున్నారనే వాస్తవం వారందరికీ తెలిసిపోయింది. డెబ్బై ఏళ్ళ వృద్ధాప్యంలో కూడా 'యిద్దరు మార్క్స్‌లు'గా డబుల్ డ్యూటీ చేస్తున్న ఎంగెల్స్ పాత్రను సమకాలీన మిత్రులు గుర్తించారు. అందుకే ఆయన 70వ జయంతి రోజు ఆ వృద్ధుని యవ్వన పనిని ప్రోత్సహించేందుకు మిత్రులు కలుసుకున్నారు. ఆయన పనిలో భాగం పంచుకొని పురికొలిపే కలయికగా సాగింది. దీన్ని బట్టి మార్క్స్ మరణానంతరం ఎంగెల్స్ పోషించిన పాత్ర ఏమిటో స్థూలంగా అర్థం చేసుకోవచ్చు.

మార్క్స్ మరణానంతరం ఎంగెల్స్ కృషి గూర్చి మార్క్స్ కూతురు 'ఎలినోర మార్క్స్' తన జ్ఞాపకాలలో పేర్కొన్న యీ క్రింది మాటలు విందాం. **"మా నాన్న 1883లో మరణించాడు. అప్పటి నుండి ఎంగెల్స్ ఏమి సాధించాడో అందరికీ తెలుసు. తన కాలంలో అత్యధిక భాగం ఆయన మా నాన్న రచనల ప్రచురణలకే అర్పించాడు. కొత్త ప్రూఫులు చూస్తూ లేదా 'పెట్టుబడి' అనువాదాలను తనిఖీ చేస్తూ తన కాలాన్ని వెచ్చించాడు. ఈ పనిని గూర్చి గానీ, మరో వైపు ఆయన స్వంత రచనల గూర్చి గానీ చెప్పనక్కరలేదు. ఎంగెల్స్ ప్రతిరోజూ ఎంత పని చేశాడో ఆయన్ని దగ్గర నుండి ఎరిగిన వాళ్ళకు మాత్రమే తెలిసి అభినందించగలరు".** ఆమె యింకా ఈ క్రింది విధంగా ఎంగెల్స్ చేసిన కృషి గూర్చి పేర్కొన్నది. **"ఇటీవల సంవత్సరాలలో ఒక్క ఎంగెల్స్ చేసిన పని మామూలుగా డజను మంది చేసే పని కంటే మించినది".** ఎంగెల్స్ చేసిన పని ప్రాధాన్యత గూర్చి కూడా ఆమె యీ క్రింది విధంగా అభివర్ణించింది. **మార్క్స్ వదిలిపోయిన దాన్ని ఎంగెల్స్ మాత్రమే ప్రపంచానికి అందివ్వగలడు.** ఔను మరి, 'పెట్టుబడి' గ్రంథం అలాంటిది. పెట్టుబడి గ్రంథ రచన చేసిన రాజకీయ ఘనత మార్క్స్‌దే. కానీ లెనిన్ మాటల్లో చెప్పాలంటే 'పెట్టుబడి' గ్రంథ రచనకు మార్క్స్ దృష్టిని మళ్ళించిన ఘనత ఎంగెల్స్‌ది. "ఎంగెల్స్ మరణాంతరం 'ఫ్రెడరిక్ ఎంగెల్స్' శీర్షికతో లెనిన్ రాసిన ఒక వ్యాసంలో "ఏ అర్థశాస్త్ర రంగంలో కారల్ మార్క్స్ రచనలు బ్రహ్మాండమైన విప్లవాన్ని సాధించాయో, ఆ అర్థశాస్త్రాన్ని ఆయన పఠించడానికి ఎంగెల్స్ తో ఆయనకు గల పరిచయ స్నేహాలు చాలా హెచ్చుగా తోడ్పడ్డాయనడం నిస్సందేహమైన విషయం" అని వ్యాఖ్యానించాడు. తిరిగి మార్క్స్ వదిలిన పెట్టుబడి గ్రంథ రచన పరిపూర్తితో పాటు వాటి అనువాదాలు, తాజాపరచడం వంటి కర్తవ్యాలను పూర్తి చేసిన ఘనత కూడా ఎంగెల్స్‌దే.

ఎంగెల్స్ గూర్చి పాల్ లాఫార్గ్ జ్ఞాపకాల నుండి క్రింది వాక్యాలను ఉదహరించడం సందర్భోచితంగా వుంటుంది. **మార్క్స్ మరణానంతరం ఆయన రాత ప్రతులను చూసి, ఆయన వదిలి వెళ్ళిన రచనలను ప్రచురించగలిగినవాడు ఎంగెల్స్ ఒక్కడే. పెట్టుబడి గ్రంథం చివరి రెండు భాగాల పని కోసం ఎంగెల్స్ తనను తాను అర్పించుకున్నాడు. అందు కోసం తన సార్వత్రిక శాస్త్ర విజ్ఞాన తత్వశాస్త్రాన్ని పక్కకు పెట్టాడు. దాని మీదే ఎంగెల్స్ పదేళ్ళకు పైగా కృషి చేశాడు. దాని కోసం ఆయన సకల విజ్ఞాన శాస్త్రాలనూ, ఆనాటి వరకు వాటి పురోగతినీ ఎంగెల్స్ అధ్యయనం చేశాడు.** ఔను, ఎంగెల్స్ 'పెట్టుబడి' గ్రంథం పని కోసం తన

కంటి చూపును సైతం కోల్పోయాడు. తాను కోల్పోతున్న కంటి చూపు పరిహారం కోసం చాలా మందం గల అద్దాలతో కూడిన కళ్ళద్దాలు ధరించి లాంతరు వెలుతురులోనే ఏడున్నర దశాబ్దాల వృద్ధాప్యంలో శ్రమించాడు. అట్టి ఆయన శ్రమ లేకుండా నేడు 'పెట్టుబడి' గ్రంథం యీ రూపంలో ప్రపంచానికి లభించి వుండేది కాదు. అదే ఆయన్ని మార్క్స్ మరణానంతరం స్వతంత్ర మార్క్స్‌గా ఆవిష్కరించింది. ఇద్దరు మార్క్స్‌ల పాత్రలో ఆయన ప్రత్యక్షమయ్యాడు. పది మంది మనుషుల పనిని వృద్ధాప్యంలో చేసి రాజకీయ ధన్యుడుగా, చరితార్థునిగా నిలిచాడు.

మార్క్స్ మరణానంతరం ఎంగెల్స్ పోషించిన చారిత్రక, రాజకీయ పాత్రలను ఎంత చెప్పుకున్నా తరగదు. త్రవ్వినకొద్దీ వెలికి వచ్చే గని వంటిదే ఎంగెల్స్ జీవితం. మార్క్స్ మరణానంతరం మూడేళ్ళ తర్వాత 8 గంటల పని దినం కోసం చరిత్రాత్మక మేడే పోరాటం జరిగింది. చరిత్రాత్మక రెండవ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఏర్పడింది. దాని ఆవిష్కర్తగా ఎంగెల్స్ చరిత్రాత్మక పాత్రను పోషించాడు. దానికి నిరంతర రాజకీయ దిశానిర్దేశం చేశాడు. ఆయన తన 68వ ఏట 1888లో అమెరికా పర్యటన చేసి పెట్టుబడిదారీ అమెరికా గూర్చి అనేక కొత్త విషయాలను నేర్చుకున్నాడు. **ఈ అమెరికా పర్యటన నన్ను యువకునిగా మార్చింది. నా వయస్సును ఐదేండ్లు తగ్గించింది** అని ఎంగెల్స్ వ్యాఖ్యానించాడు. ఆయన నిరంతర అధ్యయన శీలిగా, జిజ్ఞాసిగా, విద్యార్థిగా జీవించాడు. హైస్కూలు చదువు కూడా పూర్తి చేయని ఎంగెల్స్ 20 భాషల్లో మాట్లాడగలిగే జ్ఞాన పండితునిగా ఎదిగాడు. తన 24వ ఏట 1844లో **ఇంగ్లాండులో కార్మికవర్గ స్థితిగతులు** అనే అద్భుత పరిశోధనా గ్రంథ రచన చేశాడు. అది లగాయతు 1895 ఆగస్టు 5న కన్ను మూసేంత వరకూ ఎంగెల్స్ అధ్యయనం, గ్రంథ రచన, విప్లవాచరణలకే తన జీవితాన్ని అంకితం చేశాడు. చరిత్రలో ధన్యుడిగా నిలిచాడు. ఎంగెల్స్ అమర్ రహే !




ఈ వ్యాసానికి నేను పెట్టిన శీర్షికనే వ్యాస ఉపసంహారానికి కూడా ఎంచుకుంటున్నాను. ఎంగెల్స్ లేకుండా మార్క్స్ లేడు. ఇంకా చెప్పాలంటే ఎంగెల్స్ మరియు జెన్నీ లేకుండా మార్క్స్ లేడు. మార్క్స్ లేకుండా మార్క్సిజం లేదని అందరూ చెబుతున్నది. కానీ మార్క్స్, ఎంగెల్స్, జెన్నీ అనే ముగ్గురు లేకుండా మార్క్సిజం లేదనే చారిత్రక వాస్తవాన్ని అందరూ అంగీకరించాల్సి వుంది. మార్క్స్ జీవిత కాలంలో చరిత్రలో ఎంగెల్స్ స్థానాన్ని ఎంగెల్సే చెరిపివేయజూశాడు. మార్క్స్ మరణానంతరం కూడా ఆయన పాత్రను చరిత్రలో లిఖించడానికి ఆయన వైపు నుంచి ప్రయత్నించింది లేదు. అయినా సమకాలీన విప్లవోద్యమమే ఆయన పాత్రను సముచితంగా గుర్తించి లిఖించింది. నిజానికి మార్క్స్ సమకాలికునిగానే కాకుండా మార్క్స్‌కూ, లెనిన్‌కూ మధ్య కాలంలో ఒక విప్లవ వారధిగా, విప్లవోద్యమ రథసారధిగా కూడా ఎంగెల్స్ సముచిత పాత్రను పోషించాడు. అంతే కాకుండా మార్క్స్ మరణానంతరం పెట్టుబడిదారీ వ్యవస్థ సామ్రాజ్యవాద వ్యవస్థగా పరిణామం చెందే క్రమాన్ని బీజ రూపంలోనైనా గమనించిన చరిత్ర కూడా ఎంగెల్స్‌దే. దానిని సమగ్రంగా విశ్లేషించి, నిర్ధారించిన లెనిన్‌కు పూర్వరంగ మేధోవనరుగా కూడా ఎంగెల్స్ పాత్ర వుంది. ఈ చారిత్రక రాజకీయ పాత్రలను సముచితంగా వెలుగులోకి తేవడానికి ఎంగెల్స్ ద్విశతజయంతి ఒక రాజకీయ సందర్భం కావాలని ఆకాంక్షించుదాం. అందుకు కృషి చేద్దాం. ఎంగెల్స్ అమరత్వం చరిత్రలో సముచితంగా వర్ధిల్లు గాక. ❑

---

**అర్థశాస్త్రవేత్తలు అత్యున్నత చారిత్రక విజయంగా భావించి పులకరించిపోయే స్వేచ్ఛా వాణిజ్య భావనను - అంటే అస్తిత్వం కోసం పోరాటం అనే భావననే - జంతు ప్రపంచానికి అత్యంత సాధారణమయిన స్థితిగా సూత్రీకరించాడు డార్విన్. అలా చెయ్యడం ద్వారా, తాను మానవజాతి గురించి ఎంతటి కటువయిన వ్యంగ్య రచన చేస్తున్నాడో డార్విన్‌కు తెలియదు పాపం! చైతన్యవంతమయిన సామాజిక ఉత్పత్తి క్రమం మాత్రమే - అంటే, ప్రణాళికా బద్ధంగా అమలు జరిపే ఉత్పత్తి, పంపిణీ మాత్రమే- మానవాళిని జంతువుల కన్నా ఉన్నతమయిన స్థాయికి తీసుకుపోగలవు.**

*- ఎంగెల్స్*

**తనకు చవకగా సరుకులు సరఫరా చేసే వారితోనూ, ఎక్కువ ధరలకు వాటిని కొనుగోలు చేసే వారితోనూ సత్సంబంధాలు కలిగి వుండడమనేది వర్తకుడికి ప్రయోజనకరం. ఒకానొక జాతి సరుకుల సరఫరాదారులకూ, కొనుగోలుదారులకూ మధ్య వైరభావం కల్పించినట్లయితే, అదంత వివేకవంతమయిన పని అనిపించుకోదు. స్నేహభావం ఎంత ఎక్కువగా కలిగి ఉంటే, అంత ప్రయోజనకరంగా ఉంటుంది. మానవత్వంతో కూడిన వర్తకమంటే అర్థం అదీ. అవినీతికరమయిన లక్ష్యాల కోసం నీతిని దుర్వినియోగం చేసే ఈ ఆత్మవంచనే, స్వేచ్ఛా వాణిజ్యానికి గర్వకారణమయిన ఘనవిజయం.**

*- ఎంగెల్స్*



# ఎంగెల్స్ 'కుటుంబం, సొంత ఆస్తి, రాజ్యాల ఆవిర్భావం' భారతదేశ ప్రస్తావనలు



కొప్పర్తి వెంకట రమణమూర్తి

1877లో లూయీ మోర్గన్ వెలువరించిన 'పురాతన సమాజం' ఇచ్చిన వెలుగులో మార్క్స్ వ్రాయాలని తయారు చేసుకున్న నోట్సును ఉపయోగించుకుంటూ ఫ్రెడరిక్ ఎంగెల్స్ 1884లో రాసిన 'కుటుంబం, సొంత ఆస్తి, రాజ్యాల ఆవిర్భావం' అనే పుస్తకం, ఆ అంశంపై వచ్చిన మౌలిక రచనల్లో విప్లవాత్మకమైనది. భౌతికవాద దృక్పథంతో మార్క్సిస్టు అవగాహనకు భూమికను ఏర్పరుస్తూ సాగిన ఈ రచన ఆటవిక యుగం నుండి అనాగరిక యుగం మీదుగా నాగరిక యుగంలోకి సాగిన మానవ ప్రయాణంలో జీవిత అవసరాలను తీర్చే పనిముట్ల ఉత్పత్తి, మనుషుల ఉత్పత్తి అనే రెండు ఉత్పత్తి క్రమాలు సామాజిక వ్యవస్థలను ఎట్లా ప్రభావితం చేశాయో శాస్త్రీయంగా నిరూపిస్తుంది. శ్రమ తక్కువగా ఉండే దశలోనే లైంగిక సంబంధాల ప్రాబల్యం ఎక్కువగా ఉండి, అట్లా ఎక్కువగా ఉండడమే శ్రమ ఉత్పాదకత అధికం కావడానికి కారణమై, అది సొంత ఆస్తికీ మారకానికీ దారితీసి వర్గవైరుధ్యాలకు పునాది అవుతుందనీ, అవి ఘర్షించుకుని లైంగిక సంబంధాల ఆధారంగా రూపొందిన సమాజం విచ్ఛిన్నమై కుటుంబమూ సమాజమూ ఆ పైన రాజ్యమూ ఏర్పడుతాయని ఇందులో నిరూపిస్తాడు ఎంగెల్స్.

ఈ పుస్తకం నాల్గవ ముద్రణ (1891)కు రాసిన ముందు మాటలో అమెరికన్ పండితుడు లూయీ హెన్రీ మోర్గన్ తన మౌలిక పరిశోధన గ్రంథం 'పురాతన సమాజం'లో చేసిన సూత్రీకరణల్ని ప్రాతిపదికగా తీసుకున్నట్టు రాస్తూ ఎంగెల్స్ "జీవశాస్త్రానికి డార్విన్ పరిణామ సిద్ధాంతం ఎంత ముఖ్యమో, ఆర్థిక శాస్త్రానికి మార్క్సు అదనపు విలువ సిద్ధాంతం ఎంత ముఖ్యమో, నాగరిక ప్రజలలో కనిపించే తండ్రి హక్కు గణాలకు పూర్వం, తల్లి హక్కు గణాలుండేవని మోర్గన్ కనిపెట్టిన అంశం అంతే ముఖ్యం" అంటాడు.

తొమ్మిది ప్రకరణాలుగా రాసిన ఈ గ్రంథంలో చరిత్ర పూర్వ సాంస్కృతిక దశలు, కుటుంబం అనే మొదటి రెండు ప్రకరణాల్లో మానవజాతి ప్రారంభం నాటి దశలు, లైంగిక సంబంధాలు, వివిధ కుటుంబ దశలు, కుటుంబ నిర్మాణం మీద సొంత ఆస్తి ప్రభావం గురించి వివరించిన ఎంగెల్స్ మూడు నుంచి ఎనిమిది వరకు ఉన్న ప్రకరణాల్లో అమెరికన్ ఇరాక్వా, గ్రీకు, ఎథీనియన్, రోమన్, జర్మన్ గణాలు రాజ్యాలుగా ఆవిర్భవించిన క్రమాన్నీ చివరి ప్రకరణం 'అనాగరికత-నాగరికత'లో గణ వ్యవస్థను శిథిలపరిచి రాజ్యావిర్భావానికి దారి తీసిన ఆర్థిక పరిస్థితుల్ని విశ్లేషణ చేశాడు.

180 పేజీల ఈ గ్రంథంలో మూడు నుంచి ఎనిమిది వరకూ సాగిన ప్రకరణాల్లో అమెరికన్ యూరప్ సమాజాల్లో గణ, రాజ్య ఆవిర్భావాల వివరణకు పరిమితమైన ఎంగెల్స్, ముందు మాటలతో కలిపి దాదాపు 80 పేజీలున్న మొదటి రెండు ప్రకరణాల్లో కుటుంబ వ్యవస్థ ఆవిర్భావాన్ని నిర్ధారించడానికి ప్రపంచ వ్యాపితంగా ఉన్న అనేక గణాల్నీ, తెగల్నీ ఉటంకిస్తాడు. ఆ క్రమంలో ప్రాచీన భారతదేశంలో లైంగిక సంబంధాలు, కుటుంబ నిర్మాణమూ దాదాపు పదిహేను సార్లు ప్రస్తావనకు వస్తాయి. వాటిని ఉల్లేఖిస్తూ ఎంగెల్స్ ఆలోచనలకనుగుణంగా సాగిన సూత్రీకరణల్లో భారతదేశ సారూప్య విరూపాలను గుర్తించడం ఈ వ్యాసం ఉద్దేశ్యం.

జీవనాధార వస్తువుల్ని ఉత్పత్తి చేసుకునే పద్ధతిలో సాధించిన అభివృద్ధిని బట్టి మోర్గన్ చేసిన మానవజాతి నాగరికతా పరిణామ మూడు దశల్నే ఎంగెల్సూ స్వీకరించాడు. అవి ఆటవిక యుగం, అనాగరిక యుగం, నాగరిక యుగాలు. మొదటి రెండు యుగాలు ఒక్కొక్కటి నిమ్నదశ, నడిమి దశ, ఉన్నత దశలుగా పునర్విభజింప బడతాయి. ఆటవిక యుగం నిమ్నదశలో చెట్లపై నివసిస్తూ, కాయలు దుంపలు తినడంతో ప్రారంభమై, నడిమి దశలో నిప్పును కనుక్కుని తిండికి జలచరాల్ని ఉపయోగించు కుంటూ వేటకు గద, ఈటెలను వాడడం దాకా సాగి, ఉన్నత దశలో విల్లూ, అంబూ కనిపెట్టి, కర్రతో పాత్రలు తయారు చెయ్యడంతో ముగుస్తుంది.

ఇక అనాగరిక యుగంలో నిమ్నదశ కుండలు తయారు చేసుకోగలగడంతో ఆరంభమవుతుందని చెబుతూ ఇక్కడి వరకూ పరిణామ క్రమం అన్ని ప్రాంతాల్లో ఒకే మాదిరిగా సాగినా పశువుల్ని మచ్చిక చేసుకోవడమూ, మొక్కల్ని పెంచడమూ ప్రారంభం కావడంతో ప్రపంచంలోని రెండు ఖండాల్లోని ప్రాకృతిక వైవిధ్యం అక్కడి ప్రజల అభివృద్ధి పథాన్ని నిర్ణయించిందన్న ఎంగెల్స్

నడిమి దశలో పశువుల, మొక్కల పెంపకం విస్తరించిందని చెప్పే క్రమంలో మొదటిసారి భారతదేశ ప్రస్తావన చేశాడు. పాలనూ, మాంసాన్ని అధికంగా ఇచ్చే జంతువుల్ని మచ్చిక చేసిన ఆర్యులు, సెమైట్లు పచ్చిక మైదానాల్లో పశుపాలకులుగా మనుగడ సాగించారని చెపుతూ... "భారతదేశ నదీతీరాలలోనూ, ఓక్సుస్ యక్సార్టస్ నదుల తీరాలలోనూ... ఉన్న పచ్చిక బీళ్లలో ఆర్యను తెగలు ఇట్లాగే జీవించారు" అంటాడు. ఆర్యులు భారతదేశం వెలుపల నుంచి వచ్చారని అంగీకరిస్తే ఆ తర్వాత వచ్చిన మహమ్మదీయుల్ని విదేశీయులని ముద్ర వేసే సాంస్కృతిక జాతీయవాదులు ఆర్యులు కూడా విదేశీయులని అంగీకరించవలసి వస్తుందని, ఆర్యుల జన్మభూమి భారతదేశమేనని వాదిస్తారు. వారికి ఈ సందర్భంలో ఎంగెల్స్ చేసిన ఒక నిర్ధారణ చెంపపెట్టవుతుంది. ఎంగెల్స్ ఇట్లా రాశాడు "బహుశా అటువంటి బీళ్ల ప్రాంతంలోనే వారు (ఆర్యులు, సెమైట్లు) పశువుల్ని మచ్చిక చెయ్యడం నేర్చుకుని ఉంటారు. తత్ఫలితంగా తర్వాతి తరాల వారికి వాళ్ళు ఈ పచ్చిక ప్రాంతాలలోనే పుట్టినారనిపించి వుంటుంది. కానీ ఈ బీడు భూములలో మానవజాతి జన్మించే అవకాశం లేదు. ఆటవిక మానవులకు ఈ మైదానాలు ఎంత మాత్రమూ నివాసయోగ్యం కావు". ఆదిమ మానవుడి పనిముట్లు, వస్తువులు లభించిన ప్రాంతాలను, మానవ జీవావిర్భావానికి కావలసిన భౌగోళిక వాతావరణాంశాల్ని గమనించినప్పుడు ఆర్యుల జన్మభూమి భారతదేశమేననీ, అందునా గంగాతీరమనే వారి వాదన ఎంత కుట్రపూరితమో అర్థమవుతుంది. సమకాలీన భారతీయ సాంస్కృతిక సమస్యల్లో ముఖ్యమైన దానికి 150 ఏళ్ళ క్రితమే ఎంగెల్స్ సహేతుకమైన సమాధానం పరోక్షంగానైనా ఇవ్వడం విశేషం.

మానవుడి భౌతిక అవసరాలను తీర్చుకునే క్రమంలో ఉత్పత్తి చేసుకున్న పరికరాల ఆధారంగా జరిగిన పై యుగ విభజనకు సమాంతరంగా లైంగిక సంబంధాలలో వచ్చిన మార్పు కుటుంబ వ్యవస్థ ఆవిర్భావానికి దారి తీసిందని చెబుతూ ఏ యుగంలో ఏ పరిణామం జరిగిందో చెప్పడం సాధ్యం కాదంటాడు ఎంగెల్స్. రెండవ ప్రకరణం అయిన 'కుటుంబం'లో కుటుంబ వ్యవస్థకు చేరుకోవడానికి ముందున్న దశలో మోర్గన్ చెప్పిన స్త్రీ పురుష సంబంధాల్ని పునరావలోకనం చేస్తాడు. వివాహ ఆదిమ దశలో స్త్రీ పురుష సంబంధాల్లో ఏ నియమాలు లేవనీ తెగలోని ప్రతీ పురుషుడు ప్రతి స్త్రీకి భర్త, ప్రతి స్త్రీ ప్రతి మగవానికీ భార్య అని చెపుతూ ఆ తర్వాత గుంపు పెళ్ళి పేరిట కొందరు మగవాళ్ళు అంతే సంఖ్యలో ఆడవాళ్ళు ఒకటిగా జీవించే వారని చెబుతారు.




ఈ సందర్భంలోనే తన కంటే ముందు ఈ రంగంలో కృషి చేసిన జర్మన్ పండితుడు బాహోఫెన్ చరిత్ర పరిణామంలో స్త్రీ పురుష సంబంధాల్ని మత కోణం లోంచి చూడడాన్ని ఖండించి అవి వాస్తవ జీవిత పరిస్థితుల్నించి పుడతాయని రుజువు చేస్తాడు. ఈ సందర్భంలోనే మోర్గన్‌ను ఉటంకిస్తూ అమెరికన్ రెడ్ ఇండియన్ తెగ ఇరాక్యూలలో ఉండే ఒక లాంటి ఏక భార్య, ఏక భర్త పద్ధతి గురించి చెబుతూ మగవాడు తన పిల్లల్నే కాక తన సోదరుల పిల్లల్ని కూడా తన బిడ్డలుగానూ, తన తోబుట్టువు (సోదరి) పిల్లల్ని మేనల్లుళ్ళు, మేనకోడళ్ళుగానూ – స్త్రీ తన పిల్లల్నే కాక తన అక్కాచెల్లెళ్ళ పిల్లల్ని కూడా తన బిడ్డలుగానూ, తన అన్నదమ్ముల పిల్లల్ని మేనల్లుళ్ళు, మేనకోడళ్ళుగానూ చూడడాన్ని చెబుతూ "భారతదేశంలోని ఆదిమ వాసులలోను దక్షిణ భారతదేశంలోని ద్రవిడ తెగల్లోనూ, హిందూస్థానంలోని గౌర (పశ్చిమబెంగాల్) తెగల్లోను ఈ వ్యవస్థ యధాతథంగా అమలులో ఉంది. దక్షిణ భారతదేశంలోని తమిళులలోనూ న్యూయార్క్ రాష్ట్రంలోని సెనెకా ఇరాక్యూలలోనూ రెండు వందల సంబంధాల వరకు సమానంగా కనిపిస్తాయి" అంటాడు. అమెరికాలోని రెడ్ ఇండియన్‌లందరిలో మాదిరిగానే భారతదేశంలోని ఈ తెగలలో కూడా రక్తసంబంధాల వ్యవస్థ (Consanguinity) కీ, అప్పటికి అమలులో ఉన్న కుటుంబ (family) రూపానికీ వైరుధ్యం ఉందంటాడు. ఒక దాని గురించి మరొక దానికి ఏ మాత్రం ఎరుక లేని అమెరికన్ ఆసియా ఖండాల్లో ఉన్న సారూప్యతకు విస్తుపోతూ తండ్రి, తల్లి, అత్త, మామ, అన్న, చెల్లి మొదలైన బంధుత్వాల చారిత్రక క్రమాన్ని వాటి సామాజిక బాధ్యతల్ని వివరించాల్సిన అవసరాన్ని నొక్కి చెపుతాడు.

ఈ పరిణామాల్ని దాటుకుంటూ ఏర్పడిన కుటుంబాల్ని నాలుగు రకాలుగా విభజిస్తాడు ఎంగెల్స్. అవి 1. రక్త సంబంధీకుల కుటుంబం 2. పునాలువన్ కుటుంబం 3. జంట పెళ్ళి కుటుంబం 4. దంపతి కుటుంబం.

రక్తసంబంధీకుల కుటుంబంలో స్త్రీ పురుషులిద్దరూ భార్యాభర్తలైతే వారి సంతానంలో స్త్రీ పురుషులు భార్యాభర్తలవుతారు. అట్లాగే వారి సంతానం కూడా. సంతానంలో స్త్రీ పురుషులు సోదరీ సోదరులై సరిగా ఆ కారణం చేతనే భార్యాభర్తలౌతారు. తల్లిదండ్రులకీ సంతానానికి మధ్య లైంగిక నిషేధం ఇందులో ప్రధాన అంశం.




కాగా రెండవదైన పునాలువన్ కుటుంబంలో సోదరీ సోదరుల మధ్య లైంగిక నిషేధం ముఖ్య లక్షణం. దీని ప్రకారం కొంత మంది అక్కాచెల్లెళ్ళు ఉమ్మడిగా పై వారైన కొంత మంది మగవారిని భర్తలుగా ఎంచుకుంటారు. వీరు అన్నదమ్ములే కానక్కర్లేదు. ఎవరైనా కావొచ్చు. అట్లాగే కొందరు అన్నదమ్ములు ఉమ్మడిగా పైవారైన ఆడవారిని భార్యలుగా స్వీకరిస్తారు. ఇటువంటి కుటుంబాలను మోర్గన్ పునాలువన్ (అంటే సహభాగులు) కుటుంబాలుగా పేర్కొన్నాడు. ఈ వ్యవస్థ తండ్రీ కూతురు, తల్లీ కొడుకులు ఒకే వివాహ బంధంలో ఉండడాన్ని నిషేధించింది. కానీ తండ్రీ కొడుకూ, తల్లీ కూతురు ఇతరులతో ఒకే వివాహబంధంలో ఉండడాన్ని పూర్తిగా నిషేధించలేదు. ఈ సందర్భంగా ఉమ్మడి భార్యలు ఉమ్మడి భర్తలు ఆటవిక అనాగరిక ప్రజల్లో సాధారణమేనని చెబుతూ మరోసారి ఎంగెల్స్ భారతదేశాన్ని ప్రస్తావిస్తూ గంగానదికి ఉత్తరాన అయోధ్య రాష్ట్రంలోని తికూర్లను గురించి వాట్సన్, కేమ్‌లు తమ 'ఇండియా దేశపు ప్రజలు' అనే పుస్తకంలో ఇటువంటి విషయమే రాశారు అంటూ ఇట్లా ఉటంకించాడు 'వారు పెద్ద పెద్ద కుటుంబాలతో కలిసి (అంటే లైంగికంగా) దాదాపు విచక్షణారహితంగా జీవిస్తున్నారు'.

పునాలువన్ కుటుంబ రూపం నుంచే గణ వ్యవస్థ ఆవిర్భవించిందని సూత్రీకరిస్తాడు ఎంగెల్స్. పునాలువన్‌తో సహా అన్ని రకాల గుంపు పెళ్ళిళ్లలో పిల్లలకు తండ్రి ఎవరో తెలియదు. తల్లి ద్వారానే వాళ్ళు గుర్తింపబడతారు. దీన్నే బాహోఫెన్ తల్లి హక్కు అన్నాడు. దీని ద్వారా ఒక తల్లి కూతుళ్ళు వారి వేలు విడిచిన అక్కాచెల్లెళ్ళు ఒక బృందం అవుతారు. ఈ బృందంలోని ఏ తరం అక్కాచెల్లెళ్ళకైనా వారి అన్నదమ్ములు భర్తలు కారు. ఇది గణం ప్రథమ దశ. దీని నుంచే సొంత గణంలో స్త్రీ పురుషుల మధ్య వివాహం నిషేధింపబడిన ప్రధాన సూత్రం మొదలైం దంటాడు ఎంగెల్స్. అట్లాగే రక్తబంధుత్వం లేని గణాల మధ్య వివాహం శారీరకంగా, మానసికంగా బలిష్టమైన సంతానం కలగడానికి దారి తీసిందనే మార్క్స్ రాసుకున్న నోట్సును ఉదహరిస్తాడు.

ఇక మూడవదైన జంట పెళ్ళి కుటుంబం వివాహ బంధం పరిధి అంతకంతకూ సంకుచితం అవుతూ వచ్చి గుంపు పెళ్ళిళ్లు అసంభవమై ఈ కుటుంబం అమలులోనికి వచ్చింది. ఇందులో ఒక మగవాడు ఒక ఆడమనిషి కలిసి జీవిస్తారు. స్త్రీ అతనితో ఉన్నంత కాలమూ ప్రాతివత్యం పాటించవలసిందే. కానీ మగవాడికి ఆ నియమం లేదు. ఇద్దరిలో ఎవరికి ఇష్టం లేకపోయినా సులువుగా విడిపోవచ్చు. పిల్లలు తల్లి దగ్గరే ఉంటారు. అయితే ఈ జంట పెళ్ళి గుంపు పెళ్ళి ఆచారాన్ని పూర్తిగా తొలగించలేకపోయిందని చెప్పే సందర్భంలో కొన్ని ఉత్సవ దినాలలో తెగ (కొన్ని గణాల కలయిక ఒక తెగ) లోని వాళ్ళంతా స్వేచ్ఛా సంగమానికి అంగీకరించే సంప్రదాయాన్ని చెబుతూ "ఇండియాలోని హోలు, సంతాలులు, పంజాలు, కొటార్లు మొదలైన వారిలోనూ, కొందరు ఆఫ్రికన్ తెగలలోనూ ఈ ఆచారాలు కనిపిస్తున్నాయి" అంటాడు. గుంపు పెళ్ళికి జంట పెళ్ళికి ఉండే సంధి కాలంలో వివాహానికి పూర్వం ఆడపిల్లలకు స్వేచ్ఛా సంగమ అవకాశం ఉండేదని చెప్పే సందర్భంలో కూడా 'భారతదేశపు ఆదివాసులు చాలా మందిలోనూ... అనేక అమెరికన్ రెడ్ ఇండియన్ తెగల్లోనూ ఈనాటికీ ఈ స్వేచ్ఛ అనుమతించ బడుతుంది' అంటాడు.

ఉత్సవ దినాల్లో స్వేచ్ఛా సంగమ సంప్రదాయం భారత దేశంలో కూడా ఉందని రాసిన ఎంగెల్స్ గుంపు పెళ్ళి, స్వేచ్ఛా సంగమం వంటి సంప్రదాయాలు మానవజాతికి అవమానకరంగా భావించి అవి లేవని నిరూపించడానికి మత పండితులు చేసిన ప్రయత్నాల్ని తిప్పికొట్టిన సందర్భంతో ఇటీవల తమిళనాడులో జరిగిన రచయిత పెరుమాళ్ మురుగన్ ఉదంతం జోడీ కడుతుంది. మురుగన్ నవల మధోరుభాగన్ (English : One Part woman తెలుగు : అర్ధనారి) తిరుచెన్‌గోడ్‌లోని అర్ధనారీశ్వరాలయ సంప్రదాయం నేపథ్యంగా ఉత్సవదినాన సంతానం కోసం మహిళ ఎవరో తెలియని మగవానితో జత కట్టడం ఇతివృత్తంగా రాయబడింది. పిల్లలు లేకపోవడం వల్ల సామాజికంగా ఎదుర్కొనే వివక్ష, ఆమె అంతస్సంఘర్షణ, భర్త ఉదాసీనత శక్తివంతంగా ప్రతిఫలింపబడిన ఈ నవలలో భర్త అనుమతి ఇచ్చినట్లు భావించిన ఆమె సంతానం కోసం మనిషి రూపంలో వచ్చే దేవుడితో అనుమతి ఉన్న ఆ ప్రత్యేక దినాన సంగమిస్తుంది. దీన్ని అవమానంగా భావించిన హిందూత్వ శక్తులు రచయిత మీద దాడి చేశాయి. మురుగన్ 'రచయితగా తాను మరణించినట్లు' ప్రకటించాడు. కానీ మద్రాసు హైకోర్టు రచయిత భావప్రకటనా స్వేచ్ఛను నిలబెడుతూ తీర్పునిచ్చింది. ఈ నేపథ్యంలో ఎంగెల్స్ రచన ఇప్పుడు మరింత ప్రాసంగికం అవుతోంది.

ఆటవిక, అనాగరిక యుగాలు దాటుకుని నాగరిక యుగంలోకి ప్రవేశించడంతో నాల్గవదీ, నేటికీ సమకాలికమైనదీ అయిన దంపతి కుటుంబ వ్యవస్థ ఆవిర్భావానికి దారి తీసిన పరిస్థితుల వివరణ ఇట్లా సాగుతుంది. పశువుల మందల్ని పెంచడం, లోహాలను కరిగించి పోత పొయ్యడం, నేత నేయడం, వ్యవసాయం చేయడం వచ్చాక అదనపు ఉత్పత్తి కోసం అదనంగా శ్రమించడం అవసరమైంది. అందుకు యుద్ధాల్లో పట్టుబడ్డ ఖైదీలు బానిసలుగా ఉపయోగపడ్డారు. ఈ నూతన సంపద మొదట్లో గణానికే చెందినా క్రమంగా అవి సమిష్టి కుటుంబ పెద్దకు దఖలు పడింది. జంట పెళ్ళిళ్లు ఘనీభవించడంతో సంతానానికి తండ్రి ఎవరో స్పష్టమైంది. పనిముట్లు మగవాడివై తిండి సంపాదన అతని బాధ్యత అయింది. క్రమంగా సంపద కుటుంబాల సొంత ఆస్తిగా మారి మగవాడి పెత్తనం పెరిగింది. తన సంతానానికి వారసత్వం కలిగించాలనే ప్రేరణ కలిగింది. గణంలోని మగవాళ్ళ సంతానం గణంలోనే ఉండాలనీ, ఆడపడుచుల సంతానం ఆ పిల్లల తండ్రి గణానికి చెందాలనే నిర్ణయంతో ఒక్క దెబ్బకు తల్లి హక్కు కూల్చివేయబడి, తండ్రి హక్కు ముందుకు వచ్చింది. ఇట్లా చెబుతూ స్త్రీ జాతికి ఇది ప్రపంచ చారిత్రక ప్రాముఖ్యం కలిగిన ఘోర పరాజయం అంటాడు ఎంగెల్స్. ఈ పితృస్వామిక వ్యవస్థలో మగవాడి అధీనంలో భార్య, పిల్లలు, బానిసలు ఉండడానికి మార్క్స్ జతపరచిన మరో రెండు మాటల్ని ఇట్లా ఉదహరించాడు. "ఆధునిక కుటుంబంలో బానిసత్వమే కాదు భూదాస్యం కూడా బీజరూపంలో మనకు కనిపిస్తుంది. ప్రారంభం నుంచీ వ్యవసాయపు పనులతో ఇది జతపడి ఉంది. తర్వాత తర్వాత సమాజంలోనూ రాజ్యంలోనూ బయటపడిన వైరుధ్యాలన్నీ దీనిలో సూక్ష్మరూపంలో కనిపిస్తాయి".

ఇప్పుడు మాట్లాడుతున్న కుటుంబాలు ఒక గృహస్వామి, ఒక గృహస్వామిని ఉన్న సమిష్టి కుటుంబాలుగా గుర్తిస్తే సాగు భూములు కూడా సమిష్టిగా ఉండే సందర్భాన్ని "అలెగ్జాండర్ ది గ్రేట్ కాలానికి చెందిన నియార్కుస్ భారతదేశంలో సమష్టి కుటుంబాలున్నాయనీ, సాగు భూములు వాటి సమష్టి స్వాధీనంలో ఉన్నాయనీ రాశాడు" అంటూ 'ఆ ప్రాంతాలలో పంజాబు వాయువ్య సరిహద్దు రాష్ట్రాలలో ఈనాటికీ ఆ ఆచారం కొనసాగుతుంది' అంటాడు ఎంగెల్స్.

తల్లి హక్కు రద్దయి దంపతీ వ్యవస్థ వైపు సమాజం వేగంగా పురోగమించినా బహుభార్యత్వం, బహుభర్తృత్వం అరుదుగా చారిత్రక విలాస ఫలితాలుగా కనిపిస్తాయని చెప్పే సందర్భంలో "భారతదేశంలోనూ, టిబెట్‌లోనూ కనిపించే బహుభర్తృత్వ పద్ధతి ఇల్లాంటి అరుదైన ఆచారమే. వీటికి మూలం గుంపు పెళ్ళి ఆచారమై అయి ఉండొచ్చు" అంటూ "భారతదేశం నాయర్లలో ఒక ఆచారం ఉంది. వారిలో ముగ్గురు, నలుగురు లేక అంతకన్నా ఎక్కువ మంది ఒక భార్యను కట్టుకుంటారనేంత వరకు ఖాయం. వారిలో ప్రతి ఒక్కడూ మరికొందరితో కలిసి మరి కొంతమంది భార్యల్ని కలిగి ఉంటారు" అంటాడు.




ఈ నేపథ్యంలో చివరి దశ అయిన ఒక భార్య ఒక భర్త ఉండే దంపతీ కుటుంబ వ్యవస్థ ఏర్పడింది. ఇది నాగరికత ప్రారంభ దశకు చిహ్నం. వివాహ బంధం గట్టిదనమే జంట పెళ్ళికి దీనికి తేడా. ఈ నూతన వ్యవస్థలో దంపతుల్లో ఎవరికి ఇష్టం లేకపోయినా వివాహాన్ని ఛేదించడం సాధ్యపడదు. కానీ ఆచరణలో మాత్రం మగవాడు వివాహ బంధాన్ని తెంచి భార్యను తోసేయగలడు. ఏకపతిత్వం స్త్రీకే విధి. మగవాడు ఏకపత్నీత్వాన్ని సులువుగా అతిక్రమించగలడు. ఇది స్త్రీ పాతివ్రత్యాన్ని ధృవపరచడానికీ బిడ్డల పితృత్వాన్ని స్థిరపరచడానికి గట్టిగా ఉపయోగపడింది. అయితే సహజ పరిస్థితుల మీద కాకుండా ఆర్థిక పరిస్థితుల మీద ఆధారపడిన తొలి కుటుంబ రూపం ఇది. స్త్రీ జాతిని పురుషుడు తన ఆధీనంలోకి తెచ్చుకున్న ఈ సందర్భంలో ఆదిమ కాలంలో స్త్రీ పురుషుల మధ్య ఎన్నడూ వ్యక్తం కాని వైరుధ్యం వ్యక్తమైందంటూ మార్క్స్ అంతకు ముందు వెలిబుచ్చిన అభిప్రాయాన్ని సమర్థిస్తూ దంపతీ వ్యవస్థ చారిత్రకంగా ముందంజే కానీ, ఈ యుగంలో వేసిన ప్రతి ముందడుగూ సాపేక్షంగా వెనుకడుగేననీ బానిసలూ, స్త్రీలు లొంగుబాటు కావడంతో రాబోయే కాలం నాటి వర్గ స్వభావం (బానిస, యజమాని సంఘర్షణ) స్త్రీ పురుష సమానత్వంలోని వైరుధ్యమూ తలెత్తాయంటాడు ఎంగెల్స్.

దంపతీ వివాహం స్త్రీ పురుషుల మధ్య ప్రేమ, సహృదయత వల్ల కాక ఆర్థిక కారణాల వల్ల తల ఎత్తడం వల్ల వివాహ బంధానికి వెలుపల మగవాళ్ళలో వ్యభిచారమూ, ఆడవాళ్ళలో జారత్వమూ వచ్చాయని ఎంగెల్స్ ఈ ఆచారాన్ని మోర్గన్ హెటెరిజమ్ అనడాన్ని పేర్కొంటాడు. దీన్ని ఒకనాటి గుంపుపెళ్ళి అవశేషంగా గుర్తించిన ఎంగెల్స్ హెటెరిజమ్ కుటుంబాన్ని నీడలా ఆవరించి నాగరిక




యుగంలో మానవజాతిని వెంటాడుతోందనీ అది నాగరిక యుగంలో వివిధ రూపాలలో కనబడుతుందని చెపుతాడు. ఈ క్రమంలో పవిత్రత కోసం స్త్రీ తన్ను తాను నామమాత్రంగా సమర్పించుకునే ఆచారంతో బయలుదేరి ధనం కోసం సంగమించడం మతధర్మంగా ప్రేమదేవతల దేవాలయాల్లో ఉండేదంటాడు. సంగమాల ద్వారా సంపాదించిన డబ్బు మొదట్లో దేవాలయాలకే చెందేదని తదనంతరం అది స్త్రీలకు చెంది, ఆధునిక అర్థంలో వ్యభిచారంగా పరిణమించిందని అనే సందర్భంలో "భారతదేశపు దేవదాసీలు, బయాదరే (నాట్యకత్తె అనే పోర్చుగీసు మాటకు అపభ్రంశం) లనబడేవారు మొట్టమొదటి వ్యభిచారిణులు. ప్రారంభంలో సమాజంలో ప్రతి ఆడదీ చేసి తీరవలసిన పనిని ఈ అర్చకురాండ్రు మాత్రమే స్త్రీ జాతి ప్రతినిధులుగా నిర్వహించేవారు అని, అంతటితో ఆగకుండా నాగరికత సృష్టించిన ప్రతి దానికీ రెండు ముఖాలున్నాయి. రెండు నాలుకలున్నాయి. అన్నీ ఆత్మవిఘాతాలు. పరస్పర విరుద్ధాలున్నూ. ఒక వైపు దంపతీ వివాహం. రెండో వైపున హెటెరిజమ్, దానితో పాటు ఉగ్ర రూపంలో సాగే వ్యభిచారం అంటాడు.

దంపతీ వివాహంలోనే మనం చెప్పే ఆధునిక స్త్రీ పురుష ప్రేమ ఏర్పడగలదని చెబుతూ ఆస్తి ఉన్న బూర్జువా వర్గాలలో మగవాడికుండే సర్వాధిపత్య స్వభావం వల్ల అది సాధ్యపడదంటూ ఆస్తి లేని తద్వారా మగవాడి పెత్తనం లేని శ్రామిక వర్గం భార్యాభర్తల్లో అది వీలవుతుందంటాడు. పెద్ద పెద్ద పరిశ్రమలు వచ్చి స్త్రీలను పనిలోకి ఆహ్వానించాయి. ఆమె కూడా డబ్బు సంపాదించడం ప్రారంభమైంది. మగవాడి ఆధిక్యతకు కారణమైనవన్నీ తుడుచుకుపోతున్నాయి. కాబట్టి వారి మధ్య గాఢమైన ప్రేమ వెల్లివిరియడానికి ఆస్కారం ఉంది. హెటెరిజమూ, జారత్వమూ యించుమించు లేకుండా పోతాయి. స్త్రీకి విడాకులు పొందే అధికారం లభించింది. అంటే శ్రామికుల వివాహాన్ని శబ్దార్థరీత్యా దంపతీ వివాహం అనగలమే కానీ, చారిత్రకార్థంలో ఆ మాట చెల్లదు అని సూత్రీకరిస్తాడు.

బూర్జువా వర్గ స్త్రీల గృహ నిర్వహణ బాధ్యత సాంఘిక కర్మ స్థాయిని కోల్పోయి కుటుంబ సభ్యుల వ్యక్తిగత సేవగా మారింది. ఆమె గృహవాసి అయ్యింది. కుటుంబం లోపల భర్త బూర్జువాకు, భార్య శ్రామికులకు ప్రాతినిధ్యం వహిస్తారు. ప్రజాతంత్ర రిపబ్లిక్ వీళ్ళిద్దరి మధ్య నున్న వైరుధ్యాన్ని అంతమొందించలేదు. స్త్రీ జాతినంతటిని పారిశ్రామిక రంగంలోనికి తెచ్చినపుడే వారు నిజంగా స్వతంత్రులవుతారని బోధపడుతుంది. అందుకు విడి కుటుంబం సమాజానికి ఆర్థిక యూనిట్‌గా ఉండే స్థితిని రద్దుపరచాలి అంటూ స్థిరాస్తిని, ఉత్పత్తి సాధనాలను సామాజిక ఆస్తిగా మార్చివెయ్యడం ద్వారా దంపతీ వివాహానికి కారణమైన ఆర్థిక కారణాలు తొలగిపోతాయి అనే నిర్ణయానికి వస్తాడు. ఉత్పత్తి సాధనాలు సామాజిక ఆస్తిగా మారడంతో శ్రామికవర్గం అదృశ్యం అవుతుంది. స్త్రీలు శరీరాన్ని అమ్ముకోవలసిన అవసరం పోతుంది. పిల్లల చదువూ పెంపకం సామాజిక బాధ్యత అవుతుంది. ఒక యువతి తాను ప్రేమించిన వాడితో జీవించడానికున్న నైతిక ఆర్థిక అడ్డంకులు తొలగిపోతాయి. కన్యాత్వ మర్యాద పట్ల ప్రజలు సహనం చూపుతారు. ఈ నేపథ్యంలో వ్యభిచారం అంతరిస్తుంది. కాబట్టి దంపతీ వివాహం (చారిత్రకార్థంలో) అంతరిస్తుంది. భార్యాభర్తల మధ్య ప్రేమ అంకురించి వాస్తవికార్థంలో దంపతీ వివాహం జరుగుతుంది. ఇతర ఒప్పందాలన్నిటికీ నిజమైన స్వేచ్ఛ ఉండాలనుకున్నప్పుడు దంపతులు కాబోతున్న యువతీ యువకులకు ఆ స్వేచ్ఛ ఉండొద్దా? భార్యాభర్తల ప్రేమ సరైన ఆదర్శం అయినపుడు ప్రేమించుకున్న వారే పెళ్ళి చేసుకోవడం, ప్రేమ లేని చోట పెళ్ళి చేసుకోకుండా ఉండడం మాత్రం ధర్మం కాదా? తల్లిదండ్రుల, బంధువుల, సంధానకర్తల హక్కుల కన్నా ప్రేమించుకున్న వారి హక్కు ఎక్కువ కాదా? అంటూ ప్రశ్నిస్తాడు.

పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం రద్దయ్యాక దాంపత్య సంబంధాలు ఎలా ఉంటాయనే దానికి బదులు ఏమేమి ఉండవో చెప్పగలం అంటాడు ఎంగెల్స్ చివరలో. ఎప్పుడు డబ్బుతోనో, అధికారంతోనో స్త్రీని మగవాడు వశపరచుకోలేడో, ఎప్పుడు నిజమైన ప్రేమతో తప్ప స్త్రీ మగవాణ్ణి చేరనవసరం లేదో, ఎప్పుడు ప్రేమికులు కలవడానికి అడ్డుగా ఉన్న ఆర్థిక కారణాలు తొలగిపోతాయో అప్పుడు ఈ సమస్యకు సమాధానం దొరుకుతుంది అని రెండవ ప్రకరణాన్ని ముగించాడు ఎంగెల్స్. ఈ ఆఖరు ఘట్టంలో భారతదేశపు ప్రస్తావన మనకు కనిపించదు. ❑

---

**స్త్రీలు పెద్ద ఎత్తున, సామాజిక స్థాయిలో ఉత్పత్తి ప్రక్రియలో పాల్గొనగలిగినప్పుడు మాత్రమే స్త్రీల సమయంలోనూ, సామర్థ్యంలోనూ అతి తక్కువ భాగం మాత్రమే ఇంటి చాకిరీకి ఖర్చయ్యే పరిస్థితుల్లో మాత్రమే - మహిళా విమోచన సాధ్యమవుతుంది.**

**- ఎంగెల్స్**

ఎంగెల్స్‌లో పలు కోణాలు

# ప్రపంచ కార్మికోద్యమ నిర్మాణంలో ఎంగెల్స్ పాత్ర

ఎం.సి. వెంకటేశ్వర్లు
ఎడిటర్, కమ్యూనిజం





ప్రపంచ కార్మికోద్యమానికి సైద్ధాంతిక ఆయుధాన్ని రూపొందించుటతో పాటు కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణానికి కారల్‌మార్క్స్, ఫ్రెడరిక్ ఎంగెల్స్ చేసిన సేవలు అనిర్వచనీయం. ఆ విషయంలో వారిద్దరిని వేరు చేసి చూడటం అసాధ్యం. ఆర్థిక, రాజకీయ, సామాజిక సమస్యలను శాస్త్రీయంగా అధ్యయనం చేసి "ఇంత వరకు నడిచిన సామాజిక చరిత్ర అంతా వర్గ పోరాటాల చరిత్రే" అని చేసిన నిర్వచనం చరిత్ర గమనాన్ని, సామాజిక విప్లవంలో వర్గ పోరాటాల ప్రాధాన్యతను స్పష్టం చేసింది. ప్రపంచ విప్లవోద్యమాలకు చోదక శక్తిగా ఉన్న వర్గ వైరుధ్యాలను బహిర్గతం చేసి కార్మిక, శ్రామిక వర్గాలను సైద్ధాంతికంగా చైతన్యవంతం చేసింది.

18వ శతాబ్దం మధ్య భాగంలో ఆవిష్కరింపబడిన పారిశ్రామిక విప్లవం ఉత్పాదక రంగంలోనూ, ఉత్పత్తి శక్తుల అభివృద్ధిలోనూ అనూహ్య మార్పులను తీసుకువచ్చింది. సామాజిక రంగంలో బూర్జువా (పెట్టుబడిదారుడు) కార్మిక వర్గాలు ఆవిర్భవించాయి. కార్ఖానా దశ నుండి పారిశ్రామిక సంస్థలు ఏర్పడటానికి బీజాలు పడ్డాయి. కాని సామాజిక పురోగమనానికి ఆటంకంగా ఉన్న ఫ్యూడల్ సంబంధాలను ఛేదించడంలో పెట్టుబడిదారీ వర్గానికి కార్మిక వర్గం సహకరించింది. అమెరికా, ఇంగ్లాండ్, ఫ్రాన్స్, జర్మనీ తదితర యూరప్ దేశాలలో సంభవించిన బూర్జువా ప్రజాతంత్ర విప్లవాలు ఆయా దేశాలలో ఫ్యూడలిజాన్ని ధ్వంసం చేసి పెట్టుబడిదారీ విధానాన్ని స్థాపితం చేశాయి. ఆధునిక బూర్జువా ప్రభుత్వాలు ఏర్పడ్డాయి.

ఈ పరిణామాలన్నింటినీ అధ్యయనం చేసిన మార్క్స్, ఎంగెల్స్‌లు భవిష్యత్తులో పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా జరిగే విప్లవోద్యమాలలో కార్మికవర్గం విప్లవకర పాత్ర వహించనున్నదన్న అభిప్రాయానికి వచ్చారు. ప్రపంచ పరిణామాలను శాస్త్రీయ దృక్పథంతో పత్రికల్లో విశ్లేషిస్తున్న మార్క్స్, ఎంగెల్స్‌లు 1842లో మొట్టమొదటగా కలుసుకున్నారు. అప్పటికే జర్మన్ తత్వవేత్త హెగెల్, భౌతికవాది ఫోయర్‌బాఖ్ రచనలను అధ్యయనం చేసిన మార్క్స్ భౌతికవాదిగా మారి తీవ్రవాద ప్రజాతంత్ర పత్రిక "రేనిషె సైటుంగ్"కు సంపాదకుడుగా పనిచేస్తున్నాడు.

ప్రష్యాలోని "బార్మెన్"లో జన్మించిన ఎంగెల్స్ తండ్రి సంపన్నుడైన బట్టల మిల్లు యజమాని. ఎంగెల్స్‌ని పెద్ద పారిశ్రామికవేత్తగా చూడాలన్నది తండ్రి కోరిక. తండ్రి కోరిక మేరకు 1843లో ఎంగెల్స్ ఇంగ్లాండ్ వెళ్ళాడు. కాని అతని ఆలోచనా విధానం వేరు. సమాజంలో దరిద్రులు, సంపన్నులు ఎందుకున్నారు? కార్మిక, రైతు పోరాటాలు ఎందుకు జరుగుతున్నాయి? వాటిని అధికారంలో ఉన్న వారు కర్కశంగా ఎందుకు అణచివేస్తున్నారు? తదితర ప్రశ్నలు ఎంగెల్స్‌ను వేధిస్తున్నాయి. తండ్రి అప్పగించిన బాధ్యతలను వదిలి లండన్‌లోని మురికివాడలను, కార్మికవాడలను సందర్శించి "ఇంగ్లాండులో కార్మికుల స్థితిగతులు" అన్న గ్రంథాన్ని రచించాడు.

ఆనాడు ఇంగ్లాండులో 12 గంటల నుండి 16 గంటల వరకు పని చేయించే వాళ్ళు. ఆరు సంవత్సరాల పసిబిడ్డలతో కూడా అమానుషంగా పని చేయించేవాళ్ళు. 1883లో ఒక పార్లమెంటరీ రిపోర్టు ఇంగ్లీషు కార్మికుల పరిస్థితి అమెరికాలోని బానిసల పరిస్థితి కంటే అధ్వాన్నంగా ఉందనీ, ఇంగ్లాండులో భూస్వామ్య నిరంకుశత్వం కంటే ఇండియాలోని బ్రిటీష్ పాలన కంటే ఫ్యాక్టరీ యజమానుల పాలన అధ్వాన్నంగా తయారయిందని చెప్పిందంటే ఇంగ్లాండులో ఆనాడు కార్మికుల పరిస్థితి ఎంత దయనీయంగా ఉందో స్పష్టమవుతుంది. ఈ పరిస్థితులన్నింటిని అధ్యయనం చేస్తున్న ఎంగెల్స్‌కు పెట్టుబడిదారీ సమాజంలో కార్మికులు, పేద ప్రజలు ఎదుర్కొంటున్న దయనీయ స్థితిగతులను మార్చడానికి కార్మికులను చైతన్యవంతం చేయగలిగిన నూతన సిద్ధాంతాన్ని ఆవిష్కరింపజేయాలన్న తపన పెరిగింది. ఈ నేపథ్యంలోనే ఎంగెల్స్ పారిస్‌లో ప్రవాసిగా ఉన్న మార్క్స్‌ను రెండవసారి కలిశాడు.

19వ శతాబ్దం ప్రథమంలోనే కార్మికోద్యమాలు ప్రారంభమయ్యాయి. రోజుకు 16 గంటలు పనిచేసినా కడుపు నిండా తినటానికి, ఒంటి నిండా కట్టుకోవడానికి బట్టలు, ఉండటానికి కనీస వసతులున్న ఇల్లు లేకుండా బ్రతకవలసిన పరిస్థితులు ఎందుకు దాపురించాయో తెలియని కార్మికులు యంత్రాలను శత్రువులుగా భావించి వాటిని ధ్వంసం జేసేవారు. దానినే 'లుద్దైట్ల'




ఉద్యమం అన్నారు. వ్యవసాయ కార్మికులు 1830 ప్రాంతంలో గడ్డివాములు, బ్యారన్లను తగులబెట్టారు. జర్మనీలో 1840లో సైలీషియా నేత కార్మికులు కూడా ఇటువంటి ఉద్యమాలనే నిర్వహించారు. క్రమంగా కార్మికవర్గం తమ దుస్థితికి యంత్రాలు, వ్యవసాయ ఉపకరణాలు కాదని గ్రహించి పని భారానికి వ్యతిరేకంగా, పెట్టుబడిదారీ దోపిడీకి వ్యతిరేకంగా సమ్మె తదితర ఉద్యమాలకు పూనుకున్నారు. వీటన్నింటినీ కూలంకషంగా అధ్యయనం చేసిన ఎంగెల్స్ తాను వ్రాసిన "ఇంగ్లాండులో కార్మికుల స్థితిగతులు" అన్న గ్రంథంలో సమ్మెలు కేవలం చిన్న చిన్న ఘర్షణల కంటే ఎక్కువేమీ కాకపోవచ్చు. కొన్ని సమయాలలో అవి ముఖ్యమైన పోరాటాలు కూడా కావచ్చు. సమ్మెలు కార్మికులకు మిలిటరీ శిక్షణ ఇచ్చే కళాశాలలు, యుద్ధ కళలో పాఠశాలలుగా సమ్మె పోరాటాలకు పోలింది ఏదీ లేదు" అని విశదీకరించాడు.

సంఘటితమవుతున్న కార్మిక వర్గాన్ని, వారిలో ఉన్న పోరాట పటిమను గుర్తించిన మార్క్స్, ఎంగెల్స్‌లు పెట్టుబడిదారీ సమాజాన్ని కూల్చి, నూతన సోషలిస్టు సమాజ నిర్మాణంలో కార్మిక వర్గం అగ్రగామి దళంగా ఉంటుందన్న అవగాహనకు వచ్చారు. పీడిత ప్రజల విముక్తి పెట్టుబడిదారీ సమాజం స్థానంలో సోషలిస్టు సమాజాన్ని నెలకొల్పటం ద్వారానే సాధ్యమన్న విశ్వాసాన్ని కార్మిక వర్గంలో కలిగించాలన్న లక్ష్యంతో ఎవరికి వారే యమునా తీరుగా ఉన్న ప్రపంచ కార్మిక వర్గాన్ని సమైక్యం చేయుటకు పూనుకున్నారు. వివిధ దేశాల విప్లవకారులతో సంబంధాలు పెట్టుకొని 1846లో "కమ్యూనిస్టు కమిటీస్ ఆఫ్ కరస్పాండెన్స్"ను ఏర్పాటు చేశారు.

ఫ్రాన్స్‌లో తీవ్రవాదులుగా ముద్ర పడ్డ బ్లాంక్విస్టుల నాయకత్వాన ఉన్న, "ఫెడరేషన్ ఆఫ్ ది జస్ట్"తో జర్మనీ, ఇటలీ, రష్యా, స్విట్జర్లాండ్ తదితర దేశాల ప్రభుత్వాలచే బహిష్కరింపబడ్డ విప్లవకారులైన ప్రవాసులు, మేధావులతో మార్క్స్, ఎంగెల్స్ సంబంధాలు పెట్టుకున్నారు. ఇలాంటి విప్లవకారులందరినీ ఇంగ్లాండ్‌లో సమావేశపరచి 1847లో కమ్యూనిస్టు లీగ్‌ను ఏర్పాటు చేశారు. లండన్, బ్రస్సెల్స్, పారిస్‌లలో లీగ్‌కు శాఖలు ఏర్పడ్డాయి. డిసెంబరు 1847లో జరిగిన రెండవ మహాసభ కార్మికవర్గ నిబంధనావళిని, కార్యక్రమాన్ని తయారుచేసే బాధ్యతను మార్క్స్, ఎంగెల్స్‌లకు అప్పగించడం జరిగింది. మహాసభ ఆదేశం మేరకు వారిరువురు 1848లో వ్రాసిన "కమ్యూనిస్టు ప్రణాళిక" నాటికి, నేటికి కార్మిక వర్గానికి కరదీపికగానే ఉన్నది. ప్రపంచ కార్మికులకు "కమ్యూనిస్టు ప్రణాళిక" ప్రప్రథమ విప్లవ కార్యక్రమ పత్రం. ప్రజలంతా సమానమే అన్న నినాదం స్థానంలో ప్రపంచ కార్మికులారా ఏకం కండి" అన్న నినాదాన్ని ముందుకు తెచ్చారు.

ప్రపంచాన్ని 1847లో ఆవరించిన ఆర్థిక సంక్షోభం 1948లో విప్లవాలకు దారి తీసింది. ఫ్రాన్స్‌లో ప్రారంభమైన విప్లవోద్యమం జర్మనీ, ఆసియా, ఇటలీ, హంగరీ, బెల్జియం, హాలెండ్ తదితర దేశాలన్నింటికీ వ్యాపించింది. అప్పుడే ఆవిర్భవించిన కమ్యూనిస్టు లీగ్‌కు, కమ్యూనిస్టు వర్గ పోరాట సిద్ధాంతానికి ఈ పరిణామాలు సవాల్‌గా నిలిచాయి.

మార్క్స్, ఎంగెల్స్‌లు సిద్ధాంతవేత్తలే కాదు. ఆచరణవాదులు కూడా. అప్పటికే బెల్జియంలో ప్రవాసంలో ఉన్న వారిద్దరు జర్మనీ వెళ్ళి కోలోన్ పట్టణంలోని రైన్ ప్రాంతంలో విప్లవోద్యమానికి నాయకత్వం వహించారు. కాని పెట్టుబడిదారీ వర్గం మోసం చేసి రాచరిక వర్గాలతో చేతులు కలపడంతో 1848లో వచ్చిన విప్లవాలన్నీ పరాజయం పాలయ్యాయి. దీంతో ఫ్రాన్స్, జర్మనీ విప్లవకారులపైనా, లీగ్ కార్యకలాపాలపైనా తీవ్ర నిర్భంధకాండ కొనసాగింది. అనేక మంది విప్లవకారులకు ఉరిశిక్షతో పాటు, జైలుశిక్షలు పడ్డాయి. కార్మిక వర్గంలో పోరాట తత్వం సన్నగిల్లింది. అదేకాలంలో విప్లవోద్యమాలు తిరోగమించినా పారిశ్రామికాభివృద్ధి జరిగి కార్మిక వర్గం సంఖ్య పెరిగింది.

చెల్లా చెదురైన కమ్యూనిస్టు లీగ్‌ను పునర్నిర్మాణం చేయుటకు మార్క్స్, ఎంగెల్స్‌లు పూనుకున్నారు. కానీ లీగులో ముఠాతత్వాలు ప్రబలాయి. తిరుగుబాట్లు చేయాలన్న దుందుడుకు వాదాలు బయలుదేరాయి. ఈ దశలో 1852లో కమ్యూనిస్టు లీగ్ అంతరించింది.

అయినా మార్క్స్, ఎంగెల్స్‌లు నిరుత్సాహపడలేదు. 1848 నాటి విప్లవాల ఓటమి నుండి తేరుకొని కార్మికవర్గం ఇంగ్లాండ్, జర్మనీ, ఇటలీ, పోలెండ్, అమెరికా తదితర దేశాలలో విప్లవ పోరాటాలకు దిగింది. వివిధ దేశాలలో జరుగుతున్న ఈ పోరాటాలను సమన్వయ పర్చి ముందుకు తీసుకుపోవడానికి కార్మికవర్గ అంతర్జాతీయ సంస్థ యొక్క ఆవశ్యకత గుర్తించబడింది. ఈ పరిస్థితుల్లో మార్క్స్, ఎంగెల్స్‌ల చొరవతో 1864 సెప్టెంబరు 28న లండన్‌లో మొదటి ఇంటర్నేషనల్ (మొదటి అంతర్జాతీయ సంస్థ) ఏర్పడింది. ఈ సంస్థకు "ఇంటర్నేషనల్ వర్కింగ్ మెన్స్ అసోసియేషన్" అని పేరు పెట్టారు. జార్జి ఓడ్జర్‌ను అధ్యక్షుడుగా, క్రైమరీను ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకున్నారు. బీహైడ్ పత్రికను అధికారపత్రికగా నడపాలని తీర్మానించారు.

మొదటి ఇంటర్నేషనల్‌లో భిన్న సైద్ధాంతిక భావాలున్న గ్రూపులున్నాయి. ట్రేడ్ యూనియన్ సంస్కరణవాదులు, సాయుధ పోరాటం నడపాలనే బ్లాంక్విస్టు దుందుడుకు వాదులు, సమ్మె పోరాటాలను వ్యతిరేకించే ప్రౌధానిస్టులు, ఊహాజనిత సోషలిస్టులు – లాసెల్లియన్లు, బకూనిన్ అనార్కిస్టులు బలంగా ఉన్నారు. మార్క్సిస్టులు తక్కువగా ఉన్నారు. అయినప్పటికీ ప్రపంచ కార్మికోద్యమాన్ని ఐక్యపరచడానికి, శాస్త్రీయ సోషలిస్టు సిద్ధాంతం మార్క్సిజం పునాదిగా కార్మిక వర్గాన్ని చైతన్యవంతం చేయుటకు మొదటి ఇంటర్నేషనల్ తీవ్రంగా కృషి చేసింది. మార్క్స్, ఎంగెల్స్‌లు కీలక పాత్ర వహించారు. వారిద్దరు చేసిన నిర్విరామ పోరాటం ఫలితంగా 1869లో బాస్లేలో జరిగిన నాల్గవ మహాసభ నాటికి ప్రౌధానిస్టులు, లాసెల్లియన్లు సైద్ధాంతికంగా ఓడింపబడ్డారు.

మొదటి ఇంటర్నేషనల్ యూరప్‌లో బూర్జువా ప్రజాస్వామిక విప్లవాలు ఉచ్ఛదశలో ఉన్న సమయంలో స్థాపించబడింది. 1870 నాటికి ఫ్యూడలిజం కూలిపోయి పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందే నూతన దశ ప్రారంభమయింది. దాంతో పాటు కార్మిక వర్గం సంఖ్య రీత్యా పెరగడమే కాక కార్మిక వర్గ పోరాటాలు జరిగాయి. ఓటింగ్ హక్కు కోసం బ్రిటన్ కార్మికులు, బానిస వ్యవస్థకు వ్యతిరేకంగా అమెరికాలో జరిగిన అంతర్యుద్ధం, జెనీవా, పారిస్‌లో జరిగిన అనేక సమ్మెలకు రెండవ ఇంటర్నేషనల్ మద్దతుగా నిలిచింది. మార్క్స్, ఎంగెల్స్‌ల కృషి ఫలితంగా ఇంటర్నేషనల్ పలుకుబడి పశ్చిమ యూరప్, అమెరికాలకు వ్యాపించింది. అనేక యూనియన్లు సభ్యత్వం కోసం దరఖాస్తులు చేసుకున్నాయి.

ఫ్రాన్స్, జర్మనీల మధ్య 1870 జులైలో ప్రారంభమైన యుద్ధం ఫలితంగా 1871 మార్చి 18న ఫ్రాన్స్‌లో బూర్జువా వర్గాన్ని తొలగించి కార్మికవర్గం పారిస్ కమ్యూన్ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసింది. కానీ ఆ ప్రభుత్వాన్ని 1871 మే 28న కూల్చివేయుటతో మొదటి ఇంటర్నేషనల్ సంక్షోభంలో కూరుకుపోయింది. వివిధ దేశాల్లో ఉన్న ఇంటర్నేషనల్ అనుయాయులైన మార్క్సిస్టు, బకూనిస్టులు లాసెల్లియన్ల మధ్య తీవ్ర సైద్ధాంతిక విభేదాలు ఏర్పడ్డాయి. మరో పక్క అనేక దేశాలలో కార్మిక వర్గం, విప్లవకారులపై తీవ్ర నిర్బంధ కాండ విధించారు. ఈ పరిస్థితుల నుండి బయటపడటానికి, తిరిగి ప్రపంచ కార్మిక వర్గాన్ని ఐక్యం చేయడానికి, సంస్కరణవాద, ఊహాజనిత, అరాచకవాద సైద్ధాంతిక భావజాలాలను ఓడించి మార్క్సిస్టు సిద్ధాంత ప్రాతిపదికపై వివిధ దేశాలలో కార్మిక సంస్థలను పటిష్టం చేయుటకు, మొదటి ఇంటర్నేషనల్‌ను పునర్నిర్మాణం చేయుటకు మార్క్స్, ఎంగెల్స్ తీవ్ర కృషి చేశారు. వీరిద్దరి కృషి ఫలితంగా రాజకీయ పార్టీ నిర్మాణ అవసరాన్ని, మార్క్సిస్టు సైద్ధాంతిక భావజాలాన్ని కార్మికోద్యమం గుర్తించేట్టు చేయడంలోనూ, కార్మికోద్యమంలో




అంతర్జాతీయతను పెంపొందించడంలో మొదటి ఇంటర్నేషనల్ చరిత్రాత్మక పాత్ర నిర్వహించింది. అయినా ఇంటర్నేషనల్‌ను ఐక్యంగా ఉంచడంలో మార్క్స్, ఎంగెల్స్ సఫలీకృతులు కాలేకపోయారు. చివరకు 1876లో మొదటి ఇంటర్నేషనల్ రద్దయింది.

ప్రపంచ కార్మిక, కమ్యూనిస్టు ఉద్యమాలకు మార్గదర్శి, శాస్త్రీయ మార్క్సిస్టు, సోషలిస్టు సిద్ధాంత ఆయుధాన్ని అందించిన మహనీయుడు మార్క్స్ 1883 మార్చి 14న చనిపోయాడు. ఆయన వారసత్వాన్ని కొనసాగించవలసిన బాధ్యత సహచరుడు ఎంగెల్స్‌పై పడింది.

జర్మన్ మార్క్సిస్టుల పిలుపుపై ఫ్రెంచి కమ్యూనిస్టుల చొరవతో 1889 జులై 14న రెండవ ఇంటర్నేషనల్ ఆవిర్భావ సభ పారిస్‌లో జరిగింది. ఆ సభకు 20 దేశాల నుండి 391 మంది ప్రతినిధులు హాజరయ్యారు. అదే సమయంలో లీగల్ చట్రంలోనే సోషలిజం సాధించగలమనే పాసిస్టుల ఆధ్వర్యంలో మరో రెండవ ఇంటర్నేషనల్ సభ పారిస్‌లోనే జరిగింది. రెండు మహాసభలను ఏకం చేయడానికి జరిగిన ప్రయత్నాన్ని ఎంగెల్స్ వ్యతిరేకించాడు. మార్క్సిజం సిద్ధాంతాన్ని ఆయుధంగా చేసుకొని కార్మిక వర్గ పార్టీ పెట్టుబడిదారీ వ్యవస్థను కూలదోయకుండా తనను తాను విముక్తి చేసుకోలేదని, పెట్టుబడిదారీ చట్రంలో సోషలిజాన్ని సాధించడం సాధ్యం కాదని ఎంగెల్స్ స్పష్టం చేశాడు.

మార్క్స్ సహచరుడుగా, మార్క్సిజం సిద్ధాంత రూపకల్పనలో సహ వ్యవస్థాపకునిగా, సైద్ధాంతికంగా, నిర్మాణ పరంగా కార్మిక వర్గాన్ని చైతన్యపరచడంలోనూ, సోషలిజాన్ని ఒక ఉద్యమంగా తీసుకురావడంలోనూ, మార్క్స్ వారసుడుగా మార్క్స్ మరణానంతరం రెండవ ఇంటర్నేషనల్ స్థాపనలో ఎంగెల్స్ పాత్ర ప్రపంచ కార్మిక కమ్యూనిస్టు ఉద్యమం నుండి విడదీయరానిది. ఈనాడు అనేక దేశాలలో కమ్యూనిస్టు పార్టీలు, కార్మిక సంఘాలు సామ్రాజ్యవాదానికి, పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా సమరశీల ఉద్యమాలు జరుపుతున్నారంటే మార్క్స్, ఎంగెల్స్‌లు రూపొందించిన మార్క్సిజం సిద్ధాంత స్ఫూర్తితోననేది నిర్వివాదాంశం. ❑



# ప్రకృతి పరిరక్షణకై ఫ్రెడరిక్ ఎంగెల్స్ మార్గదర్శనం




డా॥ పి.నారాయణరావు

నేడు వాతావరణ మార్పుల వలన కలిగే పర్యవసానాల్లో ప్రకృతి వైపరీత్యాల ప్రకోపం ప్రపంచ వ్యాపితంగా మానవాళి చవిచూస్తోంది. ఈ వాతావరణ మార్పులను అరికట్టడంలో అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలు విఫలమౌతున్నాయి. ప్రపంచ దేశాలు ఇప్పటికీ పాతికసార్లు ప్రతి సంవత్సరం సమావేశమౌతూనే వున్నా ఏకాభిప్రాయానికి రాలేకపోతున్నాయి. బహుళజాతి కంపెనీల వత్తిడికారణంగానే ఇలా జరుగుతుందని పరిశీలకులు విశ్లేషిస్తున్నారు. ఈ నేపధ్యంలో 150 సంవత్సరాల క్రితమే తన 25 ఏళ్ళ ప్రాయంలో మహోపాధ్యాయుడు, మహా తత్వవేత్త అయిన ఫ్రెడరిక్ ఎంగెల్స్ తన రచనలలో పరిణామ క్రమంలో ప్రకృతికి మానవునికి వున్న అవినాభావ సంబంధాన్ని గురించి, పెట్టుబడిదారీ ఉత్పత్తి ప్రక్రియలో శ్రామికుని పాత్ర గురించి ఎంతో వివరంగా తెలియజేశారు. వారి ఆలోచనావిధానం నేటికీ మనకు ఎలా మార్గదర్శకంగా వుంటుందో ఇప్పుడు చూద్దాం.

ఫ్రెడరిక్ ఎంగెల్స్ 1876లో రచించిన "వానరుడు నరుడైన క్రమంలో శ్రమ పాత్ర" అనే వ్యాసంలో ఇలా వ్రాశారు.

"ఏది యేమైనప్పటికీ, ప్రకృతిపై మానవ విజయాలను చూసి మనలను మనం అతిగా పొగడుకోనవసరం లేదు. ఎందుకంటే అటువంటి ప్రతి ఒక్క విజయానికి ప్రకృతి మనపై పగ తీర్చుకుంటుంది. ప్రతి విజయమూ మొదటిసారి మనం ఆశించిన ఫలితాలను కలిగిస్తుందన్న మాట నిజమే. కాని రెండవసారి, మూడవసారి అది పూర్తిగా భిన్నమైన, ఆశించిన ఫలితాలను (తరచుగా మొదటిదానిని తుడిచి పెట్టేసే వాటిని) కలిగిస్తుంది. మెసపొటేమియా, గ్రీస్, ఆసియా మైనర్లలోనూ, యితర చోట్ల సాగుభూముల కోసం అడవులను నిర్మూలించిన జనం, అడవులతో పాటు తేమను గ్రహించి నిల్వ చేసే కేంద్రాలను నాశనం చేయడం ద్వారా ఆయా దేశాలలో ప్రస్తుతమున్న దౌర్భాగ్య స్థితికి తాము బీజాలు వేస్తున్నట్లు కలలో కూడా అనుకొని వుండరు. ఆల్ప్ పర్వత ప్రాంతపు ఇటాలియన్లు దక్షిణ చరియలపైన గల పైన్ అడవులను (ఇవి ఉత్తర చరియలలో సురక్షితంగా వున్నాయి) పూర్తిగా కొట్టి వేసినప్పుడు, తాము ఆ విధంగా చెయ్యడం వల్ల తమ ప్రాంతంలో పాడిపరిశ్రమను సమూలంగా నిర్మూలిస్తున్నామన్న సంగతి వారికి సూచనప్రాయంగా కూడా తెలియదు. ఈ విధంగా చెయ్యడం ద్వారా ఏడాదిలో ఎక్కువ కాలం కొండ చరియలలో నీరు లేకుండా చేసున్నామని, వర్షాకాలంలో మైదానాలపైకి మరింత భయంకరమైన వరదలు వచ్చే అవకాశాన్ని కల్పిస్తున్నామని వారికి చూచాయగా కూడా తెలియదు. ఐరోపాలో బంగాళాదుంపలను వ్యాపింప చేసిన వారికి, యీ పిండి దుంపలతోపాటు తాము గండమాల వ్యాధిని సైతం వ్యాపింప చేస్తున్నామన్న సంగతి తెలియదు. ఈ విధంగా ప్రకృతిపై మన శాసనం ఏ విదేశీ జాతిపైనో ఒక విజేత శాసనం మాదిరిగా చలామణీ కాదని, అదేదో ప్రకృతికి వెలుపలగల వ్యక్తి అమలు జరిపే శాసనం వంటిది కాదనీ, అందుకు భిన్నంగా రక్త మాంసాలనూ, మెదడునూ కలిగిన మనం ప్రకృతికి చెందిన ప్రాణులమేనని, మన అస్తిత్వం దాని మధ్యనేనని ప్రకృతి నియమాలను తెలుసుకుని వాటిని సరిగా వర్తింప చేయగల సామర్థ్యాన్ని కలిగి వుండటంలోనే దానిపైన మన ఆధిపత్యమంతా యిమిడి వుందనీ, మిగిలిన ప్రాణులకన్నా మన ఆధిక్యత యిందులోనే వుందనీ అడుగడుగునా మనకు గుర్తు చెయ్యబడుతున్నది".

పై వాక్యాలు నేటికీ మానవాళికి శిరోధార్యాలుగా పరిగణించాల్సిన అవసరం ఎంతైనా వుంది. అంతేకాకుండా ఈ వ్యాసంలోనే బూర్జువావర్గం లాభాపేక్షే పరమావిధిగా పెట్టుబడిదారీ ఉత్పత్తి క్రమంలో ప్రకృతిని లెక్కచేయక హ్రస్వ దృష్టితో ఎలా వ్యవహరిస్తుందనే విషయాన్ని ఈ విధంగా వివరించారు.

"బూర్జువా వర్గపు సామాజిక శాస్త్రమైన సంప్రదాయక రాజకీయార్థ శాస్త్రం ప్రధానంగా ఉత్పత్తికీ, మారకానికి సంబంధించిన రంగంలో మానవ కార్యకలాపాలు సూటిగా ఉద్దేశించిన సామాజిక పర్యవసానాలను మాత్రమే పరిశీలిస్తుంది. ఏ సామాజిక వ్యవస్థకు యిది సైద్ధాంతిక అభివ్యక్తీకరణా, ఆ సామాజిక వ్యవస్థకు యిది పూర్తిగా అనురూపమైనది. తక్షణ లాభాల నిమిత్తమే వైయక్తిక పెట్టుబడిదారులు ఉత్పత్తి, మారకాలలో నిమగ్నులై వున్నందున, వెను వెంటనే వచ్చే అత్యంత తక్షణ లాభాలను మాత్రమే ముందుగా పరిగణనలోకి తీసుకోవటం తయారిత లేదా కొనుగోలు చేసిన సరకును సాధారణంగా

